

"బీటిల్స్"నలుగురితో ఫొటో తీయించుకుని మురిసిపోతున్న ఒక యువతి.



RF
RAGHURAM FILMS (P) LTD.
రఘురామ్ ఫిలిమ్స్

# కలవారి కోడలు

నిర్మాత * దర్శకుడు కె. హేమాంబరధరరావు

ఆంధ్రప్రదేశ్-వాణీ రిలీజ్ మైసూరు సూర్యాఫిలిం ఎక్స్ఛేంజి - బెంగుళూరు

Vijaya Publicities

మీ కృషియే దేశానికి సౌభాగ్యం

మీ పొదుపే రక్షణనిధికి మదుపు



# క థ లు

27—3—64 సంచికలో యద్దనపూడి సులో చనారాణిగారు వ్రాసిన "ఐ లవ్ యు" కథ చదివాను. కథ అల్లిక బాగానే ఉంది. కాని, అటువంటి ఉద్దేశముతోనే మావంటివా రెవరైనా కథ రాస్తే, భారతస్త్రీ లందరూ మమ్మల్నెంతైనా విమర్శి స్తారు. కాని, భారతస్త్రీ అయివుండి రచయిత్రి గారు ఇటువంటి ఉద్దేశముతో కూడిన కథను రాయటం సభ్యంగా లేదని నా అభిప్రాయం. దీనిని బట్టి వారు భారతస్త్రీలను అంతగా అర్థం చేసు కున్నారన్నమాట. వివాహమైన స్త్రీ, పురుషుని ఒంటరిగా కలవటం వంటి సంఘటనలు హిందూ ఆచారానికే విరుద్ధం. అవివాహిత అయితే ప్రేమించ టంలో పొరపాటులేదు గాని వివాహమైన స్త్రీ అటువంటి ఉద్దేశాలకు పోకూడదు. ఇటువంటి పొరపాటు ఉద్దేశాలను సులోచలారాణిగారు ఇక మీదట తన కథలలో ప్రవేశపెట్టరని తలుస్తు న్నాను." ఇలాంటి కథలవల్ల పురుషులలో స్త్రీలపై చెడ్డ అభిప్రాయం కలగడానికి ఎంతైనా అవకాశం ఉంది."

బి. ఆర్. మూర్తి (విజయనగరం)

*  *  *

"ఐ లవ్ యూ" కథ కొత్త పోకడలతో హుందాగా సాగిపోయింది. పాత్రపోషణ, సన్నివేశ కల్పనలో కొత్త వెలుగులు గోచరిస్తాయి. ఒక్క మాటలో చెప్పా లంటే కథల్లోకెల్లా విశిష్టమైన స్థానం ఆక్ర మించుకుంది. 42 పేజీలో మూడవ కాలం చివరి పేరాలో 'జాన్' అని వేశారు. బహుశా 'హేస్టన్' బదులు అలా అచ్చు పొరబడి ఉందేమో !

వై. శ్రీనివాస్ (అనంతపురం)

*  *  *

'ఐ లవ్ యూ' యద్దపూడి సులోచనారాణి గారు వ్రాసిన కథ చాలా బాగుంది. ఇటువంటి కథలే ఎక్కువగా వేయుచుండాలి అని మేము కోరుచున్నాము.

ఎం. భానుమతి, కె. రాజేశ్వరి, జె. రాధాకృష్ణ.

*  *  *

27—3—64 తేదీ సంచికలో మీరు ప్రచు రించిన "ఐ లవ్ యూ" అనే కథ చదివేను. హేస్టన్ జాన్ దంపతులను కలుసునే వరకు కథ బాగానే సాగింది. ఆ తరువాత వ్రాసిన కథ చదువుతున్నంత సేపు నేనుభవించిన (భారతీయునిగా) మనో వ్యాకులత చెప్పలేను. చదువు,సంస్కారం కలిగిన వివాహ స్త్రీ (సుజాత) పాత్ర చిత్రీకరణలో కవయిత్రి భారత జాతికే తీరని అవమానం చేసేరనుకొంటున్నాను.

"నో! మగవాళ్లతో చేతులు కలపడం ఈ దేశపు ఆడవాళ్లకు ఆచారం కాదు," అని భారత నారీ సత్సాం ప్రదాయాన్ని అనుసరించిన సూజాత, ముక్కు మొగం ఎరుగని ఒక అన్య దేశీయుడు (హేస్టన్) తన్ను కల్పుకున్న తర్వాత, తన్ను (సుజాతను) చూడక పూర్వం, తన ఫోటో చూచి, తను పడిన శ్రమ విని, సుజాత (వివాహిత స్త్రీ) అతని ముందు చూపిన అనురాగం, భారతీయ స్త్రీ జాతికే తీరని కళంకం. వైకుంఠంలో (గెస్టు) తెలిసో తెలియకో అతని బాహువుల్లో నలిగి పోవటం (కథలో ఇదిగి పోయిన అని పడింది) శీలం కోసం ప్రాణ త్యాగం చేసే భారత నారీలోకానికే తీరని మచ్చ.

హేస్టన్ విమాన ప్రమాదంలో మరణించాడన్న రేడియో వార్త విన్న సూజాత స్పృహతప్పి పడి పోవడం, తర్వాత మతి పోవడం, అసలు విషయం తెలియని భర్త పూరూరా త్రిప్పుచూ ఇంకా వైద్యం చేయిస్తూనే ఉన్నాడు' అని హీనంగా చిత్రించటం చేచేతులా జాతికి ద్రోహం చేయడమే అను అనుకొంటున్నాను. సుజాత పాత్ర ఇంత పేలవంగా, అవమానకరంగా చిత్రీకరించడం, భారత జాతికే భరింపరాని అవమానంగా ఉందని తెలియజేయ డానికి చింతిస్తున్నాను.

డి. సత్యనారాయణ (గొల్లపూడి)

*  *  *

శ్రీమతి యద్దనపూడి సులోచనారాణి వ్రాసిన పెద్ద కథ "ఐ లవ్ యూ" సింప్లీ ఎక్సలెంట్" గా ఉంది.

రాజశేఖర్ (విజయవాడ)

*  *  *

27—3—64 సంచికలోని పెద్ద కథ ఎంతో బావుంది. సంఘటనలు, సన్నివేశాలు, సంభాషణలు, ఉదాత్తగా, ఉన్నంతంగా ఉజ్వలంగా ఉన్నాయి. పాత్రల చిత్రీకరణలో శ్రీమతి యద్దనపూడి సులో చనారాణి తనకు తానేసాటి అనిపించుకొన్నారు. సున్నితమైన మనస్తత్వాలు, గలిగిన హేస్టన్, సూజాత పాత్రలు మమ్మలిని అనుక్షణం వెంటాడుతూ ఉన్నాయి. ప్రేమ, అనురాగలనే పదాలకు నిజమైన అర్థమును, పరమార్ధమును చిత్రించారు. హృదయ ఫలకంపై శాశ్వతమైన ముద్ర వేసిన కథ ఇది.

మాధవీ దేవి. (సున్‌పేట)

*  *  *

'నాకీ పెళ్లి వద్దు', 'నాకీ అదృష్టం చాలు', 'గెలుపెవరిది ?' మొదలైన కథలు వ్రాసిన సులో చనారాణి 'ఐ లవ్యూ' కథతో మరో మెట్టు పైకి వెళ్లారు. ఈ వారం ఒకే కథ అని తెలిసి విచా రించినా, చదివాక ఆ విచారాన్ని సంతృప్తిగా మార్చుకున్నాను. ఈమధ్య వస్తున్న కథ లన్నిటి కన్న ఈ కథ కొంత బాగుంది.

గరిమెళ్ల మోతీలాల్ (భువనేశ్వరము)

# సీ రి ల్ క థ లు

"సంపెంగపొదలు" సీరియల్ చాలా బాగున్నది. ముఖ్యముగా గిరి, పాత్ర జీవితంలో అనేక మందిని అనుకరిస్తుందనే చెప్పాలి. శంకరు వంటి వ్యక్తులను కూడ మనం చూస్తూనే యున్నాము. రచయిత్రి ఇట్లాంటి పాత్రలు సృష్టించడం వల్ల కొంత మంది లోనైనా మార్పు వస్తుందని ఆశిస్తున్నాను.

యస్. దివ్యలత. (హైదరాబాద్)

*  *  *

13—3—64 ఆంధ్ర సచిత్రవారపత్రికలో ప్రచురించిన రామాయణ కథలో మహా సాధ్వి సీతా హనుమంతుడు వెళ్ళి చూచిన తరువాత రామచంద్ర గ్రభువుకు ఏమి చెప్పనని అడుగగా భర్తకి, మరిదికి నమస్కారములని చెప్పినట్లు వ్రాయబడినది. ఏ రామాయణములో కూడ ఇలా ఉన్నట్లు లేదు. మరిదికి నమస్కారములని చెప్పుట అసాంప్రదాయము.

కంభంమెట్టు శీతారామమ్మ (రామచంద్రరావుపేట)

# సినిమా వ్యాసం

20—3—64 ఉగాది సంచికలో శ్రీ భట్టారం చంద్రశేఖర్ గారు రచించిన "నేను సినిమాలో కోరే దేమిటి"? అను వ్యాసము, తృతీయ బహుమతి పొందిరి, అందు రచయిత తెలిపిన అభిప్రాయములు ప్రథమ శ్రేణికి చెందినవే. మెడికల్ కాలేజీ విద్యా ర్థిగా అతడు, జబ్బుపడిన నేటి సినిమా రంగమునకు చికిత్స గురించి ఇచ్చిన సలహాలు స్వస్థత చేకూర్చు టకు ప్రస్తుత పరిస్థితులలో అవసరమని తెలియు చున్నది. రచయితకు అభివందనములతో బాటు నూతన సంవత్సర శుభాకాంక్షలు.

సుమతి (ఉదయనగర్)

*  *  *

తెలుగు తెర నటమణి శీష్మలు, అశేషాంధ్ర ప్రజాభిమానులు నటరాజ బిరుదాంకితులు అయిన శ్రీ అక్కినేని నాగేశ్వరరావు గారితో ఇంటర్వ్యూ జరిపి, అమెరికా వెళ్తున్న సమయాన వారి మనసులోని భావాలను స్పష్టంగా తెలియజేశారు.

ప్రముఖ తార 'టి.కృష్ణకుమారి' గారు పల్లె మనసులును చక్కగా గ్రహించారని, వారి వ్యాసమే చెబుతూంది. ఇంత చక్కగా పల్లె ప్రజల మనసు లను గ్రహించి, వ్యాసం వ్రాసిన వారికి సైతం నా నమస్కృతులు తెలియజేస్తున్నాను.

'సినిమాలో నేను కోరేదేమిటి?' అన్న విష యాన్ని గూర్చి వ్రాసిన బహుమతులు పొందిన మూడు వ్యాసాలు చాలా బాగున్నాయి. నేటి సినిమాలలో లలోగల లోపాలను అందరూ బాగా వివరించారు.

సత్యవతీశాంతారావ్ (విశాఖ)

# స రా గ మా ల

వి. ఎ. కె. రంగారావుగారు 57 వ పేజీలో "బంగారు తిమ్మరాజులో" "నాగమల్లి కోనలోన నవ్వింది లేడికూన" అని వ్రాశారు. కాని సిని మాలో నక్కింది లేడికూన అని వినిపిస్తుందికదా ! అచ్చు పొరపాటా లేక ఆయన వ్రాసింది నిజ మేనా !

పి. వి. ప్రభాకరరావు (మచిలీపట్నం)

# కా ర్టూ ను

20—3—64 పత్రికలో 46 వ పేజీలోని కార్టూనులో దొంగ "అబ్బే......విూ కిటికీని తుడు స్తున్నానండి....... అంతే.....అంతే" అంటున్నాడు. కాని అతని చేతిలో ఉన్నది గునపం. గునపంతో కిటికీలను గాని, మరి వేటినైనా గాని తుడుస్తారా? ఎవరైనా? ఈ కార్టూను చిత్రించటంలో గల సమంజసతను వివరిస్తారని ఆశిస్తాను.

జి. రామశేషన్ (అనంతపురం)

# బొ మ్మ ల క థ

నా అభిమాన ఆంధ్ర సచిత్ర వారపత్రికలో ప్రచురితమవుతున్న 'స శీల గ్రహించిన సత్యం' బొమ్మలకథ ప్రతివారం 'సస్పెన్స్'తో నడుస్తోంది. అందుకు దేవికగారికి నా అభినందనలు.

మిక్కిలినేని జగదీష్‌బాబు (విజయవాడ-2)★

# ఆంధ్రసచిత్ర వారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు

శుక్రవారం: 10—4—'64
క్రోధినామ సం॥ అధిక చైత్ర బహుళ త్రయోదశి
సంపుటము: 56 సంచిక: 32

స్థాపితము:
1908

*

ముఖ్య సంపాదకుడు:
శివలెంక శంభుప్రసాద్

*

సంపాదకుడు:
శివలెంక రాధాకృష్ణ

*

## ఒక సంవత్సరం చందా వివరాలు

ఇండియా రూ 15.60. ఇతర దేశాలు ఓడమీద (Sea Mail) రూ. 28.60. విమానం ద్వారా (Air Mail) బ్రిటన్, జర్మనీ, ఇతర యూరోప్, ఆఫ్రికా దేశాలు రూ. 120.00. అమెరికా రూ. 176.80. ఆస్ట్రేలియా రూ. 148.20.

విడిప్రతి 30 న.పై.
సంవత్సర చందా 15.60 న.పై.
6 మాసాల చందా 7.80 న.పై.

*

ఆంధ్రపత్రిక కార్యాలయము
7. తంబుచెట్టి వీథి, మద్రాసు-1


## మనలో మాట

'రామేశ్వరం' మీద వ్యాసం, ఎలాగయితేనేమి, ఈ సంచికలో వెయ్యగలిగాము! త్వరలో 'వారణాసి' గురించిన సచిత్రవ్యాసం కూడా ఒకటి ప్రచురిస్తాము...

* * *

ఈ సంచిక 58వ పుటలో ఒక ఇంగ్లిష్ వ్యాకరణ పుస్తకం సమీక్ష వేశాము. సాధారణంగా ఆంధ్రసచిత్ర వార పత్రికలో పుస్తక సమీక్షలకు తావు కల్పించకపోయినప్పటికీ ఈ గ్రంథం ప్రస్తుత పరిస్థితులలో చాలా ప్రాముఖ్యత కలదిగా భావించి ఈ సమీక్ష ప్రచురించాము.

* * *

ఇంతకుముందే ప్రచురించిన 'ఐ లవ్ యూ' అనే కథ సుమారు 31 కాలంల నిడివి కలది. అంత కథ ఒకే సంచికలో సద్దినందుకు ఎందరో పాఠకులు అభినందిస్తూ వ్రాశారు. ఈ సంచికలోనూ ఒక పెద్ద కథ- ఇంచుమించు 18 కాలంల పొడుగు- వేశాము. 'నీలినీడలు' రచయితల పేర్లు పాఠకులకు బాగా తెలిసినవే... ★

## విషయానుక్రమణిక

ముఖచిత్రం: 'నవగ్రహ పూజామహిమ'లో వాసంతి.


చూడు ఎంత బాగుందో!
సాంఘిక భద్రత అనే మహాసౌధం


డాంగే
"భూతం" వెంటాడు తున్న డాంగే


సందేశ కపోతమా?
అరిఫ్ భారత్‌కు రాక!


అప్పుడు,
నాకు ఇది వద్దు
మంత్రుల సమావేశం


ఇప్పుడు
నేను దాన్ని ప్రతిపాదించాను
ఏమిటో ఈ మార్పు?
మంత్రుల సమావేశం



కేంద్ర సమాచారశాఖ ప్రాంతీయ కార్యాలయాల ఉద్యోగుల సమావేశం మార్చి 23న ఢిల్లీలో జరిగింది. దేశీయ వ్యవహారాలమంత్రి శ్రీ జి. ఎల్. నందా ఈ సమావేశంలో ప్రసంగించారు.

# ఉత్తరప్రదేశ్ న్యాయమూర్తుల కథ: న్యాయం ఎవరివైపు వుండాలి?

ఈవారం పదిరోజుల్లో, కేంద్రంలో కొత్త చరిత్రను సృష్టించిన దెవరని ప్రశ్నిస్తే, నా మటుకు, నేను న్యాయమంత్రి అశోకాసేన్ పేరు చెపుతాను. గతవారం ఆయన లోక్‌సభలో, భారత దేశంలోని న్యాయశాస్త్ర సంప్రదాయాలను, ఆధిక్యతను, ఉన్నతస్థాయిని ఉగ్గడిస్తూ చేసిన ఉపన్యాసం, ఎంతో ఉత్తమంగా ఉంది.

ఇండియాది లిఖితపూర్వక రాజ్యాంగం. రాజ్యాంగ సూత్రాలను అనుసరించే పార్లమెంటు నిర్వహణ జరుగుతున్నది. పార్లమెంటుతో పోల్చి, న్యాయ స్థానాల ఆధిక్యతను శ్రీ అశోకాసేన్ పునరుద్ఘాటించటం ఎంతో సమంజసంగా ఉన్నది.

శాసన సభలు, అధికార నిర్వహణ, న్యాయ నిర్వహణలకు సంబంధించిన అంశాలను రాజ్యాంగంలోనే ప్రస్తావించటం జరిగింది. ఉత్తమమైన రాజ్యాంగ పద్ధతుల ప్రకారం శాసన సభల నుంచి, అధికార నిర్వహణ శాఖయే అధికారాలను స్వీకరించి నడిపిస్తూ ఉంటుంది. ఆయా సాధక బాధకాలకు బాధ్యత అధికార నిర్వహణ శాఖదే. న్యాయ నిర్వహణ విభాగం మాత్రం రాష్ట్రపతికే తన బాధ్యతను చెప్పుకొంటుంది, పార్లమెంటుకు గాదు.

శ్రీ అశోకాసేన్ చేసిన ఉపన్యాసంలో కాంగ్రెసు సభ్యులు డా. రాంసుభాగ్ సింగ్, శ్రీ చెట్టియార్ ప్రభృతులు కూడా రంగంలోకి వచ్చారు. పార్లమెంటు, న్యాయశాస్త్రానికంటే ఎక్కువ కాదన్న వాదన కూడా రేకెత్తింది.

అసలు ఈ సమస్యను విపులీకరించటం చాలా సులభం. అదే నిజమయితే హైకోర్టుగాని, సుప్రీం కోర్టుగాని, పార్లమెంటు చేసిన చట్టాన్ని ఔననో కాదనో తేల్చి చెప్పటం జరిగేది కాదు! సుప్రీంకోర్టు చెప్పిన ఒక తీర్పును ఎదిరించటం పార్లమెంటు చరిత్రలో ఇంతవరకు జరుగలేదు న్యాయాన్ని బోధించటమే "జ్యుడీషయరీ" (న్యాయ నిర్వనిర్వహణశాఖ) యొక్క పని.

ఉత్తర ప్రదేశ్ శాసన సభలో గతవారం జరిగిన అసాధారణ చర్యలను అనుసరించి పార్లమెంటులో పై వాద ప్రతివాదాలు చెలరేగాయి. ఇద్దరు సోషలిస్టులను బెయిల్ మీద విడుదల చేయాలని తీర్పు చెప్పిన ఇద్దరు హైకోర్టు న్యాయమూర్తుల అరెస్టు జరగాలని కూడా ఉత్తర ప్రదేశ్ శాసన సభ ఉత్తర్వుల నిచ్చిన సంగతి అందరికీ తెలిసిందే.

ఉత్తర ప్రదేశ్ విధానసభ స్పీకరు వెలిబుచ్చిన అభిప్రాయాలు కూడా పరిశీలిద్దాం. ప్రజలకు ఏదైనా హైకోర్టుచేసిన న్యాయ నిర్ణయంపై వ్యాఖ్యానించే అవకాశముంటే, అదే అవకాశం విధానసభకు కూడా వుంటుందని ఆయన అన్నారు. స్పీకరుమాటల్లో న్యాయం "మడి గట్టుక" కూర్చున్న వ్రతం కాదు.

కాంగ్రెసు పక్షంలో ప్రమాణాలు ఎంత దిగజారి పోయాయో దీనివల్లనే తెలుస్తుంది. మరో విషయం. పత్రికలు నిష్పాక్షికమైన విమర్శను చేయూతగా తీసికొని, ఏ న్యాయ నిర్ణయాన్నైనా చించి పారవేయ వచ్చునన్నది అందరకూ తెలిసిందే! అందువల్ల ఈ సమయంలో "జ్యుడీషియరీ" కాని, పత్రికలుగాని స్పీకరును సవాలు చేయగలవా ?

ఈ విషయం మీద లోక్‌సభలో జరుగుతున్న వ్యవహారాలు కూడా అందరి దృష్టిని ఆకర్షిస్తున్నాయి. ప్రతిపక్ష వర్గాలన్నీ ప్రభుత్వాన్ని నిందిస్తూ, రాజ్యాంగ సూత్రాలను తూ.చ తప్పకుండా

# న్యూఢిల్లీ లేఖ

ఆచరణలో పెట్టటంలో ప్రభుత్వం విఫలమయి పోయిందని ఆరోపణలు చేస్తున్నాయి. ఈ తర్జన భర్జనలు సమాచార శాఖ మంత్రి ఆలోచనలకు కూడా అతీతంగానే ఉన్నాయి.

దేశీయాంగ మంత్రి శ్రీ లాలా గుల్జారీలాల్‌నందా కూడా లోక్ సభల్లో తలనెత్తిన యీవాద ప్రతి వాదాలతో కొంచెం ఇరుకునపడ్డట్లే కనుపించారు. అటువంటి సమయంలో శ్రీ లాల్‌బహదూర్ శాస్త్రి గారు శ్రీ నందా వద్దకువెళ్లి ఏదో చెవిలోవూదగా, అప్పుడు శ్రీ నందా తమ ఉపన్యాసంతో ముందుకు వచ్చారు.

'న్యాయ నిర్వహణ'కు ఏం జరుగుతున్నదో, తామేం చేస్తున్నామో, కాంగ్రెసు సభ్యులకు తెలియలేదు. అదీ పరిస్థితి.

ఇలాంటి విషమ వాతావరణం వల్ల, మున్ముందు సర్దార్ ప్రతాప్‌సింగ్ కైరాన్ లాంటివారికి ఎన్నెన్నో అవకాశాలు ఏర్పడుతాయి. ఎవరినైనా న్యాయమూర్తులను అరెస్టు చేయించటానికి కూడా ఆయన వెనుదీయరేమో !

ఇలాంటి సంఘటనలతోనే, న్యాయానికి స్వస్తి చెప్పటం జరుగుతుందేమో చెప్పలేం. పార్టీ నియంతృత్వానికి ఇది నాందీ వాక్యమా !

న్యాయమంత్రి చేసిన ప్రసంగం తరువాత కూడా, అటార్నీ జనరల్ అభిప్రాయాలు ఏమై ఉంటాయో చెప్పనవసరం లేదు. ఏమైనా, మున్ముందు జరిగే సంఘటనల కోసం ప్రజల ఆత్రుతతో నిరీక్షిస్తున్నారన్నది మాత్రం వాస్తవం !

కేరళ రాష్ట్రంలో రబ్బరు పరిశ్రమ అభివృద్ధి చేసేందుకు ఏర్పాటులు జరుగుతున్నాయి. అందుకోసం ప్రత్యేకంగా ఒక పథకాన్ని రూపొందించారు. రెండు కోట్ల, ఏభై వేల రూపాయిల వ్యయంతో, 20 వేల ఎకరాలలో రబ్బరు చెట్లను నాటించటానికి నిశ్చయించారు. తృతీయ ప్రణాళికలోనే ఇది జరుగుతున్నది. ఆ రాష్ట్రపు ప్రభుత్వం "ది ప్లాంటేషన్ కార్పొరేషన్ ఆఫ్ కేరళ లిమిటడ్" అన్న పేరుతో ఒక సంస్థను రిజిస్టరు చేయించింది.

ఈ కార్పొరేషన్ "వాటాధనం"లో నిల్వచేసేందుకు అవసరమైన ఆర్థిక సహాయాన్ని చేయటానికి కేంద్రం అంగీకరించింది. **1962-63** లో రు 31. 39 లక్షలను మంజూరు చేశారు. **1963-64** లో సవరించబడిన అంచనాల ప్రకారం రు **75** లక్షలను మంజూరుచేశారు. **1964-65** లో రు 80 లక్షలను కేటాయిస్తున్నారు.

వస్త్ర ఉత్పత్తిని అధికం చేసేందుకు "అంబర్ చరఖా" పద్ధతిని కూడా అభివృద్ధి చేస్తున్నారు. 1956—57 లో 45,742, 57—58 లో 98, 849, 58—59 లో 1,00,424, 59—60 లో 76,597, 60—61 లో 51,671, 61—62 లో 15, 334 అంబర్ చరఖాలను తయారుచేసి, పంపిణీ చేయటం జరిగింది.

ఈ కార్యక్రమం 62—63 లో కూడా చురుకుగానే సాగిపోయింది. చరఖాల పునరుద్ధరణకు కృషి జరిగింది. 1963 జులై 30 వరకు 26,705 చరఖాలను పునరుద్ధరించారు. మరో 2,945 చరఖాలను కొత్తగా తయారుచేసి పంపిణీ చేశారు. కార్యక్రమం ప్రారంభించిన తొలి రోజు నుంచి నేటివరకు 3,77,453 చరఖాలను తయారు చేశారు.

ఇందువల్ల ఆ రాష్ట్రంలో నిరుద్యోగ సమస్య కూడా ఎంతగానో పరిష్కరింపబడింది. 377453 మంది "స్పిన్నర్లు" తయారయారు. 27,733 నేతగాళ్లు, 27,367 ఇతర కార్మికులు జీవనాన్ని సంపాదించుకోగలుగుతున్నారు.

1964—65 లో అంబర్ చరఖాల అభివృద్ధికి రు. 115 లక్షలను వెచ్చించాలని బడ్జెట్టు ద్వారా నిశ్చయించారు.

* * *

బొంబాయి — మద్రాసు నగరాల మధ్య ప్రారంభించబడిన "కేబిల్" పద్ధతి వలన ఎంతో ప్రయోజనం ఉన్నది. ప్రస్తుతం కలకత్తా, ఢిల్లీ, బొంబాయిల మధ్య ఈ సదుపాయం ఉన్నది. ఇక నుంచి బొంబాయి, బెల్గాం, బెంగుళూరు, మద్రాసుల మధ్య సరాసరి ఈ "కేబిల్" పద్ధతి అమలులో ఉంటుంది. తిరుచినాపల్లి, కోయంబత్తూరులకు కూడా ఈ సౌకర్యాన్ని విస్తరించేందుకు అవకాశం లేకపోలేదు. రు. 431 లక్షల ఖర్చుతో ఈ "ప్రాజెక్టును" మంజూరు చేశారు. 1964—65 బడ్జెట్టు అంచనాలలో రు. 306 లక్షల కేటాయింపుకు అవకాశా లున్నాయి. 1963—64 లో కానున్న ఖర్చు మాత్రం చాలా తక్కువే (షుమారు 10 లక్షలు.)

మద్రాసులోని కేబిల్ 'ఎక్ఛేంజి' యొక్క శక్తిని పెంచేందుకు ప్రత్యేక పథకాన్ని ఎన్నడో రూపొందించారు. 1956 లో పనిని ప్రారంభించడం కూడా జరిగింది.

ఈ పథకం ప్రకారం ఢిల్లీ, బొంబాయి, మద్రాసు నగరాలను కలుపుతూ "ట్రంక్ కేబిల్సు" ను ఏర్పాటుచేసే అవకాశం ఉంది. 1956 లోనే మంజూరు చేయబడిన ఈ పథకానికి ఖర్చు రు. 795 లక్ష లుండగలదని అంచనా వేశారు. ఆయా నగరాల మధ్య త్వరితగతిన, సంతృప్తికరమైన టెలిఫోను సౌకర్యాలు నెలకొల్పబడగలవని ఆశించబడుతున్నది.

శ్రీకృష. ★

రాజధాని కబుర్లు:

# అసెంబ్లీ సమావేశాలు: విశేషాలు

అసెంబ్లీ సమావేశాలు జరుగుతూనే ఉన్నాయి. బడ్జెట్‌ను గురించి చర్చలుకూడా ఉన్నాయి కాబట్టి, ఈ తడవ నెలరోజులకు పైగా, శాసన సభ్యులు చాలామంది రాజధానిలోనే ఉండి పోవాలసి వచ్చింది. అందులో రాజ్య సభ ఎన్నికలు కూడా ఉన్నాయేను. కొత్త ముఖ్య మంత్రిగారు, ఈ పదవి స్వీకరించినప్పటినుంచి కూడా, సినిమా ప్రపంచంలోనే మునిగి పోయి ఉన్నారు. ఆయనే చెప్పుకున్నారు కూడా, సినిమాలంటే తనకి సరదా అని. అందువలనే ఓపికగా ఎన్నో సభలకు హాజరయి సినిమా తారల పట్ల, సినిమా పరిశ్రమల పట్ల, తన అభిమానాన్ని వ్యక్తపరుచుకున్నారు. ముఖ్య మంత్రి పదవి స్వీకరించినప్పటికీ, ఆయనలో మార్పేమీ కనబడటంలేదు. అసలు ఉంటున్నది కూడా అది వరకు ఇంట్లోనేగా! కొత్త సంవత్సరంలో కొత్త ఆలోచనలు ఏమైనా వస్తాయేమో అని ప్రజలు కొంత ఎదురు చూసిన మాట నిజమే! అసలే రాలేదనటానికి వీల్లేదు, ప్రణాళికల పేరిట కోట్లాది ధనం ఖర్చు అవుతూనే ఉంది. దగ్గరుంటే మన డబ్బు ఖర్చు పెట్టటం, అప్పిచ్చే దాతలుంటే వాళ్ళదగ్గర్నుంచి పట్టుకు రావటం, అప్పటికీ సరి పోకపోతే పన్నుల ద్వారా ప్రజల్నుంచి వసూలు చెయ్యటం, ఏది చేసినా ప్రణాళికల అమలు కోసమే ఈ డబ్బంతా వెచ్చించటమవుతోంది. ఇంత డబ్బు వెదజల్లినా అనుకున్న ప్రయోజనం పొందటం లేదని, ప్రభుత్వం వారే అంగీకరించటం మొదలు పెడుతున్నారు. దీనికి కారణం ఏమిటీ అని రెండో ఆలోచన. అందువలనే ఈ ప్రణాళికల వలన ప్రజలకు కలిగిన మేలేమిటో తెలుసుకోవటానికని ఓ కమిటీని నియమిస్తామని అన్నారు కొత్త ముఖ్య మంత్రి కాసు బ్రహ్మానందరెడ్డి గారు. ఇక రెండోది అవినీతి నిర్మూలించటానికి ఎన్నెన్నో చర్యలు తీసుకుంటున్నారు గాని మార్పేమి కనిపించటం లేదు, దీనంతేమిటో తెల్సుకోవాలని కేంద్ర ప్రభుత్వం వారు మొట్ట మొదటగా ఆలోచించటం మొదలు పెట్టారు. అదే పద్ధతిలో మన రాష్ట్ర ప్రభుత్వం వారు కూడా యోచిస్తున్నారు. అనధికార సభ్యులతో కూడా ప్రతి పక్ష సభ్యులను విశ్వాసంలోకి తీసుకుంటూ, లంచగొండి తనాన్ని నిర్మూలించటానికి తీసుకొనవలసిన చర్యలను గురించి కూలంకషంగా చర్చించటానికి ఒక కమిటీని వెయ్యటానికి కూడా నిశ్చయించారు. నిజానికి ఈ రెండు చర్యలు కూడా మెచ్చుకో తగ్గవే!

సత్యాగ్రహాలు జరుగుతూనే ఉన్నాయి. అఖిల పక్ష కార్యాచరణ సమితి వారు ఈ పని ప్రారంభించి నెల రోజులయింది. పేరు ఏం పెట్టుకున్నా, కమ్యూనిస్టులు చేస్తున్న ఆగడమే ఇది అని అందరికీ తెలిసి పోయింది. దీని వెనక సిద్ధాంతాల ఘర్షణ లేదు. లక్ష్య శుద్ధి, నిజాయితీ అంతకంటె కనిపించటం లేదు. రాబోయే పంచాయతి ఎన్నికల దృష్ట్యా, ఇలాంటి సత్యాగ్రహాన్ని తలపెట్టారని కొంత మంది ఘాటుగా విమర్శిస్తున్నారు. ఏమయినప్పటికీ ఈ సత్యాగ్రహం వలన కలిగే ఫలితాలేమిటో తెలీటం లేదు. కమ్యూనిస్టులతో ఏ రకంగానూ కూడా పొత్తు లేనటువంటి జన సంఘ స్వతంత్ర పార్టీ (అంటే ఇప్పటి సందర్భంలో కిసాన్ సమ్మేళన్) వగైరాలు కలిసి జాతీయ సత్యాగ్రహ సమితి ఆధ్వర్యాన సత్యాగ్రహం ప్రారంభించారు. 17 వ రాజ్యాంగ సవరణ బిల్లును వ్యతిరేకించటం, ప్లానింగ్ పేరిట దుర్భరమయిన పరోక్షపు పన్నుల విధింపుకు అసమ్మతి తెలియచెయ్యటం, భూమి శిస్తు పెంపకాన్ని, రద్దు చెయ్యాలని, బంగారపు కంట్రోలు పద్ధతిని తీసివెయ్యాలని ఈ సమితి కోరుతోంది. అయితే ఈ సత్యాగ్రహాలు జరుగుతూనే ఉన్నాయి. ప్రభుత్వం వారు మాత్రం కాస్తయినా సరే చలించటం లేదు. పైగా ప్రతి పక్ష సభ్యులు విజ్ఞప్తులు చెయ్యటం, సత్యాగ్రహం చెయ్యటం అనుచితమని అసెంబ్లీలో, ప్రభుత్వ పద్ధతికి నిరసనగా, ప్రతి పక్ష సభ్యులు 'వాకౌట్' కూడా చేశారు. అదనపు భూమి శిస్తును వసూలు చెయ్యటానికి వీల్లేదు. ఆ చట్టాన్ని రద్దు చేసి తీరాల్సిందే అని ఎంత తీవ్రంగా ప్రతి పక్ష సభ్యులు హెచ్చరిస్తున్నారో, అంత తీవ్రంగానూ, ప్రభుత్వం వారు కూడా, దీంట్లో ఏమీ మార్పు ఉండదంటున్నారు. అదనపు శిస్తు చట్టం అమలులో ఏర్పడిన అవకతవకలను తొలగించడం మినహా శిస్తు విషయంలో ప్రభుత్వం ఇంకా ఎలాంటి మినహాయింపులకు సిద్ధంగా లేదని స్పష్టంగా చెప్పేశారు. ఇలాంటి పరిస్థితుల్లో పరిణామాలు ఏ విధంగా ఉంటాయో చూడాల్సి ఉంది. అయితే ప్రభుత్వం వారు ఇంత నిర్లక్ష్యంగా ఎక్కువ కాలం ఉండ లేరని, కొన్ని సదుపాయాలు కలుగ చెయ్యటానికి ముందంజ వేస్తారని ప్రజలు ఇంకా దీక్షతోనే ఉంటున్నారు. నిన్న మొన్నటి దాకా, రాజమండ్రి పేపర్‌మిల్స్ నిర్వహణ విషయమై తర్జన భర్జనలు జరిగినాయి. ప్రయివేటు రంగమా పబ్లిక్ రంగమా అనే చర్చలు చాలా తీవ్ర రూపం కూడా దాల్చినాయి. చిట్ట చివరకు జాయింట్ స్టాక్ కంపెనీ ఏర్పాటు చేసి, ప్రభుత్వం వారు కూడా మూడవ వంతు వాటాలు

## ఇంటింటి పజ్యాలు

ఆరుద్ర

లావెక్కింతయు లేదు
చావెక్కింతయు రాదు

ముప్ఫయ్యేళ్లు దాటాక మొగాడికి బొజ్జ
తప్పకుండా వస్తే రాకూడదు లజ్జ
కాల ప్రవాహంలో ముప్ఫయ్యేళ్ల రేవు
స్త్రీలు కూడా దాటగానే ఎక్కుతారు లావు
తగుమాత్రం లావెక్కితే మగువ
తగ్గడానికి చేస్తుంది తెగువ
ఉండాలనుకొంటుంది తాను తన మూడో చెల్లెల్లాగ
ఉద్దేశాలున్నా అవి జరగడమెల్లాగ
గోడ్డుకారంలో కూడా వేసుకోదు నెయ్యి
గోముగా రాజెయ్యదు ఓపూట పొయ్యి
చారూ అన్నం చకచకా వండి
చక్కగా తింటుంది అర్థాకలి తిండి
ఎన్ని ఉపాహాలున్నా తగ్గదు బరువు
ఎన్ని ఉద్దేశాలున్నా దక్కదు పరువు
ఎంత కడుపు కట్టుకొన్నా అంతే లావు
ఇంటాయనకు మాత్రం చచ్చిన చావు. ★

తీసుకుని దాని నిర్వహణ సక్రమంగా కొనసాగించటానికి నిర్ణయించింది.

# రాజధాని కబుర్లు

ప్రభుత్వ పార్టీలో గ్రూపులున్నాయి. ఉంటూ ప్రత్యక్షంగా కనబడుతూనే ఉన్నాయి— అధికారానికి కూడా బలమైన కారణాలు, అందరికీ వ్యామోహమే! అయితే ప్రతి పక్ష పార్టీలలో, ఇవి అంతగా పైకి కనిపించటంలేదు ఇంతవరకూనూ. కాని కమ్యూనిస్టు వారు బైట పడ్డారు. కమ్యూనిస్టు చైనా మన భారత భూభాగంమీద దాడి చేసినప్పటి నుంచి కూడా, భారత కమ్యూనిస్టు పార్టీలో చీలికలు వచ్చి పడ్డాయి. చౌన్‌లైను కౌగిలించుకునే వాళ్ళు కొంత మంది, కృశ్చేవ్‌కు సన్నిహితంగా ఉన్న వాళ్ళు కొంతమంది. లోలోపల కుమిలి పోతున్నారేకాని, బజారున పడటం లేదు. ఈ సారి రాజ్య సభ ఎన్నికలలో ఆ పరదా కూడా తొలగి పోయింది. పెకింగ్ గ్రూపు తరఫున ఒక అభ్యర్థి, మాస్కో గ్రూపు తరఫున ఇంకో అభ్యర్థి, కమ్యూనిస్టు పార్టీ తరఫునే, రాజ్య సభకు పోటీ చేస్తున్నారు. అనధికార, అధికార అభ్యర్థులంటూ ఇద్దరూ ఏర్పడ్డారు. అతివాద వర్గం వారు, పార్టీతో తెగతెంపులు చేసుకుని ఇంకో పోటీ సంస్థను ఏర్పాటు చెయ్యటానికి ప్రయత్నాలు చేస్తారని కూడా తెలుస్తోంది. వీళ్లల్లో వీళ్ళు ఈ విధంగా హోరా హోరీ పోట్లాడుతూంటే రాజ్య సభల ఎన్నికల సంరంభం ఇంకా జోరుగా ఉంది. ఒక పార్టీలో నిలబెట్టబడిన ఇద్దరు అభ్యర్థులకు ముమ్మరంగా ప్రచారం సాగి పోతోంది. ఎట్లాగైనా సరే, తాను నిలబెట్టిన అభ్యర్థి గెలిచి తీరాలి అనే ధోరణితో రెండు వర్గాలవారూ తీవ్రమయిన కృషిని చేస్తున్నారు. కొంతమంది అనుతే పెకింగ్ గ్రూపు అభ్యర్థిని స్వతంత్ర పార్టీ వారు బలపరుస్తున్నారని ముమ్మ, ప్రచారం కూడా సాగించారు! ప్రాపోగాండాలకు అంతు లేదు. ఇలాంటి చీలికలు కమ్యూనిస్టు పార్టీలో రావటం మంచిదేనని, ఈ నాడుకూడా కమ్యూనిస్టు చైనా దురాక్రమణను ఖండించలేని దుస్థితిలో ఉన్న వ్యక్తు లెవరో స్పష్టంగా తెలిసి పోతుందని, అనుకుంటున్నారు, ఎవరు గెలిచినా ఎవరు ఓడినా ఎవరు ఎలాంటి వారో తేలి పోతుంది. ఈ అనుభవాన్ని బట్టి, ముందు ముందు ఆలోచనల రూపురేఖలు, అన్ని పార్టీలలోను కూడా కొంత వరకు మారచ్చు, ఇది రాజ్య సభ ఎన్నికల రభస.

ఇక ప్రదేశ్ కాంగ్రెసు అధ్యక్షుని ఎన్నిక అయి పోయింది. ఈ ఎన్నికను తాత్కాలికంగా నిలుపు చేస్తూ, విజయవాడ ప్రిన్సిపల్ డిస్ట్రిక్ట్ మున్సిఫ్ ఉత్తర్వు జారీ చేశారుట. అది అధికార పూర్వకంగా సకాలంలో చేరవలసిన చోటుకు చేరలేదు కాబట్టి అధ్యక్షుని ఎన్నిక మామూలుగానే జరిగి పోయింది. ఎన్నిక జరగబోయే ముందు ఒక సభ్యుడు, దీని ప్రస్తావన తెస్తూ ఉంటే, ముందర ఎన్నికయితే జరగనీ తర్వాత నీ అభ్యంతరమేమిటో పరిశీలిద్దాం అన్నారుట. దాంతో ఏకగ్రీవంగా, ఆంధ్రప్రదేశ్ కాంగ్రెసు కమిటీ అధ్యక్షుడుగా శ్రీ గొట్టిపాటి బ్రహ్మయ్య తిరిగి ఎన్నికయ్యారు. ఎన్నికవంగానే అభినందనలు, వాటికి సమాధానమే: ఇదంతా మామూలు తతంగమే అనుకోండి. కొంత మంది సభ్యులు ఇంతటితో పూరుకోక, రచ్చకీడ్చి అంతు తేల్చుకుంటామంటున్నారు. మరి దీని పర్యవసానం ఎట్లా ఉంటుందో వేచి చూడాల్సి ఉంది.

ఐ. ఎల్. ఎన్. ★

# ఆడంబరాలను విడనాడండి
# దేశసంపదను వృధా కానీయకండి

## హమామ్ వల్ల హాయిగాను కాంతిగాను వుండండి

శుభ్రపరచు శక్తియు, శరీర కాంతి నిచ్చు శక్తియు హమాము సబ్బును ప్రతి దినమూ వాడండి. మంచి సువాసనగల, సమృద్ధియైన హమాము నురుగు మీ శరీరమును శుభ్రపరచుట యేగాక చలకన పరచును—మీకు మంచి తేజస్సునిచ్చు యీ సబ్బును ప్రతిరోజూ వాడిచూడుడు—దాని సుగుణమ్ము మీరే తెలుసుకొనగలరు—యీ సబ్బు వాడకములో మెత్తబడి పోక వాడినంత కాలము దాని ఆకారము చెదకుండ వుండును.




CBTH-1 TEL

# సరాగమాల — వి.ఎ.కె. రంగారావు

నేను ఏప్రిల్ మొదటి తేదీన బయలుదేరి దారిలో కాకినాడ ఆ రోజు, అమలాపురం రెండవ తేదీని, నరసాపురం, తాడేపల్లి గూడెం మూడవ తేదీని, గుడివాడ, మచిలీపట్నం, విజయవాడ నాలుగైదు తేదీలలోను, గూడూరు ఆరవ తేదీని, తిరుపతి ఏడెనిమిది తేదీలలోనూ చూడగలను. ఏయేవూళ్లలో, యెక్కడెక్కడ యెన్నిగంటలకు ఉండగలనో అచటి గ్రామఫోను రికార్డు డీలర్లను అడిగితే తెలుస్తుంది.

తిరుగు ప్రయాణం గురించి యింతకంటే ముందుగా తెల్పలేక పోయినందుకు చింతిస్తున్నాను. వీలైనంత వరకు, పాఠకులు, సరాగమాల అభిమానులు వచ్చి కలుసుకుంటారని ఆశిస్తున్నాను.

*　　*　　*

ఈ మధ్య ఘంటసాల, జమునారాణి కలిసి పాడిన పాటలు వరసగా వచ్చాయి. ప్రతిదీ చెప్పుకోదగినంత ప్రజాదరణ పొందినది. వీరిద్దరూ కలిసి పాడిన పాటలు "కులదైవం" అంతటి పాత చిత్రాలలో వున్నా, ఈ వరస మాత్రం "సవతికొడుకు"లో "మావా" పాటనుంచి మొదలైనదని చెప్ప వచ్చును. అందుకు కొంతముందు "మంచిమనసులు"లో "మావా" పాట, ఆ తరువాత "లక్షాధికారి"లో "అద్దాల మేడ వుంది," యిటీవల "మర్మయోగి"లో మూడు పాటలు వచ్చాయి. ఈ చివరి మూడు పాటలను వచ్చే వారం పరిచయం చేస్తాను. డీలర్లందరూ విపరీతంగా అభిమానిస్తూ ఆర్డరిస్తున్న పాటలివి.

*　　*　　*

ఆరు నెలల క్రిందట ఒక భక్తుడు తన కళాదేవి ఉపాసన చేస్తూ త్రికరణ శుద్ధిగా తపస్సు చేశాడు. ఆ కళాదేవత అశరీర వాణిగా ప్రత్యక్షమైనది. దేవీ, ఒక వరం కావాలన్నాడు. ఆ భక్తుడు. నా కళావికాసమందు నీకున్న శ్రద్ధా భక్తులకు, ఆసక్తికి మెచ్చినాను గాన ఆ వరమొసంగెద వినిపించు మన్నది ఆ దేవి. భక్తుడు వినిపించినాడు. దేవి విన్నది. ఔనన్నది. ఫలము, మధ్యనున్న పూజారులవలన ఆరునెలలు ఆలస్యమైనా, చివరకు చేజిక్కినది.

బాలవిహార్‌లో ఒక పేజీ తప్పి సరాగమాలలో పడిందా అని ఈ పాటికే మీలో కొందరు తబ్బిబ్బవుతుంటారు. లేదు. తప్పు కాదు. పై పేరా సరాగమాల లోనిదే. ఈ క్రిందనున్న వ్యాఖ్య చదివితే అంతా అర్థమవుతుంది.

ఆ భక్తుడు వి. ఎ. కె. రంగారావు. ఆ కళాదేవి మరెవరు, భానుమతి. ఆ తపస్సు నాడురాని జావళి నేడు కావాలని. ఆ సాక్షాత్కారం టెలిఫోనులో. ఇచ్చిన వరం "విప్రనారాయణ"లోని కల్యాణి జావళి యిప్పుడు రికార్డుగా విడుదలవు గాక అని. పూజారుల ప్రసక్తి యిప్పుడు యెందుకు గాని ఆ రికార్డు ఏప్రిల్ మొదటి వారానికి ముందే మార్కెట్టులో వుండాలి. నంబరు ఎన్. 69802. "విప్రనారాయణ" విడుదలయినప్పుడు యిది రికార్డుగా రాలేదు. కాబట్టి పాత పాటగా దీనిని ఉపేక్షించవద్దు. వచ్చిన వెంటనే వినండి. నా పూజా ఫలమెటువంటిదో నిర్ణయించండి.



"దొంగను పట్టినదొర"లో ఒక దృశ్యం.

కేవలం సాహిత్యదృష్టితోనే చూస్తే విలువ గలిగిన పాటలు సినిమాలలో చాలా అరుదు. ఉన్న రెండిటికీ మంచి వరసలు కుదరటం మరీ అరుదు. రెండూ అమరిన రెండు పాటలూ ఒక రికార్డుగా రావటం మరీ అరుదు. అటువంటిదే నేనిప్పుడు పరిచయం చేయబోయేది.

కలవారి కోడలు. జి. ఇ. 35429.

మంచి మనసు తెలిపేదే స్నేహము<br>
మనిషి విలువ నిలిపేదే స్నేహము<br>
మనసు మనసు కట్టుకున్న<br>
మరుమల్లెల పంతెనయే స్నేహము<br>
మనిషిలోని మంచికే మారుపేరు స్నేహము<br>
మల్లెకన్న తెల్లని జాబిల్లికన్న చల్లని<br>
తేనెకన్న తీయని, యేనాటికైన మాయనిదీ<br>
స్నేహము॥ మంచి॥

రెండవ పాట:

విరిసిన పూవును నేను వెన్నెల తీవను నేను<br>
మిసమిసలాడే పసిడి యౌవనపు<br>
విసురుస్సైపలేను<br>
మౌనముగా నా మదిలో సాగిన<br>
మంజుల గానము వినవేలా<br>
వెన్నెలపందిరి వెచ్చని కౌగిలి<br>
రమ్మని పిలువగ రావేలా॥ విరిసిన॥

పై పాటల సాహిత్యం గమనించారా చోటు కోసం కొంత సంక్షిప్తీకరించాను) యెంత అందంగా ఆనంద దాయకంగా ఉన్నదో. మొదటి పాట వార్ల చిరంజీవి రచన. సినిమా పాటల్లో చిరంజీవిగా ఉండవలసిన రచన. స్నేహానికి లయతాళాల పందిరిపై ప్రాకించిన సాహితీ లత వంటి రచన. టి. చలపతిరావు అమర్చిన కల్యాణి వరసా, నాలుగు వీణల పాశ్చాత్య పద్ధతి మేళవింపూ, జానకి సుమధుర గాత్రమూ, అనుపమానంగా ఉన్నవి.

రెండవ పాట సి. నారాయణరెడ్డి, శృంగార పరిమళాలు అడుగడుగునా గుప్పించటంలో సిద్ధహస్తులైన సి. నారాయణరెడ్డి రచన. "మిసమిసలాడే పసిడి యౌవనపు విసురు సైపలేను" అన్న వాక్యం చాలు రసిక హృదయాలు మోహనరాగంలో స్పందించటానికి. ఇందులో వాద్యగోష్ఠికి, ముఖ్యంగా నాగరాజన్ వేణువుల సొంపుకు, సుశీల మృదుల స్వనలీలకు మేళవింపు హాయిగా ఉంది. 

# మద్రాస్ సినిమా వార్తలు

## సురేష్ ప్రొడక్షన్సు
## "రాముడు భీముడు"

సురేష్ ప్రొడక్షన్సు వారు "రాముడు—భీముడు" అనే సాంఘిక చిత్రాన్ని నిర్మిస్తున్నారు. 8 పాటలను 2 పద్యాలను రికార్డు చేసి చిత్రీకరించారు.

"ఉందిలే మంచికాలం ముందు ముందున....
అందరూ సుఖ పడాలి నందనందన......"

పై పాటను శ్రీశ్రీ వ్రాశారు. ఘంటసాల—సుశీల వారిబృందం పాడగా రికార్డు చేయబడింది. ఈ పాటను కె. ఎస్. రెడ్డి—కుచలకుమారి మరి కొంతమందితో చిత్రీకరించారు.

"తగ నా యిది మామ— తమరే యిటుల పల్కనగునా—" పై పాటను కొసరాజు రాఘవయ్య చౌదరి వ్రాశారు. మాధవపెద్ది సత్యం—ఘంటసాల పాడగా రికార్డు చేశారు. రమణారెడ్డి రేలంగితో చిత్రీకరించారు.

"తళుకు తళుకుమని గలగల సాగే —
— తరుణీ యిటు రావేమే......."

పై పాటను సి. నారాయణరెడ్డి వ్రాశారు. ఘంటసాల — సుశీల పాడగా రికార్డు చేశారు. యన్. టి. రామారావు (రాముడు) — ఎల్. విజయలక్ష్మి తో ఔట్‌డోర్‌లో చిత్రీకరించారు.

"తెలిసిందిలే తెలిసిందిలే నెలరాజ —
నీ రూపు తెలిసిందిలే —"

పై పాటను కూడా సి. నారాయణరెడ్డి వ్రాసారు. ఘంటసాల — సుశీల పాడగా రికార్డు చేయబడింది. యన్. టి. రామారావు (భీముడు) — జమునతో చిత్రీకరించారు.

"తలచుకుంటే మేను పులకరించేను........
తమకు తామే కనులు కలలు గాంచేను."

పై పాటను ఆరుద్ర వ్రాశారు. ఘంటసాల — సుశీల పాడగా రికార్డు చేయబడింది. యన్. టి. రామారావు భీముడు), జమునతో చిత్రీకరించారు.

"దేశం మారిందోయి — కాలమూ మారిందోయి." పై పాటను కొసరాజు రాఘవయ్య చౌదరి వ్రాశారు. ఘంటసాల — సుశీల వారిబృందం పాడగా రికార్డు చేయబడింది. యన్. టి. రామారావు — ఎల్. విజయలక్ష్మి — బృందంతో ఔట్‌డోర్‌లో చిత్రీకరించారు.

యింతవరకు పదిరోజులకు పైగా చిత్రం పూర్తి అయింది.

ఈ చిత్రంలో యన్. టి. రామారావు ద్విపాత్రాభినయం ఒక ప్రత్యేకత. యస్ వి. రంగారావు, రేలంగి, రమణారెడ్డి, రాజనాల, మిక్కిలినేని, సీతారాం వంగర, జమున, యల్. విజయలక్ష్మి, శాంత కుమారి, సూర్యకాంతం, గిరిజ, కుచలకుమారి, హేమలత, బుష్యేంద్రమణి మొదలగువారు నటిస్తున్న యీ చిత్రం ఏప్రిల్ నెలలో విడుదల చేయనున్నట్లు నిర్మాత తెలియజేశారు.

ఈ చిత్రానికి కథ సంభాషణలు— డి. వి. నరసరాజు, పాటలు : శ్రీశ్రీ, సి. నారాయణరెడ్డి, కొసరాజు రాఘవయ్య చౌదరి, ఆరుద్ర., సంగీతం : పెండ్యాల నాగేశ్వరరావు, ఛాయ : అన్నయ్య, నృత్యం : చిన్ని—సంపత్, కళ : వి. రాజేంద్ర కుమార్. బి. ఏ. కూర్పు : మార్తాండ్, స్టూడియో విజయా — వాహిని, కో — ప్రొడ్యూసర్, జె. సుబ్బారావు, దర్శకుడు : తాపీ చాణుక్య, నిర్మాత : డి. రామానాయుడు.

## ఆర్. ఆర్. పిక్చర్సు ప్రొడక్షన్ నెం 12. రు

ఆర్. ఆర్. పిక్చర్సు వారు తమిళంలో నిర్మించిన "పెరియయిడత్తు పెణ్" హిట్ అయింది. వారే తెలుగులో ఆ చిత్రాన్ని నిర్మిస్తున్నారు. యింకా ఆ చిత్రానికి పేరు నిర్ణయించలేదు.

ఈ చిత్రంలో యన్. టి. రామారావు, కృష్ణకుమారి, వాసంతి, గీతాంజలి, సంధ్య, రమణారెడ్డి, రాజనాల, పద్మనాభం, ప్రసాద్, జగ్గారావు మొదలగువారు నటిస్తున్నారు.

ఈ చిత్రానికి మాటలు — పాటలు : ఆచార్య ఆత్రేయ వ్రాస్తున్నారు. యింతవరకు 5 పాటలను రికార్డు చేసి చిత్రీకరించారు.



"రాముడు భీముడు"లో రామారావు.

"అనగా అనగా ఒక మొనగాడు"

పై పాటను సుశీల పాడగా రికార్డు చేయబడింది. గరల్స్ హాస్టల్‌లో కృష్ణకుమారి — ఆమె బృందంతో చిత్రీకరించారు.

"బిత్తరపోతా వెందుకే ఓపిల్లా —"

పై పాటను ఘంటసాల పాడగా రికార్డు చేయబడింది. యన్. టి. రామారావు — కృష్ణకుమారితో చిత్రీకరించారు.

"కలవాణి అలివేణి ఆడె — ఆడె"

పై పాటను సుశీల — వసంత పాడగా రికార్డు చేయబడింది. చాంద్రంబాకంలో ఔట్‌డోర్‌లో వాసంతి — గీతాంజలి అండ్ యన్. టి. రామారావుతో చిత్రీకరించారు.

"ఈ వెన్నెల — ఈ పున్నమి వెన్నెల"

పై పాటను ఘంటసాల — సుశీల పాడగా రికార్డు చేయబడింది. ఈ పాటను ఒక విషాద సన్నివేశంలో యన్. టి. రామారావు — కృష్ణకుమారితో చిత్రీకరించారు.

"ఈ వెన్నెల — ఈ పున్నమి వెన్నెల"

పై పాటను ఘంటసాల — సుశీల పాడగా రికార్డు చేయబడింది. నైట్‌క్లబ్ సన్నివేశంలో సంతోషంగా యన్. టి. రామారావు — కృష్ణకుమారి — మరి కొంతమంది స్నేహితులతో చిత్రీకరించారు.

ఈ చిత్రానికి సంగీతం : పెండ్యాల నాగేశ్వరరావు, ఛాయ : మల్లి యిరానీ, కళ : సెల్వరాజ్, కూర్పు : యం. ఎస్. మణి, స్టూడియో : వాహినీ, సహాయదర్శకులు : కె. దుర్గా నాగేశ్వరరావు—కుమార్, ప్రొడక్షన్ : రంగయ్యన్, నిర్మాత : ఆర్. ఆర్. పిక్చర్స్ తరపున టి. ఆర్. చక్రవర్తి, దర్శకత్వం : బి. ఎన్. మూర్తి.

## సినిమా డైరెక్టర్ యస్. రజనీకాంత్ ఆకస్మిక మరణం

అశ్వరాజ్ వారి "శ్రీ సత్యనారాయణ మహత్యం" షూటింగ్ వాహిని స్టూడియోలో 16వ తేదీ రాత్రి 10 గంటల వరకు జరిగింది. త్వరలో చిత్రంను పూర్తిచేసి విడుదల చేయాలనే ఉద్దేశ్యంతో ఉదయం వరకూ షూటింగ్ పొడిగించారు. వీధి భాగవతం చిత్రీకరణ జరుగుతుంది.

అంతవరకూ చురుకుగా — చలాకీగా తిరుగుతూ ఉత్సాహంగా వున్న దర్శకుడు రజనీకాంత్ తల నొప్పిగాను, కాస్త అలసటగా వుందని నిర్మాత కె. గోపాలరావుకు తెలియజేశారు. ఛాయా దర్శకుడు సి. నాగేశ్వరరావు, నృత్యదర్శకుడు వెంపటి సత్యం గార్ల సహాయంతో యీ షూటింగ్ పూర్తి చేస్తామని యింటికి వెళ్ళి విశ్రాంతి తీసుకోమని నిర్మాత స్వయంగా రజనీకాంత్ గారింటికి తీసుకు వెళ్ళారు. యింటికి వెళ్ళిన తర్వాత కూడా శ్రీ రజనీకాంత్ వారి శ్రీమతితో కులాసాగానే మాట్లాడేరు. ఒక గంట తర్వాత ఒళ్ళంతా నొప్పిగా వుందని డాక్టర్ గారింటికి వెళ్ళారు. ఆయన పరీక్ష చేసి జనరల్ హాస్పటల్‌కు తీసుకు వెళ్ళమన్నారు. జనరల్ హాస్పటల్‌లో 11—45ని. లకు చేరారు. డాక్టర్లు పరీక్ష చేస్తూనే వున్నారు. సుమారు రాత్రి 1గం. 30ని॥లకు శ్రీ రజనీకాంత్ ప్రాణాలు విడిచారు. 3½గంటలకు వారిని యింటికి తీసుకు వచ్చారు. అందర్నీ ఆశ్చర్యపరిచే శ్రీ రజనీకాంత్ మరణం మాటవిని

౬౮ వ పేజీ చూడండి

# ఎండమావులు

హరికిషన్

## జ రి గి న క థ

జానకిరాం ఎం. ఏ. పాసయినా ఉద్యోగం చెయ్యకపోవటం అతని భార్య గౌతమికే కాక తలిదండ్రులకు కూడా బాధ కలిగిస్తుంది. జానకిరాం అన్న కృష్ణమూర్తి జబ్బు మనిషి. అతని భార్య స్వాతి ఉద్యోగంచేసి ఇద్దరినీ పోషిస్తూ ఉంటుంది. స్వాతిని వివాహంచేసుకోవటంవల్లనే కృష్ణమూర్తి తలిదండ్రులకు దూరమవుతాడు. స్వాతి ట్యూషన్ చెప్పే తాసిల్దారుగారి కూతురు జ్యోతి మేనత్త కొడుకు మురహరి. తల్లిపోయిన తర్వాత జ్యోతిని పెళ్ళిచేసుకొనవలసిందని మేనమామ కేశవరావు మురహరితో చెబుతాడు. విశాఖపట్నంలో పరిచయం అయిన జయలక్ష్మి పట్ల ఆకర్షింపబడుతాడు మురహరి. గౌతమి కోపం వచ్చి పుట్టింటికి వెళ్ళిపోతుంది. కాని అక్కడ తగిన ఆదరణ లభించదు. మురహరి జయలక్ష్మి సానుభూతికి చాలా సంతోషిస్తాడు. జానకిరాం తన అన్న కృష్ణమూర్తి యింటికి వెళ్తాడు. అన్నా, వదినెలు చాలా మంచివారని చెల్లెలితోనూ, తల్లితోనూ చెప్తాడు. స్వాతి విషయం తనవద్ద తేవద్దని తల్లి మండిపడుతుంది. నగేంద్ర బాల గౌతమికి తన కథ చెబుతుంది. పరిషత్తులో ప్రయోగించని వీణకు బహుమతి లభిస్తుంది. మురహరి జయలక్ష్మి పెళ్ళిచేసికొనలేకపోతాడు. స్వాతి తాసిల్దారుగారింట్లో సమస్యలను ఎదుర్కొంటుంది. పుట్టింట్లో బాధల నమభవిస్తున్న గౌతమి ఉద్యోగం చేయాలనే నిశ్చయానికి వస్తుంది. జయలక్ష్మి తన వైధవ్యపు గాథనంతా మురహరికి చెపుతుంది. తన ఇంటికి వచ్చిన జ్యోతిని, స్వాతి సముచితంగా సత్కరిస్తుంది. అస్వస్థుడైన మురహరికి, జయలక్ష్మి సేవలు చేస్తుంది. సెలవులివ్వగానే, ఇరువురూ స్వగ్రామాలు - చేరుకొన్నా, ఒకరిని ఒకరు కలుసుకోలేకపోతారు... గౌతమి తాను చేసినపనికి చింతిస్తూ, భర్త జానకిరాంకు ఉత్తరం వ్రాస్తుంది. అప్రయోజకుడై పోతున్నాడని, జానకిరాంను తండ్రి మందలిస్తాడు.

(గత సంచిక తరువాయి)

"ఏమిటి స్వాతీ! అంత తీవ్రంగా ఆలోచిస్తున్నావ్ అంత తీవ్రమైన కొత్త విషయాలేం లేవే."

సెకండరీగ్రేడు ట్రైనింగు ఇద్దరూ పాసయి కొత్తగా ఇల్లు తీసుకుని కాపురం పెట్టిన మొదటి రోజు అది.

"ఏదోనండి, మనిద్దరం వచ్చేసినాక నాకు ఏంటో గుబులుగానే ఉంటోంది. ఈ రోజుకి ఒటలు భోజనమే అయినా, నే వొండితే మీకు పనికొస్తాదా అని నా మీమాంస" అన్నది స్వాతి.

కృష్ణమూర్తి నవ్వాడు. స్వాతి చిన్న మనస్సు అతనికి పెద్ద సమస్యయింది.

"నువ్వేవరివి స్వాతీ!"

"మీకు తెలియదా."

"నీచేత చెప్పిద్దామని."

"కాలానికీ, కులానికీ ఎదురీత ఈది నన్ను స్వీకరించిన మహానుభావులు మీరు. మీ భార్యని నేను."

"బావులూ, చెరువులూ కాదు స్వాతీ,, మహానుభావులు. వత్తులు పలకటం నేర్చుకోవాలి మరి."

స్వాతి సిగ్గుపడింది. తన మాటల ఉచ్చారణలో ఎంతో తేడా కనిపిస్తున్నది. ఆ తేడా ఇంక రాకుండా జాగ్రత్తగా మాట్లాడాలి.

"నా మనస్సు మీదయినా, నేను మీ ఇల్లాలిని అయినా, ఎంత చదువుకున్నా యాపచెట్టుని మాయిడికాయలు కాస్తయ్యా చెప్పండి" అన్నది స్వాతి.

కృష్ణమూర్తి పొట్ట చెక్కలయ్యేటట్లుగా నవ్వాడు. స్వాతి బిత్తరిచూపులు చూస్తూ కూర్చుంది ఖంగారుపడి.

"స్వాతీ, మళ్లా అను. యాపచెట్టా, మాయిడి కాయానా? మళ్ళా అను, వేపచెట్టు, మామిడి కాయ అనాలి, తెల్సిందా."

సిగ్గుతో ముఖం రెండు చేతులతోనూ కప్పుకుంది స్వాతి. చేతి వేళ్ల సందుల్లోంచి మిలమిల మెరిసే ఆమె నేత్రద్వయంలోని వెలుగును చక్కగా చూడగలిగాడు కృష్ణమూర్తి.

ఈ అందాల భామ, బంతిపువ్వులాంటి పసిడి రేకులను వెదజల్లే మాటల పొందికను నేర్చుకోబూని మళ్లీ ఎప్పటికప్పుడే అడుగులో హంసపాదు వేస్తున్నది. ఈ మేలిమి బంగారాన్ని ఆవరించిన మకిలిని వదిలించి నా కనుగుణ్యమైన తీరుగా మలచుకుని జీవయాత్ర సాగించాలి. తనవారు కాదన్నా, పైవారు పెదవి విరిచినా, పెన్నిధిలా నేను తన జీవితాన్ని దిద్దుకోగలననే ఆశతోనే నన్ను పెనవేసుకున్నది. ఈ మాణిక్యాన్ని సానబట్టి ప్రకాశింపచెయ్యాలి. నా జీవితధ్యేయంలో ఇది మొదటి ప్రకరణ, అని తలపోశాడు కృష్ణమూర్తి.

"స్వాతీ."

"ఏం స్వామీ" కళ్లు రెపరెప లాడిస్తూ చూసింది స్వాతి.

"నీ కాటుక కళ్లల్లోని వెలుగు నన్ను దిగ్భ్రాంతుడ్ని చేస్తున్నది. నీ మనస్సులోని సద్భావాలు నన్ను కప్పేసినయ్యి. నీ హృదయంలోని అమృత ఝరులు నామీద పన్నీటి జల్లులా చిలకరించినట్లయి నన్ను ఉన్మత్తుడ్ని చేసినయ్యి. నాలుగు అమృతవాక్కులు కూడా మాట్లాడావా నా జీవితం తరించినట్లే. భాషాపరిజ్ఞానం అలవర్చుకుంటావుగా."

ఆమె అరచేతిని తన చెంపలమీదికి తీసుకుని రాచుకుంటూ అన్నాడు కృష్ణమూర్తి. అరమోడ్పు కన్నులతో తలెత్తి చూస్తూ భర్త హృదయం మీద వాలిపోయింది స్వాతి.

"నాచేతి భోజనం మీకు అభ్యంతరం లేదుగా" ఆదరణగా అడిగింది స్వాతి.

"భార్య చేతి భోజనం ఏ భర్తకూ నిషిద్ధం కాదు. భార్యాభర్తల మధ్య పనికివస్తుంది, పనికి రాదనే ప్రశ్నలే ఉదయించకూడదు. మనస్సులోని అంతర్యాలు, అనురాగాలూ కలిసి ఆనందమయ గృహ సామ్రాజ్యాన్ని ఏలే దంపతుల్లో ఈ రకమైన భేదాభిప్రాయాలకు ఎప్పుడూ తావుండకూడదు. ఆ భేదం నీలో కనిపించినప్పుడు నన్ను దూరం చేసుకోవాలనే ఉద్దేశ్యం నీలో కలిగినట్లుగానే నేను భావించుతాను. ఆ పరిస్థితికి ఆ పరమాత్ముడు మనల్నెప్పుడూ తీసుకురాడు." అన్నాడు కృష్ణమూర్తి ఆమె కనుపాపల్లో తన ప్రతిబింబాన్ని చూస్తూ.

వంట ప్రారంభించింది స్వాతి.

"మీకు ఏమంటే ఇష్టం."

"నాకా నువ్వంటేనే ఇష్టం."

"ఆ సమస్య నా మెళ్లో తాళి కట్టినప్పుడే తీరిపోయింది. ఏ కులంలో పుట్టినా, ఏ జాతిలో పుట్టినా ఎన్ని జన్మలకయినా మీరే నాకు భర్త కావాలని అనుక్షణమూ ఆ దేవదేవుడ్ని ప్రార్థిస్తాను."

"అబ్బా ఎంత ఆశ!" ఎగతాళిగా అన్నాడు కృష్ణమూర్తి. ఖిన్నురాలైంది స్వాతి. ఆమె ముఖ కవళికల్నీ, మనస్సులోని మూగబాధనీ గ్రహించాడు కృష్ణమూర్తి.

"నిన్ను కవ్వించి, ఏడిపించి, నవ్విస్తే నాకు సరదాగా ఉంటుంది స్వాతీ, మరేమీ అనుకోకు. మన హృదయస్పందన ఎప్పుడూ,ఏ పరిస్థితుల్లోనూ ఒక్కటే, అవును కదూ."

తల వూపి నవ్వింది స్వాతి.

"ఇంక చెప్పండి, మీకు ఏ కూరయితే ఇష్టమో, వంకాయ ఇగురు చెయ్యమన్నారా, కాకరకాయ పులుసు చెయ్యమన్నారా, బెండకాయ పాలకూర చెయ్యమన్నారా, ఉల్లిపాయేసి పొప్పుచారెట్టమన్నారా" అన్నది స్వాతి.

మందహాసంతో చూశాడు కృష్ణమూర్తి.

"అన్ని కూరలూ అట్లా ఉంచు. ఆ పొప్పుచారేంటో కాయి ఇయ్యాల. ఉల్లిగడ్డ నంజుగుంటూ తిందాం" అన్నాడు.

స్వాతి కళ్లలో నీరు నిండింది. మనస్సు అవ్యక్త వ్యథతో నిండిపోయింది. ఎంత జాగ్రత్తగా మాట్లాడినా, ఎంత తెలివితేటలు ఉన్నా, ఎంత అంద చందాలతో విరాజిల్లుతున్నా, ఎంత నిర్మలమైన మనస్సుతో మానసిక పరిణతిని ఉన్నత స్థాయికి

తెచ్చుకుంటున్నా పలుకు భేదంతో బయటపడి పోతున్నానని బాధపడింది స్వాతి.

"పంచముఖాలికి, వంకర మాటలే నిల్చి పోతయ్యేమో, ప్రపంచమూ, పరిస్థితులూ, ప్రభావాలూ అనుకూలంగా ఉన్నా పుటకతో వచ్చిన పలుకు భేదం పుటం వేసినా పోదేమో" అన్నది స్వాతి కళ్లొత్తుకుంటూ.

ఆమె కళ్లు తుడిచాడు కృష్ణమూర్తి.

"స్వాతీ, బాధపడకు. మనస్సు ప్రధానంగాని, పలుకు ఎట్లా ఉంటే ఏం" అన్నాడు.

"కాదండీ, మీ అభిప్రాయం తప్పు. మనసు అందరికీ కనబడదు. పలుకు అందరికీ తెలుస్తుంది. అందరికీ అర్థమౌతుంది. నా మాటలు విని మీరు చిన్నబుచ్చుకుంటే నా మనస్సు తరుక్కుపోతుంది. ఆదర్శవివాహమని అంతా వేనోళ్ల పొగడినవారే కుల తత్వాలు గుర్తుకుతెచ్చి మనల్ని ఆ నోళ్లతోనే అవమానంతో క్రుంగిపోయేలా చేస్తారు. ఒక ఆదర్శంకోసం అందర్నీ దూరం చేసుకుని ఆత్మ సాక్షిగా పరమాత్మ సాక్షిగా నన్ను మీ అర్ధాంగిగా చేసుకున్నా, అర్థంలేని మాటలతో మన హృదయాలు తూట్లు పడేలా చేస్తారు. ఈ జీవిత సమరం మన జీవితాలు ఉన్నంతవరకూ నడిపించ గలరు కొంతమంది. అలాంటి పరిస్థితుల్లో మీరు నన్ను దూరం చేసుకోరు కదూ" అన్నది. ఆమె కంఠం ఆవేశంతో జీరవోయి పూడిపోయిన ట్లయింది.

"ఒక్కమాట. గతాన్ని తవ్వుకుని ఎవరో ఏదో అంటారని మనం మనం కుమిలిపోవటం భీరువుల లక్షణం. సూర్యచంద్రాదుల సాక్షిగా నేనుగా నా జీవితాన్ని ఎన్నడూ నాశనం చెయ్యను."

తృప్తిగా భర్త ముఖంలోకి చూసి నవ్వి అత నికి అభివందనం చేసింది.

"ఇవ్వాళ ప్రథమంగా నా చేతివంట చవి



# ఎండమావులు

చూద్దురుగాని, వంటచేసే విధానంలో దోషమున్నా అంతా పూర్తయ్యే వరకూ నన్ను మీరు సరిపెట్టవద్దు. నా తప్పులు నేను తెల్సుకునేలా తరువాత చెబితేచాలు" అన్నది స్వాతి.

స్వాతి తలారా స్నానం చేసింది. తపతపలాడుతూ తడి చీరెతో యుసరు పెట్టింది. తడితల విదప వేసుకోకుండా అట్లాగే నీరు కారుతూ కూర్చుంది. అట్లాగే అన్నం కూర, పప్పు, పులుసు, వండింది. దేవుడి పటాల ముందు ఆ వంటకాలన్నీ ఉంచి "ఆరగించవయ్యా స్వామీ" అన్నది.

కృష్ణమూర్తి అంతా చూస్తూనే ఉన్నాడు అతనికి పొట్ట ఉబ్బిపోతూన్నది. నవ్వు ఆపుకోలేక.

పీటవేసి విస్తరి వేసింది. కృష్ణమూర్తి వచ్చి కూర్చున్నాడు. అన్నం వడ్డించింది. జొపోసన పట్టాడు కృష్ణమూర్తి.

"ఎలాగున్నాయ్యి వంటకాలు " వీపు మీద జీరాడే నల్లటి కురులు విందర వంగలుగా వీపంతా పరుచుకొన్నవి, తడిచీర వంటిమీదనే ఆరి పోయింది.

"ఇసరమంటారా"

"పిండా? పప్పు ఇసిరేది."

స్వాతి మళ్ళా అభిమానముతో కుంచించుక పోయింది. "విసరమంటారా అని అనాలి స్వాతి. ఇసరటం వేరు, విసరటం వేరు" చిరునవ్వుతో పప్పుకే కలిపాడు.

"మీకు కావలసినంత నెయ్యి వేసుకోండి" అంటూ నేతిగిన్నె విస్తరికి ఆనించి పెట్టింది.

"స్వాతి"

తలెత్తి చూసింది. ఆ సమయంలోనే అన్నపు గిన్నె అవతల ఉంచి, ఆ చేత్తోనే పెరుగు గిన్నె ఇవతల పెట్టింది. అట్లాగే జొట్టు ముడివేసుకుని "పప్పు కావాలా" అని అంత పప్పు చేత్తో తీసి విస్తట్లో వేసి "అబ్బో చెయ్యి చుర్రుమన్నది" అంటూ కాలిన వేళ్ళు నోట్లో పెట్టుకుని, విదిలించి "అరెరే మరిచి పోయాను వంకాయి కూర వెయ్యలేదు" అంటూ ఆ చేత్తోనే గిన్నెలో కూర విస్తటో వేసింది.

అట్లాగే మళ్ళీ ఆ చెయ్యి చీరకు తుడ్చుకుని నవ్వుతూ "వంటకాలు రుచులు ఎట్లా ఉన్నయ్యి స్వామీ" అన్నది ఎదురుగా కూర్చుని.

"బాగున్నది స్వాతీ. వంటకాల విషయం అటా ఉంచు. అంటూ ఎంగిలి అనే ఆచార వ్యవహారాలు ఎప్పుడైనా విన్నావా" అన్నాడు ముభావకంగా.

నబ్బురాలైంది స్వాతి. ఆమె గుండెలు దడదడలాడసాగినయి. ఇంతవరకూ ఆ సంగతులే స్వాతి మనసుకు తట్టలేదు.

"క్షమించండి. నాకా సంగతులే గుర్తులేవు. మంచాలమీద కంచాలు ఉంచి ఒక చేత్తో తింటూ మరోచేత్తో నంజుడు ముక్కలు కొరుక్కుతినే వాళ్ళకు అంటు, ఎంగిలి ఏం తెలుస్తయ్యి. నేను పొరబాట్లు చాలా చేసాననుకుంటాను వడ్డించేటప్పుడు."

మనస్సు చిన్న బుచ్చుకుంది స్వాతి.

"అన్నపు గిన్నె ముట్టుకున్న చేత్తో పెరుగు ముటు కున్నావు. నేతిగిన్నె నా విస్తరికి ఆనించావు. చెయ్యికాలిందని వేళ్ళు నోట్లో పెట్టుకుని ఆ చేత్తోనే వంకాయకూర వేశావు. ఆ చెయ్యి కడుక్కోకుండా చీరెకు తుడ్చుకున్నావు అంటూ, ఎంగిలి అంటే తెల్సిందికదూ" అన్నారు.

"అవునండీ పొరపాటే. ఎంగిలి చేత్తో మీకు వడ్డించాను. పాపిష్టిదాన్ని. ఆ విస్తరి వదిలేసి ఇవతల కూర్చోండి ఇంకో విస్తట్లో వడ్డిస్తాను" అన్నది.

"అదీ తప్పే స్వాతీ. తింటూ తింటున్న విస్తరి వదిలేసి లేచివెళ్ళి ఇంకో విస్తరి ముందు కూర్చోరాదు. అదీ తెల్సుకో తగిన, తెల్సుకోవలసిన ఆచారమే."

51 వ పేజీ చూడండి

## ఆమె, తల్లి లాగే—నాజూకైన అపురూప సౌందర్యవతి!

తల్లి, కూతురు అచ్చుమచ్చు ఒక లాగే వుంటారు—ప్రజలు వారు అక్క, చెల్లెళ్ళని భ్రమ చెందుతారు. ఆ అమ్మాయి కలలుకంటూ, ఊహిస్తూ...సౌందర్యరక్షణకు తల్లి సలహాను పాటిస్తుంది. సంవత్సరాలు దొర్లుతాయి. అయినప్పటికీ, ఆమె, తల్లి లాగే ఆకర్షణీయమైన అందముతో వుంటుంది. ఆమె తల్లి ఇచ్చిన సలహాలలో ముఖ్యమైనది—నిరంతరము 'హేజలైన్' స్నో వాడుట. దానంతట అది లేక దాని మీద పౌడర్ అద్దినగాని, 'హేజలైన్' స్నో మీ రూపమును కాపాడి అందాన్ని పెంపొందిస్తుంది.




**'హేజలైన్' స్నో** సౌందర్యమును నిలబెట్టును.

'హేజలైన్' కోల్డ్ క్రీమ్ మరియు 'హేజలైన్' టాల్కమ్ పౌడర్ కూడ దొరుకును.

**బర్రోస్ వెల్కం & కంపెనీ (ఇండియా) లిమిటెడ్,**
పి. బా. బాక్స్ 290, బొంబాయి-1.

61-BW-20 TEL

# సంపెంగపొదలు



సి. ఆనందారామం

### జరిగిన కథ

గిరి, హరి, హరి చెల్లెలు దుర్గ బాల్య స్నేహితులు. హరి, ఉమల మధ్య అనురాగం నెలకొంటుంది. గిరి చూపే బాల్యవాత్సల్యాన్ని, దుర్గ హర్షించ లేకపోతుంది. దూరపు బంధువు శంకర్‌ను గిరి తన ఇంటికి ఆహ్వానిస్తాడు. గిరి సలహాపై దుర్గ శంకర్‌ని హృదయ పూర్వకంగా ప్రేమిస్తుంది. వారిద్దరు వివాహం చేసు కొంటారు. హరంటే ఇష్టంలేనట్లు ఉమ ప్రవర్తిస్తుంది. హరి కృంగిపోతాడు. శంకర్, దుర్గల వైవాహికజీవితంలో చెలరేగిన కలతలను సరిదిద్దటానికి గిరి ప్రయత్నం చేస్తూ వుంటాడు.

## 18

ప్రసాద్ స్వభావంకన్న విచిత్రమైనది ఇంకొకటి లేదు. ప్రసాద్ మనసు దుర్గా గిరిల మధ్య స్నేహానికి ఈర్ష్యతో మండి పోతుండంటె, అందుకు తగిన ప్రత్యేకమైన కారణం ఏమీ లేదు. ప్రసాద్‌కు దుర్గమీద వ్యామోహమా, అంటే అదీ లేదు.

ఒక సున్నితమైన ఆవేదన — అంటే!

శంకర్ స్వభావాన్ని అర్థం చేసుకున్న దుర్గ, ప్రసాద్ తమ ఇంటికి వచ్చినప్పుడు, అతనితో చాలా ముభావంగా ప్రవర్తించ సాగింది. అది గమనించి ప్రసాద్ కూడా దుర్గ ఇంటికి రాకపోకలు తగ్గించాడు. దుర్గ స్వభావమే అంత అనుకున్నాడు. కానీ, ఒక నాడు అనుకోకుండా, ప్రసాద్ ఉన్నప్పుడే గిరి కూడా రావటం తటస్థించింది. ఆ నాడు గిరి పట్ల దుర్గ చూపే, అభిమానమూ, ఆప్యాయత అతని దగ్గర దుర్గకు ఉన్న చనువూ, ప్రసాద్, అంతరాంతరాలలో ఈర్ష్యను లేపింది. ఉమా, గిరి, ఇద్దరూ, దుర్గకు బాల్య స్నేహితులే! తన వంత దులిపి వేయటానికి, గిరినంత నెత్తిన పెట్టుకోవటానికీ, ప్రసాద్ హృదయం మండింది. ఆ నాటినుంచి అతను దుర్గా, గిరిలను ప్రత్యేకమైన దృష్టితో గమనించసాగాడు. మన మనసులోకి ఏదైనా అభిప్రాయం రాకుండా ఉండాలే కాని, ఒక అభిప్రాయం వచ్చిన తరువాత రంగు కళ్ళద్దాలకు లోకమంతా రంగుగానే కన్పించినట్లు ప్రతి సంఘటనా, ఆ అభిప్రాయాన్ని బలపర్చేదిగానే కన్పిస్తుంది. మనసులో మండే ఈర్ష్యా జ్వాలలను చల్లార్చుకోవటానికి, దుర్గా గిరిల మధ్య అక్రమమైన సంబంధముండి ఉండవచ్చనే ఊహ తరుణోపాయమైంది ప్రసాద్‌కు. ఈ రకమైన భావనలు చాలా చిత్రమైనవి. అవి కలిగిన వ్యక్తులు తమలో తాము అలా భావించటం వల్ల తృప్తి పడలేరు. ఇంకో పది మందైనా తనతో ఏకీభవించాలి. అలా జరగక పోతే, తమ భావనలో తమకే నమ్మకం ఉండదు మరి! —

ఒకసారి జానకి దగ్గిర ఈ విషయం కదిపాడు— "జానకీ! దుర్గకు గిరి అంటే ప్రాణం కదా!" స్వెట్టరు అల్లుతున్న జానకి తలెత్తకుండానే "అవును — నాకు కూడా ఆయన అంటే చాలా ఇష్టం. చాలా సరదా అయిన మనిషి— తను నవ్వుతూ ఎదుటి వాళ్ళను నవ్విస్తూ ఉంటాడు." అంది.

ఈ సమాధానంతో ప్రసాద్‌కు మరింత మండింది. కసిగా "నీ ఇష్టానికీ, దుర్గ ఇష్టానికీ, చాలా తేడా ఉందిలే!" అన్నాడు —

"ఉండచ్చు! అతని దగ్గిర చిన్నప్పటినుంచీ దుర్గకు చాలా చనువు ఉంది. హరి గిరి, దుర్గా చిన్నతనం నుంచీ ఒక్క ప్రాణంలా ఉండేవారట!"

"అందుకే పాపం! ఇప్పటికీ దుర్గను వదలలేక అన్నమానూ వస్తూ ఉంటాడు."

ఇంతసేపటికి ప్రసాద్ మాటలలో, ఏదో వ్యంగ్యం ధ్వనించింది జానకికి — తలెత్తి చూసి "బాగుంది! నువ్వూ నేను వెళ్ళటంలా? ఇందులో పెద్ద అనుకోవలసిందేముంది? " అంది —

"నువ్వూ, నేనూ వెళ్ళటమూ గిరి వెళ్ళటమూ ఒకటే నంటావా? అసలు నేననుకోవటం..."

ప్రసాద్ ఏం చెప్పదలచుకున్నడో ఊహించిన జానకి అతని వాక్యం పూర్తి కాకుండానే కయ్యిమంది. "ఊరుకో అన్నయ్యా! మీ చదువులూ, సంస్కారాలూ ఏ గంగలో కలుస్తాయో అర్థం కాదు. నువ్వనుకునేదేమిటో నాకు తెలుసులే! నీకు పుణ్యముంటుంది. నువ్వనుకునే దానిని ఎన్నడూ మాటలలో పెట్టకు. అలా అనుకోగలిగినందుకు సిగ్గుపడు— దుర్గా గిరి ల మధ్య ఉండే అనుబంధం నాకు తెలుసు— నువ్వనుకునే దానిలోవెయ్యో వంతులు నిజం ఉన్నా, దుర్గ గిరికి భార్య అయి ఉండేది. అనవసరంగా వాళ్ళను అనుమానించి నిన్ను నువ్వు అవమానం చేసుకోకు."

జానకి ఇలా విరుచుకు పడటంతో ప్రసాద్ అక్కడినుండి వెళ్ళి పోయాడు. జానకిమాటల వల్ల అతని ఊహలో ఏం మార్పు రాలేదు.

ప్రసాద్ ఈర్ష్యను ఇనుమడింప చేసే సంఘటన మరొకటి జరిగింది. ఒక నాడు కాకతాళీయంగా శంకర్ ఇంట్లో లేని సమయంలో ప్రసాద్ దుర్గ ఇంటికి వెళ్ళటం జరిగింది. ప్రసాద్ రాకపోకల వల్ల శంకర్ పడే చిరాకును భరించలేని దుర్గ ప్రసాద్‌ను తను ఇంటికి రాకుండా చేయటమే మంచి మార్గమని నిశ్చయించింది.

"ప్రసాద్ ! నీతో ఇలా చెప్పవలసి వచ్చినందుకు నాకు చాలా కష్టంగా ఉంది. నిస్సహాయురాలినై ఇలా చెప్తున్నాను. నీ రాకపోకలవల్ల నా సాంసారిక జీవిత ప్రశాంతతకు భంగం కలుగుతూంది. నన్ను క్షమించి నువ్వు ఇక్కడకు రావటం తగ్గిస్తే నాకు మేలు చేసిన వాడవుతావు. నువ్వు అర్థం చేసికోగలవని ఇలా చెపుతున్నాను. ఏమీ అనుకోకు." అంది. ప్రసాద్ తెల్లబోయాడు. వెంటనే అక్కడి నుంచి లేచి వెళ్ళి పోయాడు. కానీ, అవమానంతో అతని మనసు కుతకుత ఉడికి పోతోంది "పెద్ద పతివ్రతలాగ వేషాలు! ఆ గిరిగాడితో ఇష్టం వచ్చినట్లు కులుకుతూ! ...." ఇదీ అతని కచ్చి —

ఏదో ఒక విధంగా ప్రతీకారం తీర్చుకోవాలని అతని ఈర్ష్యాపూరిత హృదయం వ్యాకులపడుతూంది —

హోటల్లో కాఫీ త్రాగుతున్న ప్రసాద్, తన ఎదురుగా కాఫీ తాగుతున్న హరిని చూసి సంభ్రమంతో అతని దగ్గరకు వెళ్ళి పలకరించాడు.

"హరీ! ఎప్పుడొచ్చావ్! కొత్తగా కనబడటం

లేదేం? దుర్గను చూడటానికి వచ్చినప్పుడైనా మా ఇంటికి రాకూడదా?"

హరి నవ్వి ఊరుకున్నాడు.

"ఏమిటో విశేషాలు?" అన్నాడు ప్రసాద్ మళ్ళీ.

హరి కాఫీ పూర్తి చేసి "పైన రూంలో ఉంటున్నాను. అక్కడికి పోయి మాట్లాడుకుందాం పద! ఈ గందరగోళంలో ఎందుకూ?" అన్నాడు. హరి హోటల్లో రూం తీసుకుని ఉంటున్నందుకు ప్రసాద్ ఎంతో ఆశ్చర్యపోయాడు. రూంలో వెళ్ళి కూర్చున్నాక ఆ మాటే అడిగాడు.

"ఇదేమిటి హరీ! స్వంత చెల్లెలు ఊళ్ళో ఉండగా, నువ్వు హోటల్లో దిగటమేమిటి?"

"పరిస్థితులలా వచ్చాయి. ఏం చెయ్యమంటావు?"

"నేను వినకూడనిది కాకపోతే, నాకు తెలిసికోవాలనుంది హరీ!"

"అంత పెద్ద రహస్యం కాదు— దుర్గ సంసారంలో ఏవో చికాకులు వచ్చాయి. అవి సర్దడానికి నేను ప్రయత్నిస్తే శంకర్‌కు కోపమొచ్చింది. అపార్థాలవల్ల నేను అక్కడ దిగలేదు."

"బాగుంది. ఏవో కలతలొస్తే, సర్దుకోవాలి కానీ, అది పెంచుకు కూర్చుంటారా?"

"అది కాదు ప్రసాద్! శంకర్ స్పష్టంగా నన్ను నన్ను తమ ఇంటికి రావద్దని చెప్పాడు. ఏం చెయ్యాలి మరి!"

"నాకు చాలా ఆశ్చర్యంగా ఉంది. అయితే మరి . . ." అంటూ సందిగ్ధంగా ఆగిపోయాడు.

హరి ఆత్రుతగా "ఏమిటి? " అన్నాడు.

ప్రసాద్ సందేహిస్తున్నట్లుగా "మీ కుటుంబ విషయాల్లో కలుగజేసికోవటం మంచిది కాదులే క్షమించు." అన్నాడు.

హరిలో కుతూహలం పెరిగింది. ప్రసాద్ చెయ్యి పట్టుకుని, "నువ్వూ నేనూ చిన్న తనంనుంచి స్నేహితులం. మన మధ్య ఇంతటి సంకోచమెందుకూ ప్రసాద్! నాకు చెప్పవూ?" అన్నాడు.

"నాకు తమాషాగా ఉంది హరీ! స్వంత అన్నవు నువ్వక్కడికి వెళ్ళటానికి వీల్లేకపోవటమేమిటి? ఆ గిరికి అక్కడ అంత స్వతంత్రమేమిటి? అన్నవైన నీకంటే, గిరి ఆ కుటుంబానికి కావలసినవాడన్నమాట"

హరి తల వంచుకున్నాడు. ఈ విషయం అంతకు ముందే అతని మనస్సులో అనేకసార్లు మెదిలింది. దుర్గ తన చికాకులన్నీ తనకు వ్రాయకుండా గిరికి వ్రాయటం, తాను ఆ ఇంటికి కూడా వెళ్ళకూడని పరిస్థితిలో, గిరి వాళ్ళకు ఆత్మీయుడు కావటం, అతని మనసులో ముల్లులా గుచ్చుకుంటూనే ఉంది. అన్నింటికంటే గిరి దుర్గను ప్రేమించాడనే హరి నమ్మకం. దుర్గే అతనిని కాదని శంకర్‌ను చేసుకుందని హరి భ్రమ. ప్రస్తుత సంసార పరిస్థితులలోని అల్లకల్లోలానికి తట్టుకోలేక, దుర్గ తనను ప్రేమించిన గిరి మీద ఆధారపడిందా? అని హరి అంతరాంతరాలలో ఒక అనుమానం కలుగ జేస్తుంది. అయినా దుర్గ క్లిష్ట పరిస్థితిలాధారంగా ఆమె జీవితాన్ని నాశనం చేసేటంత నీచుడు గిరికాడనే విశ్వాసమే అతని ధైర్యం. హరి ముఖంలో తనకు కావలసిన మార్పులు గమనించిన ప్రసాద్, సంతృప్తిగా ఊపిరి పీల్చాడు. సమిధలు వేయడానికి ఇదే సందని కూడా ఆలోచించాడు.

"ఇంకొక సంగతి హరీ! నువ్వేమీ అనుకోనంటే చెపుతాను" ఏమిటన్నట్లు చూశాడు హరి.

"దుర్గ నాకు కూడా స్నేహితురాలు. నేనుకూడా ఆమె క్షేమం కోరే వాడిని. అన్నవైన నీకీ విషయం తెలిస్తే దీనికి పరిష్కార మార్గం ఆలోచిస్తావని చెపుతున్నాను. అంతేకాని, ఎవరి మీదా ద్వేషంతో కాదు."

"సంగతి చెప్పు! ఇంత నానుస్తావేం" అన్నాడు విసుగ్గా.

"ఇది విసుగ్గా వినవలసిన సంగతి కాదు. శాంతంగా ఆలోచించవలసిన విషయం — నీకు విసుగ్గా ఉంటే చెప్పక పోవటమే మంచిది."

ప్రసాద్ ఊరించే పద్ధతి చూస్తే హరికి ఒళ్ళు మండుతుంది.

నాకేం చెప్పొద్దులే: పో! అందామని కూడా అనిపించింది. కానీ, తన కుతూహలాన్ని అణచుకోలేక, "నేనేం అనుకోను అసలు విషయం చెప్పు" అన్నాడు.

ప్రసాద్ బాధ పడుతున్నవాడిలాగ ముఖం పెట్టి "ఏంలేదు, చుట్టు ప్రక్కల వాళ్ళంతా, దుర్గా గిరీలను గురించి రకరకాలుగా అనుకుంటున్నారుట. అసలైన రక్తసంబంధీకులెవరూ, రాకపోగా శంకర్ కేదో దూరపు చుట్టమైన ఈ గిరి ఇంత తరచు రావటం అందరికీ ఆశ్చర్యంగానే ఉంటుంది మరి. అంతేగాక, గిరి సాధారణంగా శంకర్ లేని సమయాల్లోనే వస్తాడట. అందుకని చుట్టు పక్కల అందరూ చెవులు కొరుక్కుంటున్నారు. వెధవసంఘం! మంచి చెడ్డలక్కర్లేదు దానికి." అన్నాడు.

హరి మనసు మండి పోతోంది. తనకీ వార్తను చెప్పిన ప్రసాద్‌ను చావి లెంపకాయలు కొట్టాలన్న ఉద్రేకాన్ని అతి ప్రయత్నం మీద అణచుకుని "ఎవరు చెప్పారు నీకీ సంగతులన్నీ? కష్టపడి సేకరిస్తున్నావా?" అన్నాడు నిరసనగా.

ప్రసాద్ ఖంగారు పడి "ఛీ! ఛీ! నేనసలు దేంట్లోనూ కలిపించుకోను. మొన్న ఏదో మాటల మీద జానకి ఎంతో బాధపడుతూ చెప్పింది. నాకు కూడా చాలా కష్టమనిపించింది. నువ్వేదైనా ఉపాయం ఆలోచించి ఈ పుకార్లను అణచి వేస్తావని నీతో చెపుతున్నాను" అన్నాడు.

జానకి చెప్పిందనగానే హరి కృంగి పోయాడు. జానకి అంటే హరికెంతో గౌరవము. ఎప్పుడూ ముక్కుకు సూటిగా పోతుంది. మనసులో మాట కచ్చితంగా చెపుతుంది. అబద్ధాలూ, తప్పుడు ప్రచారాలు చెయ్యదు. సరికదా. ఎవరైనా చేసిన వాళ్ళను అసహ్యించుకుంటుంది. ఎప్పుడూ, ఎవ్వరినీ దోషిగా నిరూపించి మాట్లాడదు. తనకెవరి ప్రవర్తనైనా నచ్చకపోతే వాళ్ళను గురించి ప్రస్తావించదు. అట్లాంటి జానకే ఈ వార్త చెప్పిందంటే అందులో తప్పక సత్యముండాలి. అంతేకాక జానకీ, దుర్గా ఆత్మీయులైన స్నేహితులు. దుర్గ పరిస్థితి జానకికి చక్కగా తెలుస్తుంది. లేని మాటలనామె ఎందుకు చెప్తుంది.?

ఎంతో ఉత్తముడూ, ఉన్నతమైన ఆదర్శాలు కలవాడూ, అని భావించిన గిరి, చివరకు ఇలా దిగజారాడా?

ప్రసాద్ తన మనసులోని మంట చల్లార్చుకుని అక్కడినుంచి వెళ్ళిపోయాడు. ఆ మంటలు ద్విగుణీకృతమైన జ్వాలలతో హరి హృదయంలో ప్రజ్వరిల్లాయి.

## 19

అప్పుడే ఆఫీసునుంచి వచ్చి బట్టలు మార్చుకుని, కాఫీ త్రాగుతున్న గిరి, హరి రాగానే సాదరంగా ఆహ్వానించి అతనికికూడా కాఫీ అందించాడు.

హరి విసుగ్గా "నాకు కాఫీ, గీఫీ, ఏం అక్కర్లేదు." అని కప్పును వెనక్కు తోసేసాడు. గిరి ఆశ్చర్యంగా హరి ముఖంలోకి పరీక్షగా చూశాడు. అతని ముఖంలో ఇటీవల కలిగిన మార్పును గమనించే సరికి గిరి గుండె ద్రవించి పోయింది. ఏదో జబ్బుపడి లేచినట్లున్నాడు. అతని హృదయంలోని ఆవేదన అతని కళ్ళలో ప్రతి ఫలిస్తోంది. గిరి అతని దగ్గరగా వచ్చి, అతని చేతిని తన చేతిలోకి తీసుకుని అనునయంగా నొక్కుతూ, "ఏదీ సీరియస్‌గా తీసుకోకు హరీ! జీవితంలో ముందుకు తోసుకుపోవటం నేర్చుకో!" అన్నాడు.

హరి గిరి చెయ్యి విదలించి "ఇక మీదట మంచీ మర్యాద కూడా, సీరియస్‌గా తీసుకోకపోవటం నీ దగ్గర నేర్చుకుంటానులే!" అన్నాడు.

గిరి ఆశ్చర్యంగా అతని వంక చూసి "నీ ధోరణి ఇవాళ తమాషాగా ఉంది హరీ!" అన్నాడు.

"అవును ముఖం ఎదురుగా ఆప్యాయత నటించి వెనకాల గోతులు తవ్వటం నాకు చేతకాదు."

ఈ మాటలతో గిరి ముఖం గంభీరంగా మారి పోయింది. నిదానంగా అన్నాడు.

"ఎవరి గురించి మాట్లాడుతున్నావ్ హరీ! విషయమేమిటి?"

"నాకత్యంత ఆత్మీయులనుకున్న వాళ్ళే నాకంతులేని క్షోభను కలిగిస్తూంటే, నేనెవరితో చెప్పుకోను?"

హరి కంఠం గద్గదికమయింది. గిరి గుండెలు కలుక్కుమన్నాయి. తన అంతరాంతరాలలోని రహస్యం హరికి తెలిసి పోయిందా?

హరి కుర్చీలో వెనక్కు జేర్లగిల బడ్డాడు, ఆలసటతో, ఆవేదనతో, రోషంతో, అవమానంతో అతని కళ్ళు మండుతున్నాయి.

"కానీ, గిరీ, నేను నమ్మలేక పోతున్నాను. ఇదంతా నీకు తెలిసే చేస్తున్నావా? తెలియక చేస్తున్నావా?"

విపరీతమైన వేగంతో స్పందించే గుండెలను అణచిపట్టి, సమాధానం చెప్పక, ఇంకా హరి చెప్పే మాటలు కోసరం ఎదురు చూడసాగాడు గిరి— అతని ముఖం పాలి పోయింది. అపరాధిలా కళ్ళు వాల్చుకున్నాడు. వణికే పెదిమలను బలవంతంగా పళ్ళతో నొక్కి ఉంచాడు. తీవ్రతరమైన ఒకానొక ఉద్రేకాన్ని బలవంతంగా నిగ్రహించుకుంటూన్న లక్షణాలతనిలో స్పష్టంగా కన్పిస్తున్నాయి.

అప్పటి గిరి ముఖమూ, అతని మౌనమూ, హరిలోని అసహనాన్ని ఉచ్ఛస్థాయిని చేర్చాయి. ప్రసాద్ చెప్పిన మాటలు అతని మనసును పుండులాగ బాధించినా గిరి మీద గల విశ్వాసం, ఆ మాటలను నమ్మనియ్యలేదు. "ఇందులో ఏదో అసత్యం ఉండాలి. ఎవరో పొరపడి ఉండాలి" అని తనను తాను ఓదార్చుకోవటానికి ప్రయత్నించాడు. గిరి

35వ పేజీ చూడండి



# మలుపులో పిలుపు

## రామలక్ష్మి

సంధ్యాగాలి ప్రసాదించే శైత్యానికి పల్లగా తలలూపుతున్నాయి అక్కడక్కడ అరుదుగా అగుపించే చెట్లు. మనుషులు కూడా మహోత్సాహాన్ని నింపుకుంటూ సంచారాలు సాగిస్తున్నారు. నల్లని తారు రోడ్డుమీద అంతకంటే నల్లని కార్లు బుర్రుమంటూ జారిపోతున్నాయి.

"ఏమిటో ఈ కొంప మునిగిపోయే తొందరలు —ఎంతైనా ఇది పట్నపు తీరు —" చేతికర్ర తీసి మోచేతి మీద ఆన్చుకొని కుడిచేత నశ్యం డబ్బీ తెరిచి ఒక చిటికెడు ముక్కులోకి పట్టించి తుమ్మేరు మాధవాచార్యులు గారు. "జలుబు చేసింది" గొణుక్కున్నారు చుట్టూ ఒకమారు పరికించి.

ఎవరినన్నా తెలుసుకోవాలంటే వాళ్లతో పరిచయం ముఖ్యంగా అవసరం. మాధవాచార్యులు గారు సంగీత ప్రవీణులు.

ఆవి సంగీత కళాశాలలు, రేడియో స్టేషన్లు దేశంలో అక్కడక్కడే గాని అన్నిచోట్లా లేని రోజులు. మాధవాచార్యులు గారికి లెక్కలేనంత మంది శిష్యులు ఉండేవారు ఆ రోజుల్లో. ఈ రోజుల్లో వారందరూ తలొక మూలకు చెల్లాచెదరై పోయినారు. ఆ శిష్యపరమాణువుల్లో కొందరిప్పుడు సంగీత కళాశాలల్లో బోధకులు అయ్యారు. కొందరు ఆకాశవాణి నిలయ విద్వాంసులు అయ్యారు. మరికొందరు వేరే వృత్తుల్లో, పదవుల్లో జీవిస్తున్నా సంగీతం మహావరప్రసాదంగా వచ్చిందని భావించి గృహాంతర్భాగాల్లో విడవకుండా పూజించి గౌరవిస్తున్నారు. ఇంకొందరు ఉన్నారు — వారెలాంటివారు? "ఈ నిత్యజీవన సమస్యాపూర్ణ కదనరంగంలో కదన కుతూహలం లాగ ఈ సంగీత సమరం కూడా ఎందుకు?" అని వయొలిన్‌లు, వయోలాలు, వీణలు, వేణువులు అన్నీ కట్టకట్టి అటక మీది ఎలుకలకు ఆహారంగానైనా వినియుక్తపరుస్తున్నారు. అయితే కంఠాన్ని కట్టగట్టి మూల పడెయ్యటం అసాధ్యం కనుక "కలిగియుంటే యుంటే కదా ....." అనో, "ఎంత నేర్చిన సఫలమేమి ..." అనో అదీగాకపోతే ఇంకేదో ముఖారిలోనో, కాంభోజిలోనో నిరంతరం కూనిరాగం తీస్తూనే ఉంటారు. మాధవాచార్యులు గారి శిష్యుల్లో మరొకరకం వాళ్ళు లేకపోలేదు. వారు రేడియో వింటారు — సంగీత కచ్చేరీలకు బాగానే వెళ్తారు. కాని వాళ్లకి వచ్చినంత మాత్రపు విద్యను వృద్ధి చేసుకోరు. ఏదో నైరాశ్యం— వ్యక్తపరచలేని ఏదో వేదన.....కోరినంత ప్రజ్ఞ లభించలేదనే నిరాశా తరంగాలు హృదయంలో.........

ఇవన్నీ మాధవాచార్యులకి తెలుసు....."ఎవరెట్లాపోయిన నాకేమి వచ్చు...." అనుకుంటారు తరచుగా.

"నుదుటన్ వ్రాసిన వ్రాలు తప్పదు కదా మారేండ్లు చింతించినన్—" అదీ ఆయన స్వగతం.

కానీ ఆయన మొదటినుంచీ పల్లెటూరులోనే ఉండిపోయారు. ప్రపంచమెంత వైశాల్యవంతమై

పోతున్నా, ప్రపంచమంత మారిపోతున్నా అదేమీ పట్టలేదు.

అలవాటైపోయింది. వింటున్న మాధవాచార్యులుగారి దగ్గర శిష్యులెవరూ లేరు. అందరూ సంగీత పాఠశాలల్లోనే. లోకపు పరిణామాన్ని తలచినప్పుడు రవంత ఆశ్చర్య మానసులౌతారు. ఏభై, నలభై ఏళ్ల క్రితం వరకు తనవంటి గురు గృహ ప్రాంగణాలు శిష్యుల కలకలంతోనే నిండి ఉండేవి. ఇప్పుడో?—

"సరే!— జగదీశ్వరుని మాయ!" ఇలా నిర్లిప్తంగా ఉంటారని అందరూ వూరుకోలేదు. 'మా ఇంటికి వచ్చి మా పిల్లలకు విద్య నేర్పించవలసిందండీ!' అంటూ అనేకులు వచ్చి ప్రార్థించారు. మాధవాచార్యులే వారి అర్థన త్రోసేశారు. "అబ్బెబ్బె! ఇంటికి వచ్చి చెప్పడమా? అలాంటి అలవాటు లేదు." అని చెప్పేశారు. కాని ఒక మహాశయుడు అందర్లాగున విడవలేదు. అతనిది ప్రక్క వూరు. మాధవాచార్యులు గారి ఖ్యాతి విన్నవాడు. అధిక ప్రతిఫలమే కాక బస్సు ఖర్చులు కూడ ఇచ్చుకుంటానంటూ అడుగులకు మడుగులొత్తాడు. ఈ సరికి మాధవాచార్యులు గారి నిర్లిప్త ధోరణి మారింది. ఈ నాగరిక యుగంలోను ఇంత సంగీత పిపాసువులు ఉన్నారా? అన్నటువంటి ధ్యాసలో కుతూహలంతో ఒప్పుకున్నారు.

ఆ ధనికుడికి ఇద్దరు కూతుళ్లు. ఇద్దరివీ కోకిల కంఠాలు. ఆ పిల్లలిద్దర్నీ కోకిలలు అంటే బాగా కుదురుతుందేమో. ఎందుకంటే వాళ్ల రూపాలూ అటువంటివే. ఆ అమ్మాయిల కళ్లల్లో 'ఈ సంగీత వారాశిని మథించెయ్యాలి' అన్నంత ఉత్సాహోద్రేకాలు ఉన్నాయి. 'నా కీర్తి రూపాలు నా ఈ శిష్యురాళ్లు' అనివ్యూహించుకొని ఆనందించగల్గుతున్నారు మాధవాచార్యులు గారు.

ఏమైతేనేం గాక— మాధవాచార్యులు గారికి వారానికి రెండు సార్లయినా పట్నం రాక తప్పడం లేదు. దానికి తోడు అటుఇటుగానైనా ఒకసారి బస్సు తప్పడమూ తప్పడం లేదు.

ఈ రోజు అలాగే బస్సు తప్పింది. -మరో బస్సు వచ్చేవరకూ గల విరామ సమయంలో 'ఇక్కడకూ, అక్కడకూ వెళ్లడం' అనే కార్యక్రమం వేసుకున్నారు మాధవాచార్యులు గారు.

ఈ రోజెందుకో మధ్యమావతి నోట తిరుగుతోంది, అది చిత్రంగా శ్రీరాగంలోకి జారుతున్నది. అనుకుంటూ ఆయన చేతి కర్ర సహాయంతో మెల్లగా నడుస్తుండగానే మలుపు వస్తే— అక్కడ ఆగి నలువైపులా చూశారు. ఆ వీధిలో చాలా పెద్ద భవనాలు ఉన్నాయి. అవెంత ఉన్నతమైనవైనా ప్రకృతి దృశ్యాలు వాటి వెనుక దాగిపోలేదు. ఆకాశపుసంధ్యాకృతిలో మరీ నీలంగా మెరుస్తున్నాయి ఎదురుగా కనిపిస్తున్న దూరపు కొండలు. ఆ చుట్టు ప్రక్కల ఎక్కడో దేవాలయ ఘంటికా నాదాలు. ప్రవాహ సదృశ జన సందోహాలు.

ఒక అరుగు మీద చాలామంది జనం పోగయి పట్టుకోచింది. సగిలించగా చూస్తూ అటువేపు వెళ్లారు మాధవాచార్యులు. ప్రాంగణానికి ముందున్న గోడమీద ఓ కాగితం అంటించినట్లు కనిపించింది. సిరాతో దిద్దిన పెద్ద అక్షరాలు.

"ఈ గారి శ్రీ సంగీతోత్సవాలలో పునర్నిర్మాణ నిధికై ఏర్పాటు చేయబడిన సంగీత కచేరీ. శ్యామ శాస్త్రిగారి గానం. ఆరు గంటల మొదలు నిమి

లను కచేరి ప్రారంభమౌతుంది."

"ఈ వేళేనా సంగీత కచేరి? ఈ అభినవ శ్యామ శాస్త్రి ఎవడు చెప్మా? చూడాలనే వుంది కాని..... రేట్లు బాగానే పెట్టారే!......... పది నుంచి ఇరవై వరకూనట. బస్సు ఖర్చు తిరిగి అడుగు లేదు కాబట్టి సరిపోయింది.. సరిగ్గా పది రూపాయలుండాలి పర్సులో......" మాధవాచార్యులు గారు డబ్బుతీసి చూసుకున్నారు.

"అరె! అప్పుడే అందరూ లోపలికి వెళ్లి పోతున్నారే!"

గబ గబ టికెట్టు తీసుకుని లోపలికి నడుస్తూ "ఈ గానం ముగిసినా ముగియకపోయినా పది గంటలకల్లా తను ఇవతల పడాలి. లేకపోతే చాలా చిక్కుల్లో చుట్టుకోవల్సొస్తుంది. వూరుకాని వూర్లో" అనుకున్నారు.

ఆయన వెళ్లి కుర్చీలో కూర్చున్నారు. సరికొత్త శ్యామశాస్త్రి గొంతు సారిస్తున్నాడు అప్పుడే. అతన్ని చూస్తుంటే నవ్వు వచ్చింది. 'చిన్నవాడే' అనుకున్నారు తనలో— సంగీతంలో కూడా చిన్నవాడై ఉంటాడన్న సంతృప్తి ఆయన ముఖదర్పణంలో ప్రతిబింబించింది అప్పుడు.

"శెహబాస్! ఈ రాగం!" అప్పుడే పోల్చారు ఆచారిగారు. ఇంతలో గుప్పున సిగరెట్ పొగవచ్చి మొహాన కొట్టింది. అసహ్యించుకుంటూ ప్రక్కకు తిరిగి చూశారు అప్రయత్నంగా. కుడివైపు ఒక యువకుడు ఠీవిగా సిగరెట్ కాల్చుకుంటున్నాడు. మాధవాచారి గారికి మండింది.

"హుఁ వీళ్లకి గూడా సంగీత స్వారస్యం తెలుసా? సంగీతం కూడా సిగరెట్టులా ఉంటుందేమో చూద్దామని వచ్చినట్టున్నాడు ఈ మహానుభావుడు."

ఈ గొడవ అంతా మరిచేటప్పటికి అప్పుడే రాగాలాపన చివర్లోకి వచ్చేసింది—

"నిన్నుజూచి ధన్యుడనైతి ...... నీరజ నేత్ర.." అంటు పాట ఎత్తుకున్నాడు శ్యామశాస్త్రి.

"ముందుగా ఎవరైనా గణపతి స్తుతితోనో, సరస్వతీస్తవంతోనో ప్రారంభిస్తారు; మొదటే పట్నం వారి కృతి పట్టుకున్నాడితడు. ఈ అబ్బాయి దేం అనుభవం ?—" మాధవాచార్యులు గారు అనుకున్నారు.

ఆయన ఉద్దేశ్యాల అవసరం లేకుండా అందరూ నిశ్శబ్దంగా వింటున్నారు. అందులోనూ మాధవాచార్యులు గారి ఎడమ ప్రక్కనున్న రాగి జుట్టాయన తలాడించటం మరీ ఘోరంగా ఉంది. మొదటి కృతి పూర్తయింది. హాల్లో సంచలనం బయలుదేరింది. శ్రోతల అభిప్రాయాలు మాధవాచార్యులు గారి చెవి దగ్గరకే గాలిలో తేలి వస్తున్నాయి.

"ఫస్టుగా పాడాడండీ!" ఎవరో ఇచ్చిన కాంప్లిమెంటు.

"మీరిదివరకు వినలేదా మూర్తి గారూ? ఇతని గొంతుకలో మృదంగ ధ్వని వస్తుందండీ! గొప్ప వైశిష్ట్యం ఉన్న దీయన గానంలో. తల నొప్పిగా ఉన్నా వచ్చేశానివాళ."

"వీళ్లంతా ఇంతకంటే గొప్పగా పాడేవాళ్లని విన్నట్టుగా లేరు" అనుకున్నారు. మాధవాచార్యులు.

గాయకుడు తన్మయత్వంలో ఉన్నాడు... లతాంగి షమురాగం ఆలాపనలో ప్రక్క వాయిద్యం జరుగుతున్నది.

గాయకుడు 'భేష్' అంటున్నారు [illegible] వాదకులకు ప్రోత్సాహంగా.

"ఇలా అంటేనే తనకు ఒళ్లు మండుతుంది. మరో తన్మయత్వంలో మునిగిపోయి పట్టు [illegible] భేష్, శభాష్, అబ్బా అంటూ పలికిన గొంతు ఎక్కడిదీ దానికి..... ఇప్పుడీ యువకున్నాడే— ఇతనూ అంత వయసులో అంత ఉద్రేకంగాను, పరవశత్వంతోను పాడేవాడు. అయితేనేం ఇంతగా కదిలిపోతూ, చూసి పోతూ ఉక్కిరి బిక్కిరయి పోతున్నట్టుగా దర్పం చూపించ లేదు. ఏమిటో ఇదంతా.!......" ఉలిక్కి పడ్డారు ఆచారిగారు.

"అపరాధములు......." అని గాయకుడు అందుకునే టప్పటికి టపటప చప్పట్లు కురిసి వడ్డాయి వాన జల్లుకి మల్లె. సదస్యుల పొగడ్తలు కంటకాల్లా గుచ్చుకుంటున్నాయి మాధవాచారి గారికి. మదిలో కొద్ది కొద్దిగా రగులుతూ జ్వలించబోయే అసూయాజ్వాల. శ్యామశాస్త్రికి ప్రపంచంలో, ప్రజల సముఖంలో తనున్నాడన్న భావనే లేదు.

మాధవాచార్యులుగారికి సమీపంలోనే ఇద్దరు స్త్రీలు మాట్లాడుకుంటున్నారు. ఇతర శ్రోతలందరూ గాన సుధారసాన్ని గ్రోలుతుంటే మాధవాచార్యులకు ఆ స్త్రీల సంభాషణ మీదనే మనసు కేంద్రీకరించబడుతున్నది.

"ఇతను మా గురువుగారు — తెలుసా హేమా?"

"ఆఁ ఏమిటేమిటి? నీకు సంగీతం కూడా వచ్చునా?"

"నామాట అలా ఉంచు— నాసంగీతం ఏనాడో అటకెక్కింది. కానీ ఈయన మా గురువుగారే! నాకు తొమ్మిదేళ్లప్పుడు సంగీతం చెప్తానంటూ వచ్చాడు. అతనికప్పటికి మహా ఉంటే పద్దెనిమిదేళ్లుంటాయి. అతనూ ఇంకా సంగీతం ఎక్కడో అభ్యసిస్తున్నవాడే. నేను సరదాపడి చెప్పించుకుంటానన్నాను నాన్నగారితో....

"ఇద్దరం చిన్న వాళ్లం కాబట్టి నువ్వంటే నువ్వనుకున్నట్టే ఉండే వాళ్లం. నాకు తోడుగా ప్రక్కింటి అమ్మాయి కూడా వచ్చి ఉచితంగా నేర్చుకునేది. నా గొంతు బావుంటుందని మొదట మురిసినా తర్వాత సంగీతం నాకు వంట పట్టదని తెలిసి ఆ అమ్మాయికి శ్రద్ధగా స్వర కల్పన మొదలైన విషయాలు, మెలకువలను చెప్పడం మొదలుపెట్టాడు. ఆ అమ్మాయి కంఠ స్వరం సంగతి గొప్పగా చెప్పలేం. అయినా ఎక్కువ అభిలాషతో నేర్చుకునేది. శ్రద్ధగా నేర్చుకునే వాళ్ల మీదనే గురువు దృష్టి ఉండడం సహజం మరి. కాని నేనువూరుకోలేదు. డబ్బిచ్చే వాళ్లం మేమే నన్న గర్వం ఒకటి. "మాష్టారూ! ఆ అమ్మాయికే చక్కగా చెప్తున్నారు — నేను మానేస్తాను" అన్నాను హడలి పోయాడనుకో! పాపం బాలా బీదవాడు. మేమిచ్చే ఇరవై రూపాయలే ఆధారంగా బ్రతికే వాడేమో. 'గాధా! రాధా ఇలా అనాలి, అలా పలికించాలి' అంటూ నన్ను ఒక్కొక్కసారి ప్రాధేయ పడిన పట్నుగా నేర్పించే వాడు. ఎందుకలా అన్నానా అని జాలిపడే దాన్ని తర్వాత.....తర్వాత రెండు మూడేళ్లకే నాకు పెళ్లయిపోయింది.

"అలా అష్ట కష్టాలు పడి ఇప్పుడు కీర్తి ధనుడయ్యాడు. ధనవంతుడయ్యాడు. అందుకే భగవంతుణ్ణి విశ్వసిస్తాడు. సంగీతంతో ఉపాసిస్తాడు....."

"అయితే మీ అమ్మాయికి సంగీతం నేర్పించరు గావా?" అవతలి స్త్రీ ప్రశ్నించింది.

"నేర్పించాలనే అనుకుంటున్నాను. అదేమంటుం దనుకున్నావ్ తన పేరు కమల గనక తను కమలా కైలాసనాథన్‌లానో, కమలాచంద్రబాబులానో మారి పాడుతుందట, పిల్లలెలా మారిపోతున్నారు చూడు.!. ఈ కచ్చేరి ముగిసాక వెళ్ళి మాష్టార్ని కలుసుకు మాట్లాడతాను ఏమంటారో?—"

గాయకుడు మరొక పాట మొదలు పెట్టేసరికి ఆ స్త్రీలు నిశ్శబ్దం అయిపోయారు.

జయ జయ గోకుల బాలా
జయ కరుణాల వాలా.....

నారాయణ తీర్థుల వారి రచన. ఈ సారి శ్రోతలు మరీ శ్రద్ధగా వింటున్నారు. ఆ రాగ మాలికలో మలుపు వచ్చినప్పుడంతా రాగం మార్పుకు గల విశిష్టత ఉండగా కంఠంలో గొప్ప వైవిధ్యం చూపిస్తున్నాడు శ్యామశాస్త్రి.

స్త్రీలంతా రాగ భావ మిళితమైన గానానికి వివశులై భక్తితో వింటున్నారు— మగవాళ్ళలో కొందరు మెల్లమెల్లగా మాట్లాడుకుంటున్నారు.

మాధవాచారిగారికి విసుగు వేసింది. "ఏం గాయకులో—గాలి బుడగల్లాంటి గాయకులు ....ఈ పేరూ, గీరూ ఎనాళ్ళ ఉండాలి!..... టైమయి నట్టుంది.— ఇప్పుడే వెళ్తే బస్సులో మంచి సీటు దొరుకుంది. వెళ్ళనా? వద్దా?" అనుకున్నారు. ఆయనకా సంగీతం కచేరీ అతిశయ ప్రదర్శనలాగుంది. గాయకుడి తన్మయత అంతా కపటం అని ఆయన నమ్మకం. అక్కడి గాయకులు, వాదకులు, శ్రోతలు అందరూ నటుల్లాగే కనిపిస్తున్నారు ఆచారిగారి కళ్ళకి.

లేవబోయారు. కాని లేవలేకపోయారు. ఎంతైనా వారు విద్వాంసులు. శ్రుతిమధురమైన సంగీతం, భావపూర్ణమైన భక్తీ సామాన్య మానవుల్ని ఆకర్షితుల్ని చేస్తాయి. అవి ఆయన్ని బంధించాయంటే ఆశ్చర్యం లేదు. సంగీతపు విలువ సంగీత జ్ఞానం కలవారికే అర్థమౌతుంది. సంగీత విద్వాంసులు ఏ గానాన్ని, ఎవరిగానాన్ని తిరస్కృతితో చూడలేరు— కానైతే కాస్త విసుక్కుంటారేమో. కదల్లేక కూర్చున్నారు. మాధవాచారిగారు. తను లేచి వెళ్ళిపోతే తన పోక సంగీత జ్ఞానంలేని పట్టి పశువు క్రింద అందరూ జమకడతారేమో నన్న భయం ఆ సమయంలోనే కలిగింది.

శ్యామశాస్త్రి మాత్రం పాడుకొని వెళ్ళిపోతున్నాడు. "మనసా వృథా గర్వమేటికి, మన పాదసామ్ము కృపలేక మన సామర్థ్య మేమున్నది....."

మిన్ను ముట్టిన కరతాళ ధ్వనుల్లో పాట ముగిసింది. ఈ సారి శ్యామశాస్త్రి త్యాగరాజ కృతి ప్రారంభించాడు.

"నిను వినా నామదెందు నిలువదే శ్రీహరి...హరి.."

"హరి కాంభోజి జన్యం...." అనుకున్నారు మాధవాచార్యులు.

"కనులకు నీ సొగసెంతో క్రమ్మియున్నదీ...గనుక నినువినా నామదెందు ....." అద్భుతమైన ఆనందంలో, అపూర్వమైన భక్తిలో పాడుతున్నాడు.

"ఇతనేం చేస్తుంటాడండీ?" పక్కనున్నాయన్ని అడిగారు మాధవచార్యులు గారు.

తల ఒకే విధంగా తిప్పుతున్న ఆయన "నాకూ సరిగ్గా తెలీదండీ! ఎక్కడో గాన కళా సమితిలో కార్య



# మలుపులో పిలుపు

దర్శిగా పనిచేస్తున్నాడని విన్నట్టు జ్ఞాపకం. ఇలా కచేరీలు మాత్రం చేస్తాడు."

"అప్పటికి పద్దెనిమిది వయసైతే....ఇప్పుడు నలభై.....నలభై అయిదూ ఉంటుంది. ఇతనికి. కొందరు వయసెక్కువైనా లేతగానే కనుపిస్తారు. లేకపోతే ఇంత అనుభవజ్ఞుడిలా పాడగలడా?" ఈ మాదిరిగా తృప్తి పడబోయినా మాధవాచార్యులు గారి ఆలోచనల ధోరణి మారలేదు. ఆయన హృదయంలో యుద్ధం ఘోరంగా జరుగుతున్నది.

ఎన్నడూ లేదు— ప్రాణప్రదమైన సంగీతం ప్రాణాంతకంగా ఎప్పుడూ అనిపించ లేదు. ఇప్పుడెందుకు ఈ సంగీతం వినటానికి తనకు మనస్కరించడం లేదు? తను ఆత్మ ద్రోహం చేసుకుంటున్నాడు. ఇష్టంగా తోస్తున్న దాన్ని — ఇష్టం కావడం లేదనే భావంతో త్రొయ్యడానికి చూస్తున్నాడు. ఇది ఆత్మ వంచన కాదూ?

తనకే అపకారం చెయ్యని— భక్తుడి వంటి ఆ గాయకుడి మీద ఎందుకింత అసందర్భమైన కోపం? నిజంగా అంతమంది ఆ గానం విని ఆనందిస్తుండగా— సంగీత విద్వాంసుడైన తను ఆనందించ

---

అధికారి : ఏమయ్యా ఇంటర్వ్యూకి వచ్చేటప్పుడు నీట్‌గా రావాలని తెలీదూ ? అలా మాసిన గడ్డం చినిగిపోయిన చొక్కాతో తయారయ్యావేం ?

యువకుడు : నే నొచ్చింది ఉద్యోగంకోసంగానీ పెళ్ళి చూపులకి కాదు గదండీ !

మాధవ్ (తెనాలి)

---

లేక పోవడం తనకే ఎంత అవమానం ? తనకు ఈ వయసులో అలా పాడటం సాధ్యం కాదన్న అసూయేమో ఇది!— కానీ— ఆ యువ గాయకుడు తన కుమారుడై, తను నేర్పినదే అతను గానం చేస్తున్నట్లయితే తనెంత ఉప్పొంగి పోయి ఉండును.

తనెందుకి సిక్కడకి వచ్చాడు? వచ్చినా ఈ రోజు ఈ గాయకుడి గానమే ఎందుకు వినవలసివచ్చింది. తనలాటి వాడు సభల్లో ఉండకూడదు......."

మాధవాచార్యులుగారు ఆలోచనలో ఉండగనే పాట పూర్తయింది. 'వన్స్‌మోర్' అని ఒక శ్రోత అరుపు. ఇంతలో 'సైలెన్స్! సైలెన్స్— ఇప్పుడు శ్యామశాస్త్రిగారు కొద్దిగా మాట్లాడి తర్వాత పాడతారు.' అని చెప్పి వెళ్ళాడొకాయన.

శ్యామశాస్త్రి గొంతు సవరించుకున్నాడు. అతనేం మాట్లాడతాడోనని కుతూహలంతో చూస్తున్నారంతా.

"నా పేరు శ్యామశాస్త్రిగా విని చాలామంది ఆశ్చర్యపోతుంటారు. కొందరు అరవసోదరులునాకా బిరుదు ప్రసాదించారులెండి. నా అసలు పేరు శ్యామసుందరశాస్త్రి, పేరుకు తగ్గట్టునల్లగా ఉన్నాను కా!" నవ్వాడు శ్యామశాస్త్రి. సభంతా చిన్న చిన్న నవ్వులతో నిండిపోయింది.

"ఇక్కడ ఇదివరకొకసారి చిన్న గాన సభ చేశామ్, చాలాకుంది నేనెరుగు? ఏర్పాటంటూ నా వివరాలడిగారు అప్పుడు.

"ఏం చెప్పను? ఒక విధంగా చెప్పాలంటే ఇదే మా వూరు. నాకు పదేళ్ళప్పుడు, మా నాన్నగారు చనిపోయినది ఈ వూళ్ళోనే. అప్పటినుంచి మా గురువుగారే నా భారం వహించేరు. దిక్కులేని వాడినైన నాకు ఈ విద్య నేర్పిస్తే ఎలాగో బ్రతుకుతాననే నమ్మకంతో ఆయన పట్టుదలగా నాకు నేర్పించారు. అనివార్య కారణాలవల్ల ఎక్కువ కాలం ఆయన దగ్గర ఉండి, ఇంకా నేర్చుకోవలసిన వెన్నో నేర్చుకోలేదు. కానీ ఆయనే నా మొదటి గురువుగారు. ఆయన మీద గల భక్తి గౌరవాలు ఇంకెవరి మీదా నాకులేవు... ఆయన వూరుకూడా ఈ పరిసరాల్లోనిదే. గురువుగారి పేరు వి.మాధవాచార్యులు— అతి త్వరలోనే ఆయన్ని దర్శించుకోవాలనే తహతహతో ఉన్నాను—"

నిశ్చేష్టులై పోయారు మాధవాచారిగారు... తనెక్కడ ఉన్నట్లో క్షణంపాటు తెలియలేదాయనకి... ఈ లోగా ఒకరిద్దరు అనుమానంగా వెనక్కు తిరిగి ఆయన వైపుకు చూశారు.

కలకాదు కదా? ఇతను తన శిష్యుడా?— శ్యామశాస్త్రి....... ఆర్. శ్యామ సుందరం శాస్త్రి...... అవును.....ఇతను....." ఏదో పోగొట్టుకున్న వారిలా శ్యామశాస్త్రి వేపు దీక్షగా చూడసాగారు మాధవాచారిగారు.

శ్యామశాస్త్రి చెప్తున్నాడు: "ముఖ్యంగా నేను చెప్పేదేమిటంటే మా గురువుగారు శ్రీ వెంకటేశ్వరుని పై చేసిన రెండు కృతులు ఇప్పుడు పాడి ఈ సంగీ సంగీత సభను ముగిస్తాను. ఆయన 'మాధవ' ముద్రతో కీర్తనలనేకం చేసేరు. ఎందు చేతనో అవి ప్రచారంలోకి రాలేదు. — అలాటి ప్రచారాలు ఆయన కిష్టంలేదు కూడా. తను శత సహస్ర కష్టాలుపడి చేసిన కృతుల్ని అందరూ అవకతవకలుగా పాడేస్తారేమోనని ఆయన భయం. ఆయన భయపడ్డారంటే తప్పులేదులెండి.... ఇంతవరకు అలా జరగడం నేను గమనించకపోయినా— మాటకు అనుకోవచ్చుగా........ కనులకు నీ సొగసెంతో బదులు బదులుగా కనులకు నీ వలపెంతో క్రమ్మియున్నది. అని పాడేస్తే ఏం చెయ్యగలం?" శ్యామశాస్త్రి నవ్వి చెప్పగానే అందరూ విరగబడి నవ్వారు. మాధవాచార్యులకి కూడా నవ్వొచ్చింది. — కాని ఆయన నవ్వు అర్థ్థంగా ఉంది. కలుక్కుమనే భావాన్ని మలుపు; తను మూర్ఖుడని అంతరాత్మ క్షణక్షణానికి చరుస్తున్న చరుపులు. తనెంత నీచుడు?— ప్రియాతి ప్రియమైన శిష్యుణ్ణి.......

శ్యామశాస్త్రి చెప్పే మాటలు ఆయన ఆలోచనా స్రవంతికి అడ్డకట్ట వేస్తున్నాయ్.

"మా గురువు గారికి నేను గురుదక్షిణ ఇచ్చుకో లేదు. ఆయన ఋణం ధన రూపంలో కాని, ఇంకో విధంగా గాని తీర్చుకోవాలని ప్రయత్నించటమే హాస్యాస్పదం. నా శక్తి సామర్థ్యాల మేరకు ఆయన కృతులను ప్రచారంచెయ్యడమే నేనివ్వ గలిగే, ఆయన పుచ్చుకోనదగిన మంచి గురుదక్షిణ అని నా భావం. అందుకని మా గురువుగారికి తెలియకుండానే ఆ కృషికి పూనుకున్నాను. ఇప్పుడు వినండి!....." శ్యామశాస్త్రి కూర్చుని గొంతు ముమ్మారు సర్దుకుని వాదకులకి సైగ చేశాడు.

మోహన రాగాలాపన............

తన స్వీయ రచన కనుక మాధవాచార్యులకి అలనే

కృతి పాడబోతున్నాడో వెంటనే తెలిసింది. కంపిస్తున్న ఆయన మనసు — సులలితమైన గాన శక్తికీ, సుమృదుల రాగస్వర్శ మరింత సంచలించిపోయింది.

సాహిత్యాన్ని కూడా ఎవరో మెచ్చుకుంటున్నారు:

"ఇతను నాశిష్యుడు....." అది గర్వమో, ఆనందమో.... సిగ్గో, వేదనో తెలిదు. మాధవాచార్యులు గారి కళ్లు చెమ్మగిలేయి. గబుక్కున జేబులోని కళ్లద్దాలు తీసి పెట్టుకున్నారు. అవసరంలేకపోయినా.

"నేనెంత నీచుణ్ణి......?" ఆయన హృదయం మరీ పశ్చాత్తాపంతో పరితపిస్తోంది.

ఒకనాడు పదిమిదేళ్ల వయసున్న కుర్రవాణ్ణి వెంటబెట్టుకుని వచ్చి..... ఈ అబ్బాయికి మీరే సంగీతం నేర్పించాలి మాష్టారూ! అని తన కప్పగించి వెళ్ళిపోయాడు జగన్నాధశాస్త్రి.

జగన్నాధం వీణలు తయారు చేస్తాడు. అందు చేతను వాదనం కూడా కొంతవచ్చు. అతనితో తన కున్న పరిచయాన్ని పురస్కరించుకుని ఆ అబ్బాయికి సంగీత విద్యను నేర్పించడం మొదలుపెట్టాడు తను. ఆ కుర్రవాడికైనా సంగీతమంటే సామాన్యమైన ఉత్సాహంకాదు. ఒక్క ఏడాదిలో ముప్పయ్ కృతుల దాకా నేర్చుకోనడమే కాక అనుభవజ్ఞులకు మించి పోయి పాడేవాడు. ఆ తర్వాత రెండు సంవత్సరాలకే తండ్రి లేని వాడయ్యాడు. పాపం— అయినా తనకు మరింత సన్నిహితుడై పోయాడు......అటువంటి శిష్యుడున్నందుకు గర్వించే వాడు తను. కాని అప్పటికి యువ రక్తం తనలో!— గర్వం, అహం ఉండేవి.

వాటిని చూసి శిష్యవర్గం జడుస్తుండేది. కాని శ్యామశాస్త్రికి తన దగ్గర చాలా చనువూ, పూర్తి ధైర్యం.

ఆ ధైర్యంతోనే ఒకనాడు శ్యామశాస్త్రిగారి కృతి ఒకటి చెప్పమని పట్టుపట్టి కూర్చున్నాడు. ఆ రాగం గురించి ఇంకా బోధించ లేదు తను. అప్పుడప్పుడే చెబ్దామని అనుకునే లోపల అతనే అడిగేశాడు. అదే తనను రెచ్చ గొట్టింది...... ఏదైనా నేర్చుకునే వాళ్లకి క్యూరియాసిటీ కలగడం .... సహజం... అయినా ఇంత ఇంక్విజిటివ్‌నెస్ ఏమిటీ అని.... అప్పట్లో ఆ ఆగ్రహం తనని ప్రలంభుణ్ణి చేసింది. ముంచేత్తి నాలుగూ బాగా దులిపేశాడు.

పదిహేనో ఏడు అతనికప్పుడు. ఎప్పుడూ అలా తిట్టలేదు అతన్ని ..... నల్లగా ఉండే మొహం సిగ్గుతో ఆక్కుపచ్చలా తయారయింది. అంతే! మర్నాడు ఆ ప్రియ శిష్యుడు మటు మాయమయ్యాడు...... తనకి రెండు రోజులు అన్నం సహించలేదు. రెండు రాత్రులు సరిగ్గా నిద్రపట్ట లేదు. శ్యాము మళ్లీ రాలేదు. అలా మరుపులో పడి పోయింది ఆ సంఘటన.

అనాటి కీనాడు అనుకోకుండా కనిపించాడు— తనమీద ఏ మాత్రం కక్ష పెంచుకోని శిష్యుడు, తన కృతుల్ని ప్రచారం చెయ్యాలని కంకణం కట్టుకున్న ప్రియ శిష్యుడు. ఇప్పుడతనికి కనిపించే అర్హత తనకు లేదు. ఈ వివర్ణమైన మొహాన్ని చూసి అతనేమనుకుంటాడో? ఊహూఁ అతనేమీ అనుకోడు.. అటువంటివాడు కాడు— ఎట్లాటి విద్వాంసులైనా తనలా అసూయా వాహినిలో ఒకానొకనాడు మునగక తప్పదు కాబోలు.... ప్చ్..... తల్లితండ్రులు బిడ్డను ద్వేషిస్తే? బిడ్డలు తల్లితండ్రుల్ని ద్వేషిస్తే? గురువు శిష్యుడి మీద అసూయపడితే?

**తమను ద్వేషించుకున్నట్లే, తమను ద్వేషించుకున్నట్లే, తమమీద తాము అసూయపడినట్లే!**

"ఇప్పుడు కాదు, పదేళ్ల నాడు [illegible] శ్యామ శాస్త్రివి...... [illegible] నా శిష్యుడితో........."

[illegible] ★

# మా కాంపు అనుభవాలు

మా కేంపు జీవితం టెంట్లలో అంటే గుడారాలలో ఎలాగుంటుందో పలుగురికి తెలిపాలనిపిస్తుంది. టెంట్లలో ఉండవలసిన అవసరం ఏమిటని అడగొచ్చు. దానికి కారణం మా శ్రీవారి ఉద్యోగం. ఆయన "జియాలాజికల్ సర్వే ఆఫ్ ఇండియా"లో భూగర్భ శాస్త్రజ్ఞులుగా పనిచేస్తున్నారు. వీళ్ల ఆఫీసు కలకత్తాలో ఉండేది. ఇప్పుడు అంటే రెండేళ్లయి రీజనల్ ఆఫీసులు లక్నో, హైదరాబాదులలో తెరిచారు. మద్రాసు, పూనా మొదలగు పట్నాలలో కూడా ఆఫీసులున్నాయి. ఈ ఉద్యోగానికి ఏడాదికి ఆరు లేక ఏడు నెలలు వనవాసం (అంటే కేంపు) ఉంటుంది. మిగతా రోజులు హెడ్డాఫీసులున్నచోట ఉంటాము. కొన్ని పెద్ద కేంపులు అంటే సంవత్సరాల తరబడి ఉంటాయి. ఇలాటి కేంపులో రెండున్నర సంవత్సరాలు టెంట్లలో ఉన్నాము. ఏవూరు కేంపు వేస్తే ఆవూరు వెళ్లి, వీళ్ళ పనిచేసే జాగా దగ్గరగా గుడారాలు వేసుకుంటాము. ఈ గుడారాలలో జీవితం, వీళ్ళు పని చేసే పద్ధతి సూక్ష్మంగా చెప్తాను. ముందు టెంట్ల జీవితం చెప్తాను...

వీళ్ళ ఆఫీసు వాళ్ళు ఇండియాలో చాలా చోట్ల సర్వే చేస్తారు. అందుకు ఎన్నో పార్టీలు వివిధ ప్రాంతాలకి వెళ్తుంటాయి. వీళ్ళు పని ఎన్నో

**యం. సుగుణ**

మైళ్ళ పొడవున చేస్తారు. అందుకని ఒకచోట స్థిరంగా టెంట్లు వేసుకుని ఉండలేము. నెలకో రెండు నెలలకో టెంట్లు కూడా మారుస్తుంటాము. అందుకని పట్నాలూ, పల్లెలు అనే భేదం ఉండదు. వూరికి దూరంగా మా పార్టీలోని వారందరి టెంట్లు సరిపోయేంత ఖాళీస్థలం, దగ్గరగా మంచి నీటి వసతి చూసుకుని, ఆ ఖాళీస్థలం ఎవరిదో వారి అనుమతి పుచ్చుకుని ఆ స్థలం శుభ్రపరచుకుని అందరం టెంట్లు వేయించుకుంటాము. ఆఫీసర్లకందరికీ నాలుగేసి టెంట్లు ఇస్తారు. ఈ టెంట్లు కూడా పెద్దా, చిన్నా ఉంటాయి. లివింగ్ టెంట్ ఉండేందుకు కాస్త పెద్దది. ఇందులో రెండు మంచాలు, కొద్ది సామాను పట్టేదిగా ఉంటుంది. ఈ టెంటు ఆకారం చూసేందుకు దొండకాయకి నాలుగు చీపురు పుల్లలు గుచ్చి పిల్లలకి ఆడుకునేందుకు కిస్తారే అదేమాదిరిగా ఉంటుంది మా గుడారం. ఈ టెంటు రెండు పొరలతో ఉంటుంది. పెద్ద వర్షాలొస్తే తప్ప చిన్న వర్షాలకి నీరు లోపలికి రాదు. మిగతా రెండు టెంట్లు చిన్నవి. రెండు రేకు ముక్కలు నిలిపినట్లు ఉంటాయి. వీటిల్లో ఒకటి బాత్‌రూం క్రింద, ఒకటి వంటకని ఉపయోగిస్తాము. ఇంకో

టెంటు ఇవి సరి చిన్నవి. ఇవి లెట్రిన్ క్రింద ఉపయోగిస్తాము. మా లెట్రిన్ ఫ్లష్ కాదు.... నాలుగు గోతులు ఒక్కొక్కటి గజం లోతున త్రవ్వించుతాము. ఇదే మా లెట్రిను. ఈ టెంటుకి సెనసరీ టెంటు అంటారు. ఈ టెంట్లకి పేర్లు కూడా ఉన్నాయి. వంటకీ స్నానాలకీ వాడే టెంట్ల పేర్లు "వాల్ దారి" ఉండేందుకు (లివింగ్ టెంటు) "కాబూల్ హిల్" అనీ "O" (ఓ) టెంటు అనీ కూడా అంటారు. ఇంకా పెద్ద టెంట్లున్నాయి. ఇవి అందరికీ ఇవ్వరూ. వీటికి "స్విస్ కాటేజీ" అంటారు. ఈ టెంటుకి ముందు చిక్కంతో వరండా ఉంటుంది. వెనక గుడ్డతోనే వరండా మధ్యన వలు నదరంగా గది ఉంటుంది.

మేము టెంట్లు వేసుకుంటూంటే అక్కడి ప్రజలు వచ్చి సర్కసు వేస్తారా అని... కాకంటే మరేం చేస్తారని ప్రశ్నలు వేస్తుంటారు. కొంత మంది గుంపులు గుంపులుగా వచ్చి మా టెంట్లని పరిశీలించి ఎన్నో ప్రశ్నలువేసి ఆకాశాన్నుంచి వూడి పడ్డ మనుష్యులని చూసినట్లుగా వింతగా చూస్తారు. ఒక వూర్లో అయితే మేము టెంట్లు వేసుకున్న నాలుగు రోజుల తరువాత సర్కసు వస్తుందట. అందుకని మా టెంట్లుసర్కసు వాళ్ళవే అనుకుని జనం విరగబడేవారు. ఎప్పటి మంచి సర్కసు వేస్తారని ఎవరు చేస్తారని ప్రశ్నలు వేసేరు. ఇంక వినుగు పుట్టి 'ఆ ... మేమే వేస్తాం' అన్నా... వచ్చే నవ్వునాపుకుంటూ......

మేమెందు కొచ్చామో ఎవరికేనా చెప్తామను కోండి... ఉదా:— ఒక చోట పెట్రోలు కోసం వెళ్ళేము. అదే వారికి చెప్తే మాకు కొంచెం ఇవ్వకూడదా? భూమిలో ఉట్టినే దొరుకుతుంది కదా! అని అడగటం మొదలు పెట్టేరు. అంత సులువుగా దొరుకుతే అందరూ త్రవ్వి తీసుకో వచ్చుగా?.... పాపం వారికా సంగతి తెలియదు, చెప్తే నమ్మరు. మా కేంపులు సాధారణంగా చిన్న గ్రామాలలో ఉంటాయి. గంప సంసారంలా ఎప్పుడూ సామాను సర్దటంలాగే ఉంటుంది మా జీవితం. చూసే వాళ్ళకి బాగానే ఉంటుంది. మీకేం చక్కగా ఇండియా అంతాను చుట్టేసు న్నారు. అంటారు. కాని పిల్లల చదువులకి ఇబ్బంది. మేము ఏ అడవిలాటి ప్రదేశంలోనో ఉంటాము. కదా! పాములూ, తేళ్ళూ, జెర్రులూ మొదలగు విష జంతువుల భయం ఎక్కువగా ఉంటుంది. ఒక కేంపులో అర్ధరాత్రి చిరుత వచ్చింది. ఇంక అన్ని రకాల నీళ్ళు త్రాగాలి. అందుకని మరిగించి త్రాగుతుంటాము. మట్టి జాగాలో టెంట్లు వేసుకుంటాము కదూ! (కింద దరీ జంబుకానా) ఉంటుంది. చెదలు బాగా పట్టుతుంటాయి. సామా నంతా ప్రతిరోజూ చూసుకుంటుండాలి. చెదలు పట్టకుండా 'గమాక్సిన్' వేసుకుని కాలక్షేపం చేస్తాము ★

# వనితావాణి

## సలహాలు—సందర్భాలు

ఉగాది సంచికలో వనితాలోకం శీర్షిక క్రింద సూర్యకుమారిగారి వ్యాసము "సలహాలు—సందర్భాలు"లో అన్ని విషయములు వివరముగ వ్రాసినారు. ప్రతివారు ఈ వ్యాసము తప్పక చదువవలెను.

గుంటూరు కళ్యాణి, తుమ్మల బుల్లెమ్మ (అప్పికట్ల)

*　　*　　*

శాంతి సూర్యకుమారిగారు ఉగాది సంచికలో వ్రాసిన సలహాలు, సందర్భాలు అన్న వ్యాసం ఎంతో బావుంది. అందువల్ల పాఠకులకు ఎంతో లాభం. వారు వెలిబుచ్చిన అభిప్రాయాలు వాస్తవంగానూ సమంజసంగానూ ఉన్నాయి. ఇంత చక్కని వ్యాసం ప్రచురించిన సచిత్ర వారపత్రిక సంపాద కులకు నా అభినందనలు.

ఎ. కృష్ణవేణి (విజయవాడ)

*　　*　　*

సలహాలు ఇచ్చేవారికన్నా సలహాలు పొందేవారు కూడ బాగా ఆలోచించి మరీ ఆ సలహాలను పాటిం చడం ఇరుపక్షాల వారికీ శ్రేయస్కరమే అను కుంటాను. సలహా పొందేవారు "స్త్రీ అయినా" పురుషుడయినా, జ్ఞానదృష్టితో పరిశీలించక ముందే, కార్యాచరణలో పెట్టడంతో కొన్ని సల హాలు అడ్డదారి త్రొక్కడం, వాటివలన కష్ట నష్టాలకు గురికావడము సంభవిస్తుంది. కొందరు స్వార్థపరులు తెలివిగా ఎదుటివారిని పడగొట్టించా లనే దురుద్దేశముతో సలహాలు ఇస్తుంటారు. అలాంటప్పుడే సలహాదారి తెలివిగా ప్రవర్తించి వాటివలన ఎట్టి ఉపద్రవానికి గురికాకుండా చూసు కోవలయును.

ఎం. నరిసి (ఓల్డ్ కండ్లా)

## వంటలు

ఈమధ్య సచిత్ర వార పత్రికలో రకరకాలల వంటలను గురించి వేయటంలో, పత్రికకు నిండు దనం చేకూరింది. ఇకముందు కూడా, మన దేశపు వంటలనే గాక, విదేశాల వంటలను కూడా తర చుగా వెప్పవలసిందిగా కోరుతున్నాను. ముఖ్యంగా తీపి పదార్థాలను గురించి ఎక్కువగా వేస్తే బాగుంటుందని నా నమ్మకం.

పి. పద్మావతి (విశాఖపట్నం)

## నిట్టింగ్

13—3—64 సంచికలో ప్రచురించిన 'నిట్టింగ్ వ్యాసం' మీద ప్రయోగం చేశాము. కొంచెం శ్రమ కలిగినా, మొత్తంమీద 'బానెట్' చక్కగా తయారయింది. చాలా అందంగా కుట్ట గలిగాము. మా పాపాయి అందమైనదో, కాదో తెలి యదు గాని, 'బానెట్' వేశాక మాత్రం చాలా అందంగా, బుట్ట బొమ్మలా తయారయింది. నా ధన్యవాదాలు.

ఎస్. కామేశ్వరి (హైదరాబాదు)




మరొకసారి టెలిగ్రాముని ఎదురుపడిన ఎడ క్కుర్చీలో, మేను వాల్చాడు డాక్టరు క్రాంతి కుమార్. అరుణ రఘును తీసుకొని తానిక్కడకు వస్తున్న ట్టుగా పంపిన వర్తమానాన్ని మోసుకొచ్చిన టెలిగ్రాముని.

టెలిగ్రాం మోసుకు వచ్చిన సమాచారం కొద్ది దైనా, దాన్ని చదివిన క్రాంతి కుమార్ మనసు గత జీవితపు మరుగు ప్రాంతాలకు పరుగు తీయసాగింది. ఎన్నో సంగతులు— ఎప్పటివో—ఒక్కొక్కటే మన సులో ప్రవహించి 'మేమూ ఒకప్పుడు నీకెంతో సన్ని హితులమైన వాళ్ళం. ఆ రోజుల్లో మేము లేకుండా నీవు లేవు. అలాంటిది ఇప్పుడు మేమె మేము, మరొస్తున్నా ఒక్కనిమిషం గుర్తొస్తుందా' అని ప్రశ్నిస్తున్నాయి.

నిజమే. కాని ప్రస్తుత పరిస్థితులు వేరు. కాలం ఎంత మహత్తరమైందో అంత మధురమైంది కూడాను. ప్రస్తుతానికి ఏ విధంగానూ ఉపయోగ పడని పాత ఆలోచనల్ని మరుగుపరుస్తుంది. అరుణ, రఘు ఒకప్పుడు తనకెంత సన్నిహితులో! వారితో ఎన్ని సంవత్సరాల కాలం ఎంత ఆనందంగా గడచిందో! కాని విధి తమని వేరుచేసింది. దిక్కుకొకర్నిగా విసిరి వేసింది. ఆ మార్పును, భౌతికంగా వారి మధ్య ఏర్పడ్డ దూరాన్ని కాలం క్రమేణా భూతద్దం వస్తువు పరిమాణాన్ని పెంచినట్లుగా పెంచి చివరికి గుర్తు పట్ట లేనంతగా మార్చింది. అలా మార్పు రావటం అవసరమైంది కూడాను. కాని ఇప్పుడు అరుణ, రఘు ఇక్కడికి వస్తున్నారంటే ఇక వారిని గురించిన వెనుకటి సంఘటనలు జ్ఞాపకం రాక మానాయా, తను వాటిని గురించి ఆలోచించటం మానగలడా?

పది సంవత్సరాల తర్వాత నిన్ననాక మొన్న అరుణ ఒక్కతే స్టేషన్లో కనిపిస్తే ఎంత ఆశ్చర్యపోయాడో! ఇప్పుడు అరుణ రఘును తోడుగా తీసుకొని తనకు వస్తోందని తెలుసుకున్న క్రాంతి కుమార్ అంతకు రెట్టింపుగా ఆశ్చర్యపోయాడు. ఇలా తీసుకు వస్తానని మొన్న అరుణ మాటమాత్రమైనా అనలేదు.

మొన్న సాయంత్రం........

అరుణ స్టేషన్లో కనిపించింది. ఎంతో మారిపో యుంది నలుగురు బిడ్డలతల్లి. భర్తకు అనంతపురంలో ఉద్యోగం. ఇంజనీరు. తమ్ముళ్ళతో ప్రయాణం చేస్తున్న అరుణ ఏదో పనిమీద ప్లాట్ ఫారంమీద తిరు గుతున్న క్రాంతికుమార్ను గుర్తు పట్టి పిల్చింది. ఆమె పిల్చింది తమ్ముని కాదేమో ననుకున్నాడు క్రాంతి కుమార్ మొదట్లో. కాని ఆమె పేరుపెట్టి మళ్ళీ పిలవటంతో దగ్గరకు వెళ్ళాడు. అరుణ! ఎప్పటి అరుణ!! కాని ఈ అరుణ వేరు. ఈ అరుణ కళ్ళలో వింత వెలుగులు గాని, చిలిపి చూపులు గాని మాటల్లో చమత్కారంగాని మచ్చుకైనా కన్పడవు. మనిషికి తగ్గట్టు నిగూఢమైన మార్పులు. తూచి వాడి నట్లుండే బరువైన మాటల్తో హుందాతనాన్ని చాటుతోందిప్పుడు. 'ఔను మరి ఇంజనీరు గారి భార్య!' అనుకున్నాడు క్రాంతికుమార్.

మాటా మంతీ లేకుండా నిల్చుని ఆలోచనా వీచికల్ని ప్రోవుచేసుకుంటున్న క్రాంతికుమార్ను చూచి 'అవు నవున్లే, మేమెక్కడ గుర్తుంటాము ఫారిన్ రిటర్న్డ్ డాక్టరు గారికి' అంది అరుణ.

అరుణ ఏ ఉద్దేశ్యంతో అన్నదో గాని ఆ మాటలు క్రాంతికుమార్కు బాధకలిగించాయి. తను ఏమీ మాట్లాడకుండా ఉండటాన్ని అరుణ అలా అన్నదనుకుని 'కులాసాయేనా' అనగలిగాడు.

అరుణ అదోలా నవ్వింది. అది నవ్వో, నిట్టూర్పో అర్థం కాలేదు క్రాంతికుమార్కు.

తర్వాత సంభాషణ అనేక విషయాలపై దొర్లింది. అరుణ తన భర్తను గురించి, పిల్లల్ని గురించి, భర్త ఉద్యోగాన్ని గురించి, చెప్పింది. ఆ మాటల్ని ఎంతో శ్రద్ధగా విన్నాడు, క్రాంతికుమార్. విన్న మీదట అనిపించినదేమంటే 'అరుణ అదృష్ట వంతురాలే, పెద్ద హోదాలో ఉన్న భర్త, ఆణి ముత్యా ల్లాంటి పిల్లలు, సంసారం సుఖంగా సాగిపోవటానికి అంతకంటే కావలసిందేముంది?' అని అదే మాట పైకి అనేశాడు కూడా.

అరుణ కొన్ని క్షణాలు మౌనంగా వుండి, "ఔను, నేనెంతో సుఖంగా ఉన్నాను. నాకేం తక్కువ. దిగులు చింత తీరని కోరిక అంటూ లేనే లేవు." అంది ఎటో చూస్తూ. క్రాంతి కుమార్ నివ్వెర పోయాడు. ఆ మాటలు అంటున్న అరుణ వైఖరి సహజంగా కన్పించ లేదు. అందులో వ్యంగ్యమే మైనా ఉందా? అరుణ జీవితం నిజంగా సుఖ ప్రదం కాలేదా? అనిపించింది. కాని ఆ విషయమై ఏమని అడుగుతాడు? అందుకని విషయం మారుస్తూ 'రఘు ఎక్కడ ఉంటున్నాడు? కులాసానా' అన్నాడు.

అరుణ నిట్టూరుస్తూ 'అన్నయ్య విషయం ఏమని చెప్పాలో అర్థం కావటం లేదు. నే చెప్ప గల విషయం ఒక్కటే. అన్నయ్య కడుపులో కేన్సర్ చాలా ప్రమాదంగా ఉందని వైరొచ్చింది. అందుకే వెళ్తున్నాను.' అంది. క్రాంతికుమార్ దిగ్భ్రమ చెందాడు. ఏమీ మాట్లాడలేక పోయాడు. ఎప్పుడూ 'రోబస్టు'గా కనిపించే రఘుకు ఈ వయసులో

కేన్సరేమిటి అనుకున్నాడు. ఇంతలో గార్డ్ విజిలు వేసి పచ్చజండాను విదిలించాడు. అరుణ వెళ్లిపోయింది.

క్రాంతికుమార్ లేచి సిగరెట్ ముట్టించి గట్టిగా పొగపీల్చి వదిలాడు. పొగసుళ్లు తిరుగుతూ పైపైకి లేచి వెళ్తోంది. చిన్నప్పుడు జీవిత మంతా 'గులాబీలు పరచిన బాట'లా అనిపించేది. కాని రాను రాను తన అభిప్రాయాన్ని తప్పనిసరిగా మార్చుకోవలసి వచ్చింది, క్రాంతికుమార్‌కు. ఎన్నెన్నో ఊహా సౌధాలు నిర్మించుకున్నాడు కాని అన్నీ వమ్మయినై ఒక్కటి తప్ప. అది తను ఫారిన్ రిటర్న్డ్ డాక్టరుకావాలనే కోరిక.

అమ్మ అంటూండేది 'నీవు తప్పకుండా డాక్టరువౌతావురా' అని కాని పరిస్థితుల్ని చూస్తుంటే తనకు భయం వేసేది. మెడిసిన్ చదవటం మాటలో అయ్యే పని గాదు. వేలకు వేలు డబ్బును వెదజల్లాలి. అంత డబ్బు ఎక్కడి నుంచి వస్తుంది.! అమ్మ అతి కష్టంతో మీద కుటుంబాన్ని వెళ్ళదీస్తూ తనను చదివిస్తోంది. అంతా పోగా మిగిలిన ఒక ఎకరం పొలం రమ పెళ్ళి ఖర్చులకి, కట్నం కానుకలకు గాను మిగిల్చింది.

రమ యస్సెల్సీ ప్యాసయింది. మామూలుగా పాసవటం గాకుండా స్కూలుకంతకూ ఫస్టుగా వచ్చింది. కాని ఏమిటి ప్రయోజనం? కాలేజీకి పంపే అవకాశం ఏమాత్రమూ కన్పించ లేదు. ఒక్కగాను ఒక్క చెల్లెల్ని ఇంకా చదివించాలనే అనుకున్నాడు, క్రాంతికుమార్. తమ ఆర్థిక స్థితి గతులు అతనికి తెలియకపోలేదు. అయితే చదువు మీద వుండే ఆసక్తి, చెల్లెలి మీది ప్రేమ అలా అనిపించాయి అతనికి.

'అయినా, ఆడపిల్లలకు అంతకంటే చదువు ఏందుకురా క్రాంతీ! ఇంతవరకూ చదివింది చాలు. ఇక పనీ పాటల్లో నేర్పు, వంటవార్పుల్లో వాకచక్యమూ, కుటుంబ నిర్వహణలోని మెళకువలు తెలుసుకుంటే చాలు, తన జీవితాన్ని, తన భర్త జీవితాన్ని నందనవనం చేసుకోవటానికి' అనేది అమ్మ.

'అయితే అరుణ ఎందుకు చదువుతున్నట్టు' అనేవాడు క్రాంతికుమార్.

అరుణ, రమ సహాధ్యాయులు. వారిద్దరిదీ గాఢమైన స్నేహం. ఎప్పుడూ కలిసి తిరిగేవారు. ఒకళ్ళింటికి మరొకరు వెళ్తూ తరచు ఒకే చోట కాలం గడుపుతుండేవారు. ఏ పని చేయాలనుకున్నా ఇద్దరూ కలిసి చేసేవాళ్ళు. అందువల్లనే స్కూల్లో వారిద్దర్నీ 'ద్వయం' అనేవారు. విశేషమేమంటే ఇద్దరూ తెలివైనవాళ్లే. సమ వుజ్జీలు. అందంలో ఎవరిది పైచేయి అని చూచిన వాళ్లంతా తర్జన భర్జనలు చేసుకునేవారు. దాదాపు ఒకే ఈడు. అయితే ఎవరికైనా ఎక్కడో ఏదోలోపం ఉంటుందన్నట్లు వారి స్నేహంలో ఇతరులకు కన్పించేది మాత్రం ఒకేఒక లోపం. అదే వారిద్దరి అంతస్థుల మధ్య వున్న తేడా.

'అరుణకేం నాయనా, లక్షాధికారి పుత్రిక. అవసరమున్నా, లేకపోయినా చదువుకోటానికి కావలసినంత అవకాశం ఉంది. స్తోమత ఉంది. మన కది లేదు. అయినా మగవాడివైనందుకు నీకు చదువు అవసరం. ఎన్ని కష్టాలొచ్చినా విఘ్నం రానీకుండా చదువు సాగించాలి. నీ కోర్సు పూర్తి అయింతర్వాత మంచి సంబంధం చూసి రమ కి వివాహం చేస్తే — దానికి పది వియ్యేలు చెప్పించినంత. నాకంత కంటే కావలసిందేముంది.' అనేది అమ్మ. మరి, రమ మాతృవాక్య పరిపాలకురాలు.

రమ విషయం తల్చుకుంటే క్రాంతికుమార్‌కు రంపపు కోతలాంటి బాధ కలుగుతుంది. ఆమె భర్త బాగా చదువుకున్నవాడు. సంస్కారమున్న వాడు. బాగా సంపాదిస్తున్న వాడూను. అయితే ఏం? ఏ వ్యక్తికైతే మొట్టమొదటగా మనసు ఇస్తుందో ఆ వ్యక్తి తన భర్తకానప్పుడు మగువ పొందే మనఃక్లేశాన్ని మించిన నరకం లేనేలేదంటారు. కాని స్త్రీ సహనశీలి. బడబానలాన్ని కూడ ఏమాత్రం బాధ కలుగకుండా తన కోమల హృదయంలో దాచకునే శక్తి ఒక్క స్త్రీకే ఉంది. కాగా, రమ మరో మెట్టుపైనే ఉందని చెప్పాలి. గతాన్ని మర్చిపోయినా జీవితాన్ని ఉన్నంతలో సుఖమయం చేసి తన కుటుంబాన్ని తీర్చి దిద్దుకుంటోంది.

'కాని పురుషుని విషయం వేరు. ముఖ్యంగా నా విషయం' అనుకున్నాడు క్రాంతికుమార్.

అతనిలో బలహీనత గతాన్ని మర్చిపోయి క్రొత్త పరిస్థితుల కనుగుణంగా తనను తాను మల్చుకోలేక పోవటం. 'అసలు ఈ రెండు కుటుంబాల మధ్య స్నేహం ఎందుకు మొలకెత్తాలి? మొలకెత్తినా ఇలాంటి విషాద పరిణామాలకు ఎందుకు దారితీయాలి. తీయాలి?' అనిపించింది క్రాంతికుమార్‌కు. అతని ఆలోచనలు అతన్ని ఒక వేసవి సెలవులలో జరిగిన సంఘటనల వైపు లాక్కుపోయాయి.

* * *

ఆ రోజు.........

'రమా, రమా' అని ఆదుర్దాగా పిల్చాడు క్రాంతికుమార్. రమ తన గదిలోనుండి హాల్లో కొచ్చింది. 'ఏమిటన్నయ్యా'

'రేపు నీ పుట్టిన రోజు గదూ?'

'అవునన్నయ్యా'

'అవునన్నయ్యా ఏమిటి, చెప్పవేం? ఫ్రెండ్సెవర్నీ పిలవక్కర్లే' తానుగా ఏ విషయాన్నీ బయట పెట్టదు రమ.

'లేదన్నయ్యా, మన అరుణను, వాళ్ల అన్నగార్ని మాత్రమే పిల్చాను. పెద్ద ఆర్భాటమేమీ చేయదల్చుకోలేదు' అంది తలవంచుకుని.

'అలాగా వెరీగుడ్.' అని పత్రిక చదవటంలో లీనమైపోయాడు. క్రాంతికుమార్, కాని హఠాత్తుగా అతనికేదో స్ఫురించింది. 'అరుణ, వాళ్ల అన్నగార్ని' అంది రమ. ఆ మాట రమ నోటంట కొత్తగా ధ్వనించింది. ఎప్పుడూ 'రఘురాం' అనే రమ ఈ రోజు పేరును ఉచ్చరించ లేదెందుకనో.

క్రాంతికుమార్‌కు నవ్వు వచ్చింది. తన మనస్సెప్పుడూ ఎక్సురేలా పనిచేస్తుంటుంది. ఏమీ లేని విషయంలో కూడా ఏదో అంతరార్థం దాగి ఉందని అనుమానించి పరిశోధించే మనస్తత్వం. రమ ఏమన్నా రఘును ప్రేమిస్తోందా?

రమ, అరుణల స్నేహం హైస్కూలు చదువుతో అంతమవకుండా తర్వాతకూడ దినదినాభివృద్ధి పొందింది. వారి వలన ఆ రెండు కుటుంబాలకు రాకపోకలు ఏర్పడినై. అరుణ తరచుగా రమకోసం వస్తుండేది. క్రాంతికుమార్ వద్ద కూడ క్రమేపీ అరుణకు చనువు, స్నేహం ఏర్పడినై. 'అలాగే రమకు రఘుకు గూడ స్నేహం ఉందేమో? వారిద్దరికీ వివాహం చేస్తే?' అనుకున్నాడు క్రాంతికుమార్. వెంటనే అమ్మదగ్గరకు వెళ్లి ఆ విషయాన్ని ప్రస్తావించాడు.

'అవున్రా క్రాంతీ! నాకూ అనిపిస్తోంది. రమకు కూడా ఆ అభిప్రాయమున్నట్లు నే నిటీవల గమనించాను. కాని వాళ్లతో వియ్యం అందని పండేమో' అన్నది అమ్మ.

నిజమే. అందచందాలలోనూ, చదువు సంధ్యల్లోనూ సరితూగవచ్చేమో గాని వాళ్ల అంతస్తుతో సరి తూగలేమోననిపించిందతనికి. అయినా రఘు అభిప్రాయం ఎలా వుందో తెలుసుకోవాలనిపించింది.

ఆ మర్నాడు రఘు, అరుణ వచ్చారు— రమ బర్త్‌డే పార్టీకి. బర్త్‌డే గిఫ్ట్‌గా రమకు ఒక 'రింగు' ప్రెజెంటు చేశాడు రఘు. ఫలహారాలు కాఫీలు అయింతర్వాత 'ఏదైనా పిక్చరుకు వెళ్దామా రఘూ!' అన్నాడు క్రాంతికుమార్. "ఓ యస్. తప్పకుండా. అరూ! తన బర్త్‌డే పార్టీతోపాటు సినిమాపార్టీ కూడా కూడా ఇప్పించు మీ రమచేత' అన్నాడు రఘు, సినిమాకు నలుగురూ కలిసి వెళ్తే బావుంటుందనే ఉద్దేశ్యాన్ని వ్యక్తపరుస్తూ. అరుణ రమవేపు చూసింది 'ఏమంటావ్' అన్నట్టు. రమ కళ్లతోనే తన అంగీకారాన్ని తెల్పింది.

రమ, అరుణ రిక్షాలో కూర్చున్నారు. రఘు, క్రాంతికుమార్ మరో రిక్షాలో ఎక్కారు. ఒకదాని తర్వాత మరొకటి రెండు రిక్షాలూ పరుగులు తీస్తున్నై. వాటిని మించిన వేగంతో క్రాంతికుమార్ మనసులోని ఆలోచనలు పయనిస్తున్నై. 'ఇదే సమయం. రఘుతో రమ విషయం ప్రస్తావించాలి' అనుకున్నాడు క్రాంతికుమార్. సంభాషణ ఎలా మొదలెట్టాలో ముందుగా మనసులో మననం చేసుకుని గొంతు సవరించుకున్నాడు క్రాంతికుమార్. ఇంతలో,

'మిస్టర్ క్రాంతికుమార్! నేనొక ముఖ్య విషయాన్ని మాట్లాడాలనుకుంటున్నాను' అన్నాడు రఘు.

క్రాంతికుమార్ ఆశ్చర్యపోయాడు. రఘు మాట్లాడాలనుకునే ముఖ్య విషయం ఏమిటా అని ఆలోచించాడు. బహుశః రమను వివాహం చేసుకుంటానని చెప్తాడేమో. అనుకున్నాడు. 'ఏమిటది?' అన్నాడు.

రఘు కొన్ని నిముషాలు మౌనంగా వుండి 'నీకు తెలుసుగా, రమ, అరుణల స్నేహం మూలంగా మన మిరువురమూ స్నేహితులమయ్యాము. మనమిరువురమే ఏమిటి మన రెండు కుటుంబాలూ చేరువయ్యాయి. కాని, వచ్చే సంవత్సరంతో నీ మెడిసిన్ అయిపోతుంది, నాఇంజనీరింగ్ పూర్తవుతుంది. తర్వాత ఇద్దరికీ ఎక్కడో ఉద్యోగాలవుతవి. మన స్నేహం మరుగు పడటానికి అవకాశం ఉంటుంది. అలా కాకుండా మన రెండు కుటుంబాలకు ఒక బాంధవ్యమంటూ ఉంటే.........' అన్నాడు.

'అవును, బాగానే ఉంటుంది.' అన్నాడు క్రాంతికుమార్. రఘు చెప్పబోయే విషయానికి అనుకూల వాతావరణాన్ని ఏర్పరచాలనే ఉద్దేశ్యంతో రఘు అన్నాడు.

'నాకు తెలుసు నీవు నాతో ఏకీభవిస్తావని....బహుశ నీ కీవిషయం తెలిసే వుంటుంది. మా అరుణ నిన్ను ప్రేమిస్తోందని."

# నీలి నీడలు

క్రాంతికుమార్ ఆశ్చర్యపోయాడు.. ఏం మాట్లాడాలో తోచలేదు. తన పెళ్ళి విషయం తను ప్రస్తావించదల్చుకుంటే రఘుకూడ తన పెళ్ళి విషయం ప్రస్తావించాడు. అరుణ తనను ప్రేమిస్తోందా? అరుణను తను ప్రేమిస్తున్నమాట వాస్తవమే. కాని అరుణ కూడ తనని ప్రేమిస్తోందని తను గుర్తించలేకపోయాడు...... చివరకు క్రాంతికుమార్ అన్నాడు:

'నిజమే రఘూ! కాని నా విషయంలో కంటే ముందు నేను రమ వివాహం విషయం ఆలోచించాలి.'

'నీ కభ్యంతరం లేకపోతే రమను నేను వివాహం చేసుకుంటాను' అన్నాడు రఘు మెల్లిగా.

క్రాంతికుమార్ ఆనందంతో ఉక్కిరిబిక్కిరై 'రఘూ' అంటూ మిత్రుని కౌగలించుకున్నాడు...

ముందు రిక్షాలో వెళ్తున్న అరుణ, రమ వెనక్కు చూసి కిల కిల నవ్వారు. రిక్షా గంటలు గణ గణ మన్నవి.

క్రాంతికుమార్ ఈ విషయం అమ్మకి, చెల్లెలికి చెప్పాడు. ఇంత త్వరలో సంబంధాలు కుదురుతాయని కలలో కూడ అనుకోని అమ్మకు ఆనందాశ్రువులు రాలాయి. మనసు విరబూచిన మల్లె పందిరిలా అవటంతో రమకు ఆ రాత్రి నిద్రేపట్టలేదు.

ఆ మర్నాడు క్రాంతికుమార్ తన గదిలో కూర్చుని చదువుకుంటున్నాడు. అరుణ వస్తూనే 'రమా!' అని పిల్చింది గట్టిగా. వంటింట్లో పని చేసుకుంటున్న రమ గబగబా వచ్చింది.

'నీ వింత మోసం చేస్తావని నేనెప్పుడూ కూడ అనుకోలేదు' అరుణ అంది సీరియస్‌గా. రమ నిర్విణ్ణురాలైంది. తనమీద వచ్చిన అభియోగం ఏమిటో అర్థం కాలేదు రమకు. తన స్నేహితురాలు అరుణ, తనమీద ఏదో అభాండం వేస్తోందేమి చెప్మా అని ఆశ్చర్యపోయింది.

అరుణ మళ్లీ అంది: 'నీ వింత పని చేస్తావని ముందుగా తెలుస్తే నేనేం చేసేదాన్నో తెలుసా?'

ఇంతలో అమ్మ వచ్చింది: 'ఏమిటి అరుణా, ఏం చేసిందేమిటి రమ' అంటూ.

'ఏం చేసిందేమిటి? నన్ను దొంగంటే'

రమకు రోషం వచ్చింది. 'అరుణా మాటలు తిన్నగా రానీ, నేనేం దొంగతనం చేయలా' అంది.

'చెయ్యలేదూ, మా అన్నయ్య మనసు దొంగిలించలేదూ'

ముగ్గురూ ఒక్కసారిగా నవ్వారు. మబ్బులు విడిచిన చంద్రబింబంలా భాసించింది రమ ముఖం. రమ అంది:

'నీవేం నంగనాచివా, మెత్తగా కన్పిస్తున్నావు గదా అని మా అన్నయ్యను నీ వలలో వేసుకున్నావుగా!' మళ్లీ ముగ్గురూ నోటి నిండుగా నవ్వుకున్నారు. 'బాగుంది ముగ్గురు ముగ్గురే తోడు దొంగలు' అమ్మ వ్యాఖ్యానించింది. ఈ మాట విన్నట్టున్న క్రాంతికుమార్ కూడా ముసి ముసి నవ్వులు నవ్వుకున్నాడు.

మళ్లీ వచ్చే సెలవులకు క్రాంతికుమార్ ఇంటికి వచ్చేసరికి ఒక ఘోరమైన దృశ్యం అతని కంట బడింది. అతని నోట మాట రాలేదు. అచేతనుడై నిల్చుండిపోయాడు. తానిన్నాళ్లుగా ఊహించుకున్న విషయాలు, తలంచిన ప్రయోజనాలు ఒక్కొక్కటిగా కూలిపోతున్నట్టు నిపించింది. 'అమ్మా' అన్నాడు 'అమ్మా ఏమిటమ్మా ఈ ఘోరం'

అమ్మ ఏం జవాబు చెప్తుంది? 'మనల్ని వెంటాడుతున్న దురదృష్టం నాయనా' అంది పైట చెంగుతో కళ్లు వొత్తుకుంటూ.

'నాకు తెలియపర్చ లేదేమమ్మా'

'తెలియజేయవలసిందే బాబూ! కాని, నీకు పరీక్షలు జరుగుతున్నాయి కదా, నీ పరీక్షలకు ఆటంకం మెక్కడ ఏర్పడుతుందో నని, రమే ఒద్దంది. ఎప్పటిలాగా పంపు వద్దనుండి నీళ్ళు పట్టుకొస్తోంది. గడపలో చీర కాలి వ్రేళ్లకు తగిలి పడింది. వెంటనే హాస్పిటలుకు తీసుక వెళ్లి కట్టు కట్టించాను.' అంది అమ్మ. మంచంలో కూర్చుని అర చేతులతో ముఖాన్ని కప్పుకొని ఏడుస్తున్న రమ వద్దకు నడిచాడు క్రాంతికుమార్.

రమ కాలికి ఏర్పడ్డ గాయం మానినా గాయం ఏర్పరచిన గుర్తు మాత్రం అలాగే నిల్చిపోయింది. ఫలితంగా రమ సరిగా నడవలేదు. నడకలో కుంటితనం కొట్టవచ్చినట్టు కన్పడుతుంది.

వేసవి బరువుగా వెళ్లిపోయింది. వేసవి శలవుల్లో ఏ ఒకటి రెండు సార్లో రఘూ, క్రాంతికుమార్ కలుసుకున్నారు. రఘు ముభావంగా ఉండేవాడు. ఇది వరకులాగా మాట్లాడటం లేదు. అందుకు గల కారణాన్ని పూహించలేకపోయాడు క్రాంతికుమార్. అరుణ మాత్రం రమ కోసం వచ్చి పోతూనే ఉంది. రమకు కలిగిన ప్రమాదం అది తన జ్ఞాపకచిహ్నంగా నిలిపి పోయిన అవిటితనం, అరుణకు తీరని ఆఘాతంలా పరిణమించింది. అరుణ తన దుఃఖాన్ని పైకి తెలిపితే రమ మరీ బెంబేలు పడుతుందని, లోలోపలే అణచుకుంటూ రమకు ధైర్య వచనాన్ని చెప్పేది. పైకి వెలిబుచ్చలేక లోపల ఇముడ్చుకోలేక అరుణ పడే బాధని క్రాంతికుమార్ గమనించకపోలేదు.

కాని, ఒక్క విషయాన్ని మాత్రం విస్మరించాడు క్రాంతికుమార్. అమ్మ చెప్పేవరకూ అతనికా సంగతే స్ఫురించలేదు. అమ్మ చెప్పిన తర్వాత ఆ విషయమై ఆలోచించగా ఎందుకో భయం వేసింది. అంతలోనే తనకు తాను ధైర్యం చెప్పుకున్నాడు. 'రఘు అలాంటి వాడు గాదు. రమను వివాహం చేసుకుంటానంటూ తానుగా ముందుకు వచ్చిన వ్యక్తి ఇప్పుడు రమ దురదృష్టవశాత్తు ప్రమాదానికి లోనయినంత మాత్రం చేత ఆమెను వివాహమాడటానికి విముఖుడౌతాడా? రమకు ఏం లోటు? అని. నడకలో కొంచెం అవుడు.' 'అదైనా శ్రద్ధగా గమనిస్తే గాని కనుపించదు.'అని. ఏమైనా రఘుతో ఒకసారి మాట్లాడాలనుకున్నాడు.

ఆ సాయంత్రం అనుకోకుండా పార్కులో కలిసాడు రఘు. ఆ మాటా ఈ మాటా మాట్లాడిన తర్వాత 'రఘూ! మనిద్దరికి స్టడీస్ అయిపోయాయి. ముహూర్తాలు పెట్టించమంటోంది మా అమ్మ' అన్నాడు నవ్వుతూ.

'మనిద్దరికీనా' అన్నాడు రఘు, నవ్వును తెచ్చిపెట్టుకుంటూ.

క్రాంతికుమార్‌కు గూడా నవ్వు వచ్చింది తన సంభాషణ ధోరణికి.

'అది కాదోయ్. అమ్మ రెండు పెళ్లిళ్లూ ఒకేసారి జరగాలంటుంది. కాని నాకేమో లోగడ నీతో చెప్పినట్టు ముందు మీ వివాహం అయిన తర్వాత....

**'లోగడ జరిగిన విషయాలు మర్చిపోవటం మంచిదేమో కుమార్!' అన్నాడు రఘు ఎటో** చూస్తూ.

రాకూడదు, రాదు అనుకున్నమాట రఘు నోటంట రానే వచ్చింది. క్రాంతికుమార్ గుండెల్లో రాయి పడింది. కొంతసేపటివరకు తేరుకోలేక పోయాడు. చివరికెలాగైతేనేం 'అదేమిట రఘూ' అనగల్గాడు.

రఘు అదోలా నవ్వాడు. 'కుమార్! లోగడ రమను వివాహంచేసుకుంటానని నేనన్న మాట నిజమే. కాని అప్పటి పరిస్థితులు వేరు. ఇప్పటి పరిస్థితులు వేరు. ఎంతైనా మనం మానవ మాత్రులం. చూస్తూ, చూస్తూ జీవితంన్ని దుఃఖభాజనం చేసుకోగలమా? రమను చూస్తుంటే నాకూ జాలి కలుగుతుంది. కాని ఇది ఒక జీవిత సమస్య. మంచి చెడ్డలన్నీ చూచుకుని మరీ ముందుకు వేయవలసిన ఘట్టం. దయ, జాలి, స్నేహము మొదలైన భావాలకు తావు లేదు. ఎవరి సంగతులెలావున్నా నేను రమను చేసుకోలేను. మీ అందరికీ కష్టం కలిగిస్తే క్షంతవ్యుణ్ని' అన్నాడు. **క్రాంతికుమార్ ఇక అక్కడ ఉండలేకపోయాడు.**

**అంతే. మళ్లీ రఘును చూడటం తటస్థించ** లేదు. కొద్ది రోజులలో రిజల్ట్సు వచ్చాయి. క్రాంతి యూనివర్శిటీకంతకూ ఫస్టున వచ్చాడు. కాని అతనికి కలుగవలసిన ఉత్సాహం కలుగలేదు. రమ వివాహం విషయం ఒక సమస్యగా తయారై తన కళ్ళముందు మాట మాటికీ ప్రత్యక్షమౌతుంది. రఘు అన్న మాటల్లో నిజం లేకపోలేదు. చూస్తూ చూస్తూ కుంటి దాన్ని ఎవరు చేసుకుంటారు.? మరి రమకు పెళ్ళెలా అవుతుంది. ? అనిపించేది. నిలువునా నీరు కారిపోయేవాడు. **ఆ ఆలోచనలు అతనిని కొన్నాళ్లపాటు ఎటువా పారిపోదామన్నంతగా బాధించాయి.**

విశాఖపట్నం వెళ్లి ప్రొఫెసర్లకు ఓ మారు కన్పించి వస్తానంటూ బయలుదేరిన క్రాంతికుమార్ అప్పుడే పోస్టుమాన్ ఇచ్చి వెళ్లిన కవర్లు రెంటిని అందించింది రమ. ఆత్రుతగా ఒక కవరు చింపాడు క్రాంతికుమార్. అందులోని **ఉత్తరాన్ని** గబగబా చదివి 'రమా'!' అంటూ చెల్లెల్ని కౌగలించుకుని **ఆమె తలను ఆప్యాయంగా ముద్దుపెట్టుకున్నాడు. విషయమేమిటో అర్థం కాని రమ, ఉక్కిరిబిక్కిరి అయిపోయింది. 'ఏమిట్రా క్రాంతి?' అని అడిగింది అమ్మ మెరిసే కళ్లతో.**

'పై చదువులకు **ఫారిన్ పంపటానికి యూని వర్శిటీ వాళ్లు నన్ను రికమెండు చేశారుటమ్మా.** ప్రొఫెసర్ వ్రాశారు.' అన్నాడు క్రాంతికుమార్. రెండవ కవర్ని చింపుతూ. అది యూనివర్శిటీలో ఒక రీడరు వ్రాసింది. ఫస్టైనందుకు, ఫారిన్ వెళ్ల బోతున్నందుకుతన అభినందనల్ని తెల్పుతూ వ్రాశాడు.

కాని క్రాంతికుమార్‌కు ఉన్నట్టుండి ఒకటే దిగులు పట్టుకుంది. ఫారిన్ వెళ్లటానికి ఎలా లేదన్నా పదువేల రూపాయలు కావాలి. తను ఎక్కడ నుండి తేగలడు? ఉన్న ఎకరం పొలాన్ని అమ్మితే రమ వివాహం ఎలా జరుగుతుంది? రమకు నడకలో అవిటితనం పోనంత కాలం తనకు మనశ్శాంతి లేదు. తన వైద్య విజ్ఞానాన్నంతా ఉపయోగించి ఆమె నడకలోని లోపాన్ని తొలగించలేడా?. ఆమె భావి జీవితానికి ప్రతిబంధకంగా కనిపించే ఆ లోపాన్ని ఏ విధంగానైనా పోగొట్టాలి అనుకున్నాడు.

**రమ అంది. 'అన్నయ్యా, నా కాలికి, నా వివాహా** నికి నీ చదువుకు ముడిపెట్టకు. పొలం అమ్మి నీ చదువును పూర్తిచేసుకుని రా. అప్పుడు నా కాలును బాగుచేయటానికి అవకాశం ఉంటుంది. నా వివాహం కూడా అప్పుడే.

రమ చెప్పిందాంట్లో ఎంతో నిజం ఉందనిపించింది. ఆ ప్రకారం చేయటానికే నిశ్చయించుకున్నాడు.

ఉన్నట్టుండి సీతాపతిగారు వచ్చారు క్రాంతి కుమార్ వద్దకు. 'ఏమోయ్! ఫారిన్ వెళ్తున్నావటగా చాలా సంతోషం. ఫారిన్ వెళ్లే అవకాశం దొరకటమే చాలా కష్టం. అలాంటిది యూనివర్శిటీ వారే నిన్ను కావాలని పంపుతున్నారంటే అంతకంటే కావలసి దేముంటుంది?' అన్నారు.

'మా బోటివారికి అవకాశాలుండి మాత్రం ఏం ప్రయోజనం లెండి. అన్నింటికంటే ముఖ్యం ఆర్థిక స్తోమత వుండాలిగా' అన్నాడు క్రాంతికుమార్.

సీతాపతిగారు వింతగా చూసి అన్నారు: 'అంటే? కొంపదీసి వచ్చిన అవకాశాన్ని వదులుకోటం లేదుగదా!

'అదనే చేద్దామనుకుంటున్నాను.......'

'కుమార్! నీకు చెప్పగలినంతటి వాణ్ని కాదు గాని ఒక్క మాట. ఇప్పుడు డబ్బులేదని నీవు ఫారిన్ వెళ్ళటం మానేస్తానంటున్నావు అవునా? కాని ఈ అవకాశం నీవు ప్రక్కనపెట్టి డబ్బు గడించిన తర్వాత కావాలంటే వస్తుందా? నీ నిలాంటి దేదో తలపెట్టావనే అనుమానంతో నేనిటు వచ్చాను.'

**సీతాపతిగారు రావటంతో ఏదో అంతర్య మింకేదీ ఉంటుందనివూహించిన క్రాంతికుమార్ అనుమానం నిజమే అయింది. ఆశ్చర్యంగా ప్రశ్నార్థకంగా** సీతాపతిగారి వైపు చూశాడు.

**'నీ కభ్యంతరం లేకపోతే నీకు కావలసిన డబ్బు** నేను అడ్వాన్సు చేస్తాను.'

సీతాపతిగారి మనసులోని ఆలోచన ఇదన్న మాట: ఈ ఆలోచనకు మూలం అరుణ వివాహమూ? నా అల్లుడు ఫారిన్ రిటర్న్డు డాక్టరు అని సగర్వంగా చెప్పుకోవాలని గాబోలు: క్రాంతికుమార్‌కు అహం అడ్డు వచ్చింది.

**'క్షమించండి సీతాపతిగారూ! నేనింతవరకూ ఒకరి సహాయాన్ని అర్థించలేదు. ఇప్పుడు అర్థించ** చటం లేదు. అయాచితంగానే సహాయం చేస్తామంటున్న మీ ఉదారబుద్ధికి కృతజ్ఞుణ్ని. కాని మీ సహాయాన్ని కాదంటున్నందుకు మన్నించండి' అన్నాడు.

**సీతాపతిగారు కొన్ని క్షణాలు మౌనంగా వుండి 'దాందేముందిలే కుమార్, కాని కష్టాల్లో కూడ ధిగజారని నీ మనస్తత్వానికి నీ ఉన్నత భావాలకు నా అభినందనలు' అన్నారు.**

**'మీరు మరో విధంగా భావించకండి'**

**'నేనలాంటి వాణ్ని కాదు కుమార్! పోనీ ఒక**

**38 వ పేజీ చూడండి**




"ఆఫీసులో సగంపని కళ్లుమూసుకొని చేస్తున్నాట్ట! అందుకని ఈ నెల సగం జీతమే ఇచ్చారు!"

|  |  |  |  |
|---|---|---|---|
| ర కు | బు గు | శు | రా |
| చం శ | వారఫలం |  |  |
|  |  |  |  |
| కే |  |  |  |

## మ హే ష్

**ఈ వారము ధరలు**

ధాన్యం ధర కొంచెం పెరుగుతుంది. కందులు, పెసలు మొదలైన అపరాల ధరలు తగ్గే సూచనలున్నాయి. నూనె, నువ్వుల ధరలు పెరుగుతాయి. బెల్లం ధర కూడా పెరగ వచ్చును. వస్త్రాల ధరలు తగ్గుతాయి.

**10-4-1964 శుక్రవారము మొదలు 16-4-1964 గురువారము వరకు**

### మేషం :

(అశ్వని, భరణి, కృత్తిక 1 పా.)

ఈ వారం మొత్తం మీద గ్రహబలం అనుకూలంగా ఉంది. ప్రయత్నించిన పనులన్నీ నెరవేరుతాయి. ఎంత తప్పించుకొందామని ప్రయత్నం చేసినా బంధువుల కార్యాల్లో జోక్యం కలుగజేసుకోవలసి వస్తుంది. దాని వల్ల వ్యయం జరిగినా కార్యసాధనలవల్ల తృప్తి లభిస్తుంది. వృత్తి వ్యాపారాల్లో అనుకూలతా, ఆదాయమూ పెరుగుతాయి. ఇబ్బంది లేకుండా యేదో ఒక డబ్బు చేతికి వస్తూ ఉంటుంది. తక్కువ స్థాయి వారివల్ల లాభము పొందగల సూచనలు ఉన్నాయి. స్థిరాస్థి వ్యవహారాల్లో అనుకూలత లభించడానికి ఇంకా కొంత కాలం పడుతుంది. విద్యా, వైజ్ఞానిక రంగాల్లో మీ ప్రజ్ఞ రాణిస్తుంది. అలంకార వస్తువులు కొంటారు. సంతానానికి కించిదనారోగ్యం చేయవచ్చును. ముఖ్యమైన ప్రయాణాలు చేస్తారు. 11, 12 తేదీల్లో అనారోగ్య సూచనలు.

* * *

### వృషభం :

(కృత్తిక 2, 3, 4 పా, రోహిణి, మృగశిర 1, 2 పా.)

వ్యవహారాలన్నీ గత వారం వలెనే ఉంటాయి. భాగస్థులతో చేరి చేసే వ్యాపారాల్లో లాభం వస్తుంది. వృత్తి వ్యాపారాల్లో క్రమంగా అభివృద్ధిని సాధిస్తారు. ఉద్యోగంలో మార్పులకోసం ప్రయత్నం చేయడానికి ఇది అనుకూలమైన కాలం. రకరకాలుగా ఆదాయం పెరగడానికి అవకాశాలు ఉన్నాయి. మొత్తం మీద పరిస్థితి సంతృప్తి కరంగా ఉన్నా కుటుంబ విషయాలు అప్పుడప్పుడు అశాంతిని కలిగించ వచ్చును. వృత్తివ్యాపారాల్లో ఇది వరకు పోటీగా ఉన్న వారు కూడా అనుకూలంగా మారతారు. ఆరోగ్యం ఇదివరకటంటే బాగా ఉంటుంది. విద్యారంగంలో మీ ప్రయత్నాలకు ఆటంకాలు వస్తాయి. సాంఘిక కార్యక్రమాల్లో మీ అభిప్రాయాలు అమలు జరపడానికి అవకాశం వస్తుంది. బంధువులకు సంబంధించిన పనులు ఇంకా పూర్తి కావు. ప్రేమ వ్యవహారాల్లో అభివృద్ధి ఉంటుంది.

* * *

### మిధునం :

(మృగశిర 3, 4 పా, ఆరుద్ర, పునర్వసు 1, 2, 3 పా.)

ప్రయత్నించిన ప్రతి పనీ నెరవేరుతున్నట్లే కన్పిస్తుంది. కాని, వారాంతానికి మీరు సాధించేది చాలా తక్కువ. మీ సహాయం ద్వారా తమ పనులు సాధించుకొంటూ, మీ అవసరానికి తటస్థంగా ఉండిపోయే వ్యక్తులతో వ్యవహరించవలసి వస్తుంది. వృత్తి వ్యాపారాల్లో పెద్ద మార్పులేమీ రావు. ఉన్నత వర్గాలతో పరిచయం, తద్వారా లాభం కలుగుతాయి. ఇది వరకు మీరు చేసిన వాగ్దానాలు ఇప్పుడు పూర్తి చేయవలసి రావడం వలన తాత్కాలికంగా కొంత ఇబ్బంది పడతారు. విలువైన వస్తువులు కోల్పోయే ప్రమాద ముంది. కుటుంబ వ్యవహారాలు సులభంగా నెరవేరుతాయి. శుభ కార్యాల విషయంలో అభివృద్ధి ఉంటుంది. వారం ఆఖరున ఆందోళన కలిగించే వార్తలు రావచ్చును. పుణ్య కార్యాలు జయప్రదంగా నెరవేరుతాయి. 13, 14 తేదీలలో అధికాదాయం.

* * *

### కర్కాటకం :

(పునర్వసు 4 పా, పుష్యమి, ఆశ్లేష.)

మీ పరిస్థితి ఇది వరకటి కంటే అన్ని విధాలా అనుకూలంగా ఉంటుంది. ఇదివరకు మీరు ప్రయత్నం చేసిన పనులు ఈ వారంలో వాటంతట అవే నెరవేరుతాయి. ఆదాయం బాగా ఉన్నా అవసరానికి డబ్బు సర్దుబాటు కాక కొంత ఇబ్బంది పడవలసి వస్తుంది. డబ్బుకు సంబంధించిన వాగ్దానాలు చేయడం మంచిది కాదు. కోర్టు వ్యవహారాల్లో ఉన్న వ్యతిరేకత తొలగిపోతుంది. సాంఘిక వ్యవహారాల్లో మీ ప్రజ్ఞ ప్రాభవాలు రాణిస్తాయి. భిన్నాభిప్రాయాలు కలవారిని కూడా ఒక త్రాటి మీద నడిపిస్తారు. అలంకార వస్తువులను కొంటారు. ప్రయాణం ద్వారా కార్యసాధన జరుగుతుంది. కుటుంబంలో పెద్దలకు అనారోగ్యం చేయవచ్చును. ఇప్పుడు నిర్లక్ష్యంచేసినా వ్యవహారాలను గూర్చి ముమ్ముందు పశ్చాత్తాప పడవలసి వస్తుంది. 11, 12 తేదీలలో సంతోషం, మిత్రసమాగమం.

* * *

### సింహం :

(మఖ, పుబ్బ, ఉత్తర 1 పా.)

ఈ వారం బాగానే ఉంటుంది. ప్రయత్నం చేసిన పనులు కొంచెం ఆలస్యంగా నెరవేరుతాయి. ఉద్యోగస్థులకు అధికారుల ఆదరణా ప్రోత్సాహం లభిస్తాయి. వ్యాపారస్థులు కొత్త వ్యవహారాల్లో ప్రవేశిస్తారు. భాగస్థులతో చేసే వ్యాపారాల్లో ప్రోత్సాహం కన్పించదు, ఇది వరలో నిరాశ చెందిన డబ్బు చేతికి వస్తుంది. కొంత శ్రమా వ్యయం కలిగినా వారాంతానికి పరిస్థితి సంతృప్తికరంగా ఉంటుంది. విద్యారంగంలోను కళల్లోను మీ బుద్ధి చురుకుగా పని చేస్తుంది. కుటుంబంలో అభిప్రాయ భేదాలు రావచ్చును కాని వాటివల్ల యే కార్యక్రమమూ ఆగిపోదు. సాంఘికంగా గౌరవం యేర్పడుతుంది. ఆరోగ్య విషయంలో ఇది వరకటి కంటే జాగ్రత్త అవసరం. దూరపు బంధువులకు గాని, స్నేహితులకు గాని సహాయం చేస్తారు. 11, 12 తేదీల్లో అనారోగ్య సూచనలు 15, 16 తేదీల్లో ధనలాభం.

* * *

### కన్య :

(ఉత్తర 2, 3, 4 పా, హస్త, చిత్త 1, 2 పా.)

వృత్తి వ్యాపారాల్లో వూహించని చిక్కులు రావడం వలన ఆందోళన కలుగుతుంది. ఏమాత్రం అశ్రద్ధగా ఉన్నా ఆర్థికంగా నష్టం వస్తుంది. ప్రతి వ్యవహారంలోను చాలా జాగ్రత్తగా వ్యవహరించడం అవసరం. మీకు సహాయం చేద్దామని అనుకొన్న వారు కూడా మీకు సహాయం చేయలేని స్థితిలో ఉండిపోతారు. అందుచే మీ స్వయం శక్తి చేతనే ఈ చిక్కులను అధిగమించ వలసి ఉంటుంది. వ్యవహారాల్లో మీరు యేదో ఒక విధంగా సర్దుకు పోవడమే ఉత్తమంగాని ప్రజ్ఞలకు పట్టుదలలకు సమయంకాదు. ఎంత ఇబ్బంది వచ్చినా మీ మానసిక బలం చెక్కు చెదరకుండా ఉంటుంది. వారం మధ్యలో అనారోగ్యం చేయవచ్చును. కుటుంబ వ్యవహారాలు సంతృప్తికరంగా ఉంటాయి. వారం మధ్య భాగంలో కంటే చివరను కొంచెం బాగుంటుంది.

* * *

### తుల :

(చిత్త 3, 4 పాదాలు, స్వాతి, విశాఖ, 1, 2, 3 పాదాలు)

మీ స్వంత పనులను గురించి శ్రమపడవలసిన అవసరం ఉండదు. కాని ఇతరుల పనిమీద కొంత శ్రమా, త్రిప్పటా కలుగుతాయి. అనేక విషయాలు ఆలోచిస్తూ ఉండడం వలన వృత్తి రీత్యా కొత్తవారిని కలుసుకో వలసి వస్తుంది. ఆ పరిచయం ముమ్ముందు పరస్పర ప్రయోజనకారి అవుతుంది. ఆదాయం పెరగదు కాని డబ్బుకు ఇబ్బంది లేకుండా కాలం గడచిపోతుంది. విద్యా వివాదాల్లో జయం లభిస్తుంది. నూతన విషయాలను తెల్సుకొంటారు. సంఘంలో మీ ప్రజ్ఞ గుర్తింప బడుతుంది, మీ ప్రవర్తన పది

మంచిని ఆశిస్తుంది. ఇంతవరకూ మీరు తల చిస్తున్న శుభ కార్యాల విషయంలో ఒక నిర్ణయానికి వస్తారు. ప్రేమ వ్యవహారాల్లో స్వల్ప ప్రోత్సాహం లభిస్తుంది. వారాంతంలో అనవసర ఆందోళన.

* * *

## వృశ్చికం :

**(విశాఖ 4-వ పాదం, అనూరాధ, జ్యేష్ఠ)**

బహిరంగంగా మిమ్మల్ని యెదిరించే వారు ఉండక పోవచ్చును కాని లోలోపల అపకారం చేయ దలచిన వారితో మీరు వ్యవహరించ వలసి ఉంటుంది. ఎంతో శ్రమా ఆందోళనా పొందిన తర్వాత గాని యే పనీ సాధించలేరు. అధికారులతో అభిప్రాయ భేదాలు రాగల సూచనలున్నాయి. గాని ఇరు పక్షాల మంచితనం వల్ల నష్టమేమీ జరుగదు. దీర్ఘ కాలానికి ఫలితాన్ని ఇచ్చే భారీ వ్యవహారాలు, భాగస్థులతో చేరి చేయవలసిన వ్యవహారాలు ప్రారంభించడానికి ఇది సమయం కాదు. వృత్తి వ్యాపారాల్లో మార్పులుండవు. మీరు ఇదివరకు చేసిన వాగ్దానాలు ఇప్పుడు నెరవేర్చవలసి రావడం వలన ఆర్థికంగా కొంత ఇబ్బంది రావచ్చును. ప్రయాణాలోచనలు వాయిదా పడతాయి. పుణ్య కార్యాలు నెరవేరుతాయి. 11, 12 తేదీలలో సంతోషం, మిత్ర సమాగమం.

* * *

## ధనుస్సు :

**(మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1 పా.)**

ఇతరుల సహాయాన్ని ఆశించి యే పనీ ప్రారంభించడానికి సమయంకాదు. మీ స్వయం శక్తి మీదనే ఆధారపడి వ్యవహరించ వలసిన సమయం. ఉన్న దానితో తృప్తి పడడం మంచిది. ఏ పని చేయాలని ప్రయత్నం చేసినా ఆటంకాలు వస్తుంటాయి. వృత్తి వ్యాపారాల్లో శ్రమకు తగిన ప్రతిఫలం ఉండదు. ఇతరుల మొగమాటానికి లోబడి మీకు ప్రయోజనం లేనిపని చేయవలసి వస్తుంది. ప్రతి వ్యవహారంలోనూ అనవసరంగా ఆందోళన పడతారు గాని మీకు వ్యతిరేకంగా యేదీ జరుగదు. శుభకార్యాల విషయంలో మీరు సాధించిన అభివృద్ధిని కోల్పోయే ప్రమాదము ఉంది. తొందరపడి యేనిర్ణయానికీ రావడం మంచిది కాదు. దగ్గర బంధువులతోనైనా బాగా ఆలోచించి మాట్లాడడం మంచిది. గత వారంలో కంటే ఆరోగ్యం బాగా ఉంటుంది. సంతానానికి సౌఖ్యం ఉంటుంది.

## మకరం : —

**(ఉత్తరాషాఢ 2, 3, 4 పా, శ్రవణం, ధనిష్ఠ 1,2 పాదాలు.)**

ఇంతవరకూ వృత్తి వ్యాపారాల్లో ఉన్న ఒడిదుడుకులు క్రమంగా తగ్గుతాయి. మీ ప్రయత్నమేమీ లేకుండా వృత్తిలో కొన్ని మంచి మార్పులు జరుగుతాయి. వాటి ఫలితాన్ని మీరు రాబోయే కొద్ది వారాల్లోను పొందుతారు. భాగస్థులతో కలిసి చేసే వ్యాపారాలు లాభిస్తాయి. కోర్టు వ్యవహారాలు ఇదివరకటి కంటే అనుకూలంగా ఉంటాయి. స్త్రీ మూలంగా కలహ ప్రసంగం రావచ్చును. సాంఘిక కార్యక్రమాల్లో [illegible] యేర్పడుతుంది. ఉద్యోగస్థులు ఉన్నత స్థానం కోసం ప్రయత్నించ వచ్చును. బంధువుల్లో ఉన్న అభిప్రాయభేదాలు తొలగిపోయి అందరూ మీ మాట ప్రకారం నడుస్తారు. ఆకస్మికంగా డబ్బు చేతికి వస్తుంది. వినోద కార్యక్రమాల్లో మిత్రుల సమావేశాల్లో పాల్గొంటారు. చిన్నచిన్న ప్రయాణాలు చేస్తారు. ప్రేమ వ్యవహారాల్లో అభివృద్ధి ఉండదు.

* * *

## కుంభం :

(ధనిష్ఠ 3, 4 పా, శతభిషం, పూ. భాద్ర 1, 2, 3 పా.)

ఈ వారం సామాన్యంగా ఉంటుంది. వృత్తి వ్యాపారాల్లో మార్పులు ఉండవు. అన్ని వ్యవహారాలూ సాఫీగా జరుగుతాయి. ప్రయత్నం చేసిన పనులన్నీ నెరవేరుతాయి గాని ఫలితం చేతికి రావడానికి ఇంకా కొంతకాలం పడుతుంది. మీ ప్రజ్ఞ వల్ల, ఇతరుల సహాయంతో వ్యాపారంలో స్వల్ప లాభాన్ని వారాంతానికి సాధిస్తారు. సాహసముతో కూడిన వ్యాపారాలు చేయడానికి ఇది సమయం కాదు. ఉద్యోగస్థులు అనుకూలమైన స్థానమునకు మార్పబడే సూచనలున్నాయి. శరీరారోగ్యం బాగా ఉంటుంది. కుటుంబ వ్యవహారాల్లో అభివృద్ధి కన్పించదు. మీకు తోచినట్లు వ్యవహరిం[illegible] బంధువుల సహాయం కూడా [illegible]చడం మంచిది. సాంఘిక కార్యక్రమాల్లో వ్యయమూ, ప్రయాసా తప్ప ప్రయోజనము ఉండదు. 15, 16 తేదీలలో సంతోషం, పుణ్య కార్యాచరణ.

* * *

## మీనం :

**(పూ. భాద్ర 4 పా, ఉ. భాద్ర, రేవతి.)**

ఆర్థిక వ్యవహారాల కంటే ఆరోగ్య విషయంలో శ్రద్ధ చాలా అవసరం. వృత్తి వ్యాపారాల్లో స్వల్ప అభివృద్ధి కన్పిస్తుంది. ఆదాయం పెరగదు గాని డబ్బుకు ఇబ్బంది ఉండదు. స్థిరాస్తి వ్యవహారాలు, గృహనిర్మాణ కార్యక్రమాలు కొంత కాలం పాటు వాయిదా వేయడం మంచిది. ఇది వరకు మీరు జరిపిన డబ్బు సంబంధమైన లావా దేవీల్లో కొన్ని చిక్కులు రావచ్చును. అధికారుల వలన జరుగవలసిన పనులు నెరవేరతాయి. రాజకీయాల్లో కొంత ప్రతిఘటన తర్వాత అనుకూలత వస్తుంది. బంధువుల్లో ఒకరికి అనారోగ్యం చేస్తుంది. విద్యారంగంలో మీ బుద్ధి చురుకుగా పని చేస్తుంది. ఇష్టంలేక పోయినా ఆడంబరం కోసం వ్యయం చేయవలసి వస్తుంది. అలంకార వస్తువులను కొంటారు. కుటుంబ పరిస్థితి సంతృప్తికరంగా ఉంటుంది. 13, 14 తేదీల్లో సంతోష వార్తా శ్రవణం గౌరవం.

# జన్మదినఫలం

## ఏప్రిల్ 10

ఈ సంవత్సరం మొత్తం మీద బాగానే ఉంటుంది. గత సంవత్సరంలో ప్రయత్నం చేసిన పనులన్నీ ఈ సంవత్సరం నెరవేరుతాయి. వృత్తి ఉద్యోగాల్లో అనుకూలమైన మార్పులు వస్తాయి. ఆదాయం కూడా స్వల్పంగా అభివృద్ధి కాగల సూచనలు ఉన్నాయి. సంవత్సరం మధ్యలో స్థిరాస్తికి సంబంధించిన వివాదాలు రావచ్చును. నూతన వ్యాపారాలను ప్రారంభించడానికి మంచి సమయం. కుటుంబ పరిస్థితులు మాత్రం కొంచెం చికాకు కల్గిస్తూ ఉంటాయి. ప్రతి విషయంలోను అభిప్రాయభేదాలు రావడం వలన యే పనీ పూర్తిగా నెరవేరదు. పిల్లలకు అప్పుడప్పుడు అనారోగ్యం చేస్తుంది. తీర్థయాత్రలు చేయగల సూచనలు ఉన్నాయి. విద్యార్థులు సాధారణంగా కృతార్థులవుతారు. వైద్యులుకు, పారిశ్రామికవేత్తలకు యోగవంతమైన కాలం.

## ఏప్రిల్ 11

గత కొద్ది సంవత్సరాలకంటే ఈ సంవత్సరం చాలా బాగుంటుంది. ఉద్యోగస్థులకు ఉన్నత స్థానములు లభించడానికి మంచి అవకాశాలు న్నాయి. వ్యాపారస్తులు ఇదివరకు కొంత కృషి చేసిన వ్యాపారాలు లాభిస్తాయి. భాగస్తులతో చేసే వ్యాపారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. అన్ని వ్యవహారాలలోను మిత్రుల అండదండలు లభిస్తాయి. కోర్టు వ్యవహారాలు అనుకూలంగా పరిష్కార మవుతాయి. సాహసముతో కూడిన వ్యవహారాలు కూడా ఫలించగల సూచనలు ఉన్నాయి. కుటుంబ పరిస్థితి సంతృప్తికరంగా ఉంటుంది. విలువైన అలంకార వస్తువులు కొంటారు. ప్రేమ వ్యవహారాల్లో ప్రోత్సాహం లభిస్తుంది. విద్యార్థులు మంచి మార్కులతో కృతార్థులవుతారు. ఆగష్టు, సెప్టెంబరు నెలల్లో ధన లాభం నవంబరు నెలలో శుభ వార్త.

## ఏప్రిల్ 12

ప్రయత్నించిన పనులన్నీ నెరవేరతాయి గాని వాటి నిమిత్తం చాలా వ్యయ ప్రయాసలు పొందవలసి వస్తుంది. వృత్తి వ్యాపారాల్లో మొదట అంత ప్రోత్సాహకరంగా ఉండదు. కాని, రాను రాను అనుకూలంగా మారుతుంది. సమయానికి డబ్బు చేతికి రాక తొట్రుపాటు పడతారు. యెక్కువ ధన వ్యయముతో కూడిన ప్రయత్నాలు చేయడానికి ఇది సమయం కాదు. ఉద్యోగస్థులకు స్థాన చలనము కలుగుతుంది. సంఘంలో రాణించడానికి తగిన అవకాశాలు లభిస్తాయి. రాజకీయాల్లో కొంత ప్రతిఘటన తర్వాత విజయం లభిస్తుంది. కుటుంబంలో పెద్ద వారికి అనారోగ్యం చేస్తుంది. విద్యార్థులకు బుద్ధి చురుకుగా పనిచేస్తుంది. కృతార్థులుకాగల సూచనలు ఉన్నాయి. యోగవంతమైన కాలానికి ఇది ప్రారంభం.

## ఏప్రిల్ 13

మొదట్లో కొన్ని ఒడుదుడుకులను యెదుర్కోవలసి వచ్చినా సంవత్సరాంతానికి పర్వాలేదనిపిస్తుంది.

43వ పేజీ చూడండి

# గోప్పతీర్థం రామేశ్వరం

ఫొటోలు వ్యాసం :
ఎన్. రామకృష్ణ.



ప్రఖ్యాతిగాంచిన రామేశ్వరం 'వసారా'లు



నందీశ్వరుడు

ఇంచుమించు పాంబన్ ద్వీపం మీదనే ఉన్న చిన్నపట్నం రామేశ్వరం. ఈ పాంబన్ ద్వీపం మద్రాసు రాష్ట్రంలోని రామనాథపురం జిల్లాకు చెందిన ప్రదేశం. ద్వీపంనుంచి చూస్తే సముద్ర భాగం పాములాగ మెలికలు తిరిగినట్లు కనిపిస్తుంది కాబట్టి, దీనికి పాంబన్ అని పేరు వచ్చిందంటారు.

**భారత దేశంలో రామేశ్వరం పేరు వినని భక్తులుండరు. తీర్థ ప్రదేశాన్ని జీవితంలో ఒక సారయినా సందర్శించాలని నమ్ముతారు. కాశీకి వెళ్లినవారు, గంగాజలం ఇక్కడికి తీసుకు పోయి రామేశ్వరంలో రామనాథస్వామికి అభిషేకం చెయ్యాలిట.**

ఇక్కడికి వచ్చే యాత్రికులలో దక్షిణ భారతీయులకన్నా ఉత్తర ప్రాంతాల వారే ఎక్కువ మంది ఉంటారని ప్రతీతి. అందుకనే దేవుడికి ప్రతిదినం గంగాస్నానం జరుగుతుందని చెప్తారు.

రామేశ్వరంలో దేవాలయం చాలా పెద్దది. ద్వీపానికి ఈశాన్యంలో ఉన్న దాని పరిమాణాలు : సుమారు వెయ్యి అడుగుల పొడుగు, ఏడువందల అడుగుల వెడల్పు, గోపురం ఎత్తు నూరు అడుగులు. లోపల వసారాలో మధుర నేలిన నాయక రాజులు, పై మంటపాలు రామనాథపురం పరిపాలించిన సేతుపతులు కట్టించారని చెప్పుకుం



ఇదే గందమానపర్వతం ఈ శిఖరం మీదనుంచే హనుమంతుడు లంకకు ఎగిరిపోయాడని ప్రతీతి.

టారు. [illegible] అనే సంప్రదాయం ఉంది— [illegible] తర్వాత జరిగిన పని ఇది.

అయితే, ఈ గుడికి తగిన వైభవం చేకూర్చేవి పైన చెప్పిన వసారాలే. వీటి మొత్తం చుట్టుకొలత నాలుగు వేల అడుగులు! వెడల్పు 20—30 అడుగుల మధ్య ఉంటుంది, ఎత్తు 50 అడుగులు వసారాకి అనుకుని ఉన్న ప్రతి స్తంభం చక్కటి చెక్కడాలు కలిగి ఉంటుంది. దేవాలయం ఎంత పాతది? అని అడిగితే చెప్పటం కష్టం. కాని, మొత్తం మీద నిర్మాణం 17వ శతాబ్దంలో— రామనాథపురం రాజులు పరిపాలన అమోఘంగా జరుగుతూ ఉన్నప్పుడు, వారి మిత్ర రాజా శ్రీ తిరుమల నాయకుడు మధురలో రాజ్యం చేస్తున్నప్పుడు— జరిగి ఉండాలి.

రామేశ్వరం దేవాలయానికి కొన్ని మైళ్ళ దూరంలో 'గంధమాదన పర్వతం' ఉంది. హనుమంతుడు లంకమీదకి ఇక్కడ నుంచే దూకాడని చెప్తారు.

స్నానాలు చేసే తీర్థ ప్రదేశాలకి కొదువలేదు.. పిల్లలు లేనివారు నాగప్రతిష్ఠ చేస్తారు. . . .

రామనాథపురానికి 7 మైళ్ళ దూరంలో రాముడు లంకకి వంతెన కట్టిన చోటని చెప్పుకునేది ఉంది. దాని పేరు 'దర్భశయనం'. (అరవంలో 'తిరుపుల్లానై' అని కూడా అంటారు.) ఇక్కడికి రామేశ్వరానికి వెళ్ళిన తర్వాత రావాలి. ఇక్కడి దేవుడి పేరు జగన్నాథుడు.

రామేశ్వరం గుడిలోని 2 లింగాల పేర్లు— రామనాథుడు, విశ్వనాథుడు. కాశీ నుంచి ఒక లింగం తెమ్మని ఆంజనేయుడిని పంపితే, అతను త్వరగా తిరిగి రాలేదని సీత ఇసుకతో చేసిన లింగాన్ని ప్రతిష్ఠింపజేశాడుట రాముడు. తిరిగి వచ్చిన హనుమంతుడు దాన్ని పెకలించబోయి, విఫలుడై కాశీ నుంచి తెచ్చిన లింగాన్ని రాముడి చేత ప్రతిష్ఠింపచేయించాడుట. ఈ రెండవ లింగం పేరే విశ్వనాథ లింగం.

**ఆదిశంకరునికి స్మారకచిహ్న నిర్మాణం**

హైందవుల మొదటి జగద్గురువుగా ప్రసిద్ధి పొందిన శ్రీ ఆదిశంకరాచార్యుని స్మృతి గౌరవార్థం రామేశ్వరంలో, స్నాన ఘట్టాల ఇసుకలమీద, ఒక నిర్మాణం జరిగింది. విమానం కూడా కల ఒక గుడి ఆకారంలో ఉన్న ఈ కట్టడం లోపల కూర్చునట్లున్న ఆదిశంకరుని పెద్ద మూర్తి చూడవచ్చు. ఈ పాలరాతి ప్రతిమ ఎత్తు ఎనిమిదిన్నర అడుగులు, ఇరువైపుల ఆయన శిష్యులు నలుగురి ప్రతిమలు కన్పిస్తాయి; పద్మపాద, సురేశ్వర, హస్తామలక, తోటకులు. విమానం మీదనూ ఎందరో పురాణ పురుషుల, ఋషుల, ప్రతిమలు ఏర్పరచారు.

**రామేశ్వరం పుణ్యక్షేత్ర గోపురాలు**



**[illegible] స్నానఘట్టాలలో ఇదీ ఒకటి రామేశ్వరం**



శంకర మంటపం ఎదురుగా, ప్రాకార ద్వారం దగ్గర హనుమంతుడి గుడి, దానికి ఉత్తర దిశలో పన్నెండు జ్యోతిర్లింగాలు ఉంటాయి. ఇంకా, ప్రార్థన మందిరం, పాదుక మండపం— ఆది శంకరుని [illegible] సరస్వతి [illegible] గ్రంథాలయం ఇక్కడ [illegible] గోపురం [illegible] ప్రాకారం మీద వివిధ పుణ్య స్త్రీల చిత్రాలు ఏర్పరచే ప్రయత్నాలు జరుగుతున్నాయి.

ఈ స్మారక చిహ్నం, 28—4—1963న కంచి కామకోటి పీఠాధిపతి ఆవిష్కరించారు. 29—9—63న రాష్ట్రపతి డా. రాధాకృష్ణన్ [illegible] ... 



ఆదిశంకరుల స్మృతిచిహ్నం: రాష్ట్రపతి సందర్శిస్తున్న దృశ్యం

# కారట్







## తక్కువధర మంచి బ్లేడులు

ఒక్కొటి
4 న.పై మాత్రమే
అన్నిచోట్ల దొరకును

ఓరియంట్ కాస్మెటిక్సు ప్రైవేట్ లిమిటెడ్, మద్రాసు

ajanta OC/64-4 TG.

ద్వారా, అంతా అబద్ధమని తెలిసికొని సంతృప్తి పడాలనే ఆశ అతని మనసులో ఏ మూలనో ఉంది.

కానీ ఇప్పటి గిరి మౌనమూ, తన మాటలను వింటూ అతడనుభవిస్తూన్న సంక్షోభమూ, హరి అనుమానాలను ధృఢం చేసింది. అణచి ఉంచు కున్న అతని ఆవేశం కట్టలు తెగింది. విపరీతమైన రోషంతో వణికిపోతూ లేచి నుంచున్నాడు—

"నువ్వు దుర్గను ప్రేమిస్తే అందులో తప్పు లేదు కానీ, నీ ప్రేమకోసం దాని జీవితం నాశనం చేద్దామనుకుంటున్నావా? నీ ప్రేమ నిజమయిన దయితే నువ్వు ప్రేమించినవాళ్ళ సౌఖ్యాన్ని కోరు కుంటావు. అంతేకానీ, నీ స్వార్థాన్ని చూసుకోవు. దుర్గ ప్రస్తుత సంసార పరిస్థితిని చక్క దిద్ద డానికి ప్రయత్నించటానికి మారుగా, నీ స్వప్రయో జనానికి వాడుకుంటున్నావా? చుట్టు ప్రక్కల అందరూ, మిమ్మల్ని గురించే అనుకుంటున్నారనీ అది దుర్గకు అవమానకరమనీ, అయినా ఆలో చించలేదేం? ఛీ!ఛీ! ఇంత నీచుడివనుకోలేదు. ఇంక మీదనైనా, నా మీద దయతలిచి అక్కడకు వెళ్ళకు. నా ప్రార్థనను మన్నించు."

ఈ మాటలు పూర్తి చేయటమూ, హరి గబ గబ బయటకు నడవటమూ, ఒక్కసారే జరిగినాయి. గిరి తన దిగ్భ్రాంతిలోంచి తేరుకునే సరికి, హరి అక్కడ లేడు—

గిరి తన మనసులోనైనా, హరికి గానీ, ఉమకు గానీ ద్రోహం తలపెట్టకపోయినా హరి తనదిగా భావించిన ఉమనే తనూ ఆరాధించటం, ఒక దోషంగానే భావించాడు— దీనికి తోడు, ఉమకూడా తన పట్ల అనురాగాన్ని చూపటం, హరిని తిరస్క రించడం, అతనికి మరింత బాధ కలిగించింది. ఉమ తనను నిర్లక్ష్యం చేసి హరిని చేసుకుని ఉంటేనే హాయిగా ఆనందించే వాడు గిరి— ఉమ తిరస్కారా నికి హరి అనుభవిస్తూన్న వ్యథకు తానే బాధ్యు డయినట్లు అతని అంతరాత్మ అల్లరి పెడుతూంది. తన ప్రాణ మిత్రుడయిన హరి ఆవేదనను, అందులో తన కారణంగా కలిగిన, ఈ నిరాశను నిర్మూలించ వలసిన బాధ్యత తనదేనని కూడా అనుకున్నాడు గిరి—

దుర్గ విషయంలో హరి వేరొక విధంగా భావించ గలడనే అనుమానం, గిరికి ఏ కోశానా లేదు. అందుకనే హరి, ఉద్రేకంగా సంభాషణ ప్రారం భించగానే అతడు ఉమ విషయమని భావించాడు. అతని అపరాధిః హృదయం హరి ముందు సంకో చంతో ముడుచుకు పోయింది. మాట్లాడటానికి నోరురాలేదు— తల ఎత్తి మిత్రుని చూసే ధైర్యం కూడా లేకపోయింది గిరికి.

ఒక్క సారిగా దుర్గ ప్రస్తావన వినగానే, దిగ్భ్రమ చెందాడు గిరి— అంటే హరి మనసులో ఈ అభిప్రాయం ఎప్పటినుంచో ఉందన్నమాట! తన పెళ్ళి గురించి హరి ప్రశ్నించినపుడు తానిచ్చిన సమాధానం ఈ ఊహను బలపరచి ఉండాలి— అయ్యో హరీ!

తన ప్రాణ మిత్రుడైన హరి మనః సంక్షోభం గిరికి కూడా కూడా చాలా బాధ కలిగించింది. ఎలా గైనా హరి దిగులునంతా కడిగి వెయ్యాలి. దుర్గ సంసారం చక్క బడాలి. దుర్గను తను చెల్లెలిలాగ అభిమానిస్తూన్నానని హరి అర్థం చేసుకోవాలి. ఈ

# సంపెంగ పొదలు

19 వ పేజీ తరువాయి

పనులు తన వల్ల అవుతాయా? అన్నింటికంటే తనకూ, హరికీ మధ్య ఎంతటి స్వల్ప విభేదాలయినా రావటం గిరి సహించలేక పోయాడు. వెంటనే వెళ్ళి అసలు సంగతి వివరించి, హరితో మనస్పర్థలు లేకుండా చేసుకోవాలని అతని మనసు ఆత్రపడ సాగింది. ఆ సమయంలో హరి క్లబ్బులో ఉంటా డని ఊహించి అక్కడకు వెళ్ళాడు. కేరమ్సు ఆడుతున్న హరి గిరిని చూడగానే, బోర్డు వదిలేసి అక్కడినుండి లేచి గిరి ముఖమైనా చూడకుండా తన మోటారు సైకిలు మీద వెళ్ళిపోయాడు. గిరి శూన్యమైన మనసుతో తనూ వెనుదిరిగాడు.

## 20

అప్పుడే కన్ను మూత పడుతున్న సమయంలో తలుపు చప్పుడయ్యే సరికి, ఎక్కడలేని విసుగూ వచ్చింది ఉమకు. అంతలోనే సర్దుకుంది. విసుక్కు నేందుకు వచ్చిందా తాని ప్రదేశానికి? కళ్ళు నులుముకుంటూ లేచి వెళ్ళి తలుపు తీసింది. గిరి నవ్వుతూ లోపలకు ప్రవేశించాడు. విద్యుత్ప్రసారిత ప్రదేశంలో నిలువబడినట్లు, ఉమ సర్వ శరీరము చంచలించింది.

"గిరీ" అని అస్పష్టంగా, మత్తుగా గాఢంగా తనలో తాననుకుంటూ అతని గుండెల మీద వాలి పోయింది ఉమ, అప్రయత్నంగా. గిరి చేతులు కూడా ఉమను చుట్టి వేశాయి. ఉమ సర్వాంగాలూ, "గిరీ! గిరీ!" అని పిలుస్తున్నట్లుగా తోచింది గిరికి. తన హృదయానికి అత్యంత సమీపంగా ఉన్న ఆమె హృదయం ఎన్నో మహా కావ్యాలను తన హృదయానికి అంద జేసింది. యావత్ప్రపంచమూ, శూన్యమై నట్లు ఆ శూన్యంలో, తామిద్దరూ మాత్రమే ప్రకాశిస్తున్నట్లూ భావించింది గిరికి—

అంతలోనే స్పృహణీయుడైనాడు గిరి. తనను చుట్టిన ఉమ చేతులను మృదువుగా సడలించి, దూరంగా తొలిగి —"ఇదేమిటి ఉమా?" అన్నాడు—

ఉమ ముఖం ఎర్రబడింది. అవును. ఇదేమిటి? తను గిరిని ఎంత ఆరాధిస్తున్నా, ఒక్కనాడైనా అతనితో హద్దులు మీరి మాట్లాడినది లేదు. అతని అభిప్రాయం కూడా తెలిసికోకుండా తానిలా తేలిపోయిందేమిటి?

వంచిన తల ఎత్తలేక పోయింది ఉమ. అయినా జరిగిన దానికి ఆమెకు కష్టం కలుగలేదు. ఉచితమో, అనుచితమో యావజ్జీవితమూ తల్చుకుని మురియ డానికి ఒక్కక్షణమైనా ప్రసాదించాడు తనకు భగవంతుడు— తన స్త్రీ జన్మ సార్థకమైంది. అప్రయత్నంగా తనను చుట్టిన గిరి చేతులనుండి తన శరీరానికి వ్యాపించిన మధురిమ, ఎన్ని జన్మలకు సరిపోదూ?

తలవంచుకుని, ఎర్రబారిన చెక్కిళ్ళతో, అర్ధనిమీలిత నేత్రాలతో, అనురాగ పూర్ణమైన మందహాసంతో తన ఎదురుగా నిలువబడిన ఉమను చూసి గిరి హృదయం బావురుమంది. "నేనెంత దురదృష్టవంతుడనీ?" అనుకోకుండా ఉండలేక పోయాడు.

"మీరు చాలా అలసినట్లున్నారు. నేనలా తిరిగి వస్తాను." అన్నాడు గిరి.

ఉమ కంగారుగా "లేదు! లేదు! నేనేం అలసి పోలేదు. పొద్దుయి పోయింది ఇంకా నిద్రేమిటి?" అంది.

నిజంగానే ఆమె అలసట అంతా ఎగిరి పోయింది. ఒకవేళ పడుకున్నా తానింక నిద్రపోగలదా?

"మీరు డ్యూటీకి ఎన్ని గంటలకు వెళ్ళాలి?" అన్నాడు గిరి.

"న్యాయంగా తొమ్మిది గంటలకు— కానీ, ఎప్పుడంటే అప్పుడు పిలుపు వస్తూనే ఉంటుంది.

"బొత్తిగా విశ్రాంతి ఉండదనుకుంటానేం?"

ఉమ తలెత్తి గిరి వంక చూసి అదోకరకంగా నవ్వింది. "విశ్రాంతి ఉండకూడదనేగా ఇక్కడకు వచ్చింది?"

గిరి గుండెల్లో గుచ్చుకుందా నవ్వు. తన భావోద్వేగాన్ని అణచుకోలేక ముఖం తిప్పు కున్నాడు.

'మీకు స్నానానికి ఏర్పాటు చేస్తానాగండి."

అంటూ ఉమ లోపలకు వెళ్ళబోయింది—

"స్నానమేమిటీ? ముఖం కూడా కడుక్కోలేదు."

"అయితే ముఖం కడుక్కోవటానికి వేడినీళ్ళు పెడతాను."

"మీ కెందుకు శ్రమ? పని వాళ్ళు లేరా?"

" ఇక్కడ అందరూ పనివాళ్ళే! ఒక హాస్పిటలు



వస్తోంది. కానీ, ఇంకా చాలా [illegible] గానే వస్తుంది. అయినా మీకు వేన్నీళ్ళు పెట్టడం నాకు శ్రమా?! ఇంతకంటె ఆనందం కలిగించేది ఇంకొకటి ఉండదు— ఈ మాత్రం అదృష్టం కోసం ఎన్ని జన్మలైనా తపస్సు చేస్తాను"

గిరి ఇంకేమీ మాట్లాడలేదు. క్షణక్షణానికీ అతని హృదయం వశం తప్పుతుంది. ఉమను

# సంపెంగ పొదలు

గాఢంగా హత్తుకుని తనలో లీనం చేసుకోవాలనే, తీవ్రమైన ఆకాంక్షను, అతి నిగ్రహంతో అణగద్రొక్కుకుంటున్నాడు. గిరి— అతని సర్వ ఉద్రేకాలకూ, ఒకటే మంత్రం 'ఉమ పర సతి— పర ప్రణయిని—' ఈ భావన అతని సమస్త ఉద్రేకాలనూ తుడిచి పెట్టి, మనస్థితిని మాత్రం నిలుపుతుంది.

ఉమ ఇచ్చిన వేడి నీళ్ళతో ముఖం కడుక్కుని, ఆమె అందించిన కాఫీ అందుకున్నాడు గిరి— ప్రతి క్షణమూ, అతని హృదయం హాయి, హాయిగా ఉంది. ఉమ ఈ లోకంలోనే లేదు, అసలు, ఆమెకు ప్రతి వస్తువు ఎంతో అందంగా, ప్రతి పని ఎంతో ఆహ్లాదకరంగా, లోకమంతా ఆనందమయంగా అనిపించసాగింది.

"ఇవాళ సెలవు పెడతాను." అంది ఉమ.

గిరి తల అడ్డంగా తిప్పుతూ "వద్దు—ఏ ప్రలోభమూ మిమ్మల్ని కర్తవ్య విముఖురాలినిగా చేయకూడదు." అన్నాడు.

"సరే! అయితే. వీలైనంత త్వరలో వస్తాను."

"పరవాలేదు. నేను రాత్రి ట్రైనులోనే కాని వెళ్ళను. మీరు వచ్చిన తరువాతే, మనం హాయిగా మాట్లాడుకోవచ్చును."

"ఈ రోజే వెళ్ళిపోతారా?" దిగులుగా అంది ఉమ.

"అవును సెలవు లేదు."

ఆ రోజు ఇద్దరూ కూర్చుని అన్నాలు తింటూంటే ఉమ "నా చేతులతో మీకు వడ్డిస్తూంటె నాకు ఎంత సంతృప్తిగా ఉందో చెప్పలేను. ఇట్లాంటి ఒక్క రోజుకోసం జీవితంలో ఎన్ని బాధలనైనా సంతోషంగా ఎదుర్కో గలను." అంది.

గిరి తింటూన్న అన్నంలోంచి చెయ్యి పైకి తీసి "మీరిలా చీటికి, మాటికీ, నన్ను ఉక్కిరి బిక్కిరి చేస్తే, నేను ఇప్పుడే పారిపోతాను." అన్నాడు గంభీరంగా—

ఉమ మాట్లాడలేదు కానీ, ఆమె కళ్ళలో నీళ్ళు తిరిగాయి. ఆ కన్నీళ్ళు చూసి గిరి ఆర్ద్ర స్వరంతో "ఉమా దేవీ! నేను వచ్చి మీకు కష్టం కలిగిస్తున్నానా?" అన్నాడు.

ఉమ వెంటనే "లేదు. లేదు." అంది—

క్షణకాలమాగి గిరి "నాకు తెలుసు— నా రాక మీకు వ్యధ కలిగిస్తుందని— అయినా తప్పనిసరి కారణం వల్ల వచ్చాను రాకపోవటానికి, ఏమాత్రం వీలున్నా, వచ్చేవాడిని కాను." అన్నాడు ఉమ నవ్వింది.

"అట్లాంటి తప్పనిసరి కారణాలు కలగటం నా అదృష్టం. లేక పోతే, ఈ మాత్రం భాగ్యానికి కూడా నోచుకోక పోయేదానినిఅయినా. ఏమిటా కారణాలు?" కుతూహలంగా అడిగింది ఉమ

"మీరు డ్యూటీనుంచి వచ్చాక చెపుతాను. హడావుడిగా మాట్లాడే విషయాలు కావు." అన్నాడు.

ఉమ ఆశ్చర్యంగా అతని వంక ఒక్కసారి చూసి ఊరుకుంది.

ఉమ హాస్పిటల్‌కు వెళ్ళగానే, టేబిల్ మీది ఉమ ఫోటోగ్రాఫ్ తీసి గట్టిగా గుండెలకదుముకున్నాడు గిరి.

తన తలపు మాత్రంతో పులకితురాలయ్యే స్త్రీని తన సేవే, జీవితానందమనుకునే స్త్రీని తాను మానసికంగా, శారీరకంగా, అతి గాఢంగా వాంఛించే స్త్రీని తానై వదులుకునే దురదృష్టం, ఏ పురుషుడి జీవితంలోనైనా తటస్థపడుతుందా?

భారంగా కనులు మూసుకున్నాడు గిరి. రైలు ప్రయాణం వలని అలసట అతనిని త్వరలోనే నిద్రాదేవి ఒడిలో చేర్చింది. (సశేషం)

విషయం చేస్తావా, లేక మా వివాహం విషయంలో మళ్ళీ నీవు రావటం మూడు సంవత్సరాలకు గదా! మరి వివాహం ఇప్పుడే జరిపితే మంచిదని మా ఉద్దేశ్యం. మీ అమ్మగారేమంటుంది ?'

రఘూ కూడా యింతే. చెప్పదల్చుకున్న విషయాన్ని నిర్మొహమాటంగా చెప్పేశాడు. సీతాపతి గారుకూడ అడగవలసింది నిర్మొహమాటంగా అడిగేశారు. ఎదుటివారి ఇష్టాయిష్టాలు, కష్టసుఖాలు పరిస్థితులు ఇవేమీ గమనించలేని ఒక జాతి ఉంది. ఆ జాతికి చెందినవారు సీతాపతిగారు, రఘు — అనుకున్నాడు క్రాంతికుమార్.

'వివాహం విషయం ఇప్పుడేం తలపెట్టటం లేదు సీతాపతిగారూ! నా చదువు పూర్తయితే కాని మా కుటుంబం కుదుటపడదు. మా కుటుంబం కుదుట పడితేనే మా రమ వివాహం చేయగలిగేది. ఆ తర్వాతనే నావివాహం. అంత వరకూ నేనేమీ మాట్లాడలేను, క్రాంతికుమార్ మాటలకు ఏమనుకున్నారో ఏమో సీతాపతిగారు 'సరే,వస్తా' నంటూ వెళ్ళారు.

క్రాంతికుమార్ స్విడ్జర్లాండు వెళ్ళటానికి ఆయత్త మౌతున్న రోజు అరుణ వచ్చి కలిసింది. గదిలో ఒంటరిగా ప్రయాణ సన్నాహాలు చేసుకుంటుంటే లోనికి వచ్చి 'ప్రయాణ సన్నాహంలో ఉన్నట్లున్నారే, నన్నుకూడా హెల్పు చెయ్యమంటారా?'అంది నవ్వుతూ.

ఓ 'తప్పకుండాను' అని 'రా అరుణా! నీకోసమే వద్దామనుకుం టున్నాను. కూర్చో' అన్నాడు క్రాంతికుమార్. అరుణ కూర్చుంది. కొంచెంసేపు ఇరువురి మధ్య మౌనం నిల్చింది. ఆ మౌనం ఎందుకనో చాలా భయంకరంగా అనిపించింది క్రాంతికుమార్‌కు. ఆ మౌనాన్ని భంగపరుస్తూ దుఃఖం, భయం మిళితమైన స్వరంతోనూ, పెదవులపైని తెచ్చికోలు నవ్వుతోనూ అంది అరుణ. 'నన్ను మర్చి పోతారు గాబోలు' అని.

ఆ మాటల్ని అరుణ హాస్యాని కన్నదో నిజంగానే అన్నదో లేక నిజంగానే తనకా శంక కలిగి అన్నదో క్రాంతికుమార్ ఇదమిద్ధంగా ఊహించలేకపోయాడు.

'ఆదేమిటి అరుణా అలా అంటావు.? మానవునికి

# సిరి సిడలు

29 వ పేజీ తరువాయి

అసాధ్యమంటూ ఏదీలేదని నేననుకుంటూ ఉండే వాడ్ని. కాని ఇప్పుడు తెలుస్తోంది, తన కిష్టులైన వారిని, హృదయానికి సన్నిహితురాలైన వారిని మానవుడు— ముఖ్యంగా నాబోటి వ్యక్తి— మరచి పోదామన్నా మర్చిపోలేడని.'

క్రాంతికుమార్ మాటలు అరుణకు తృప్తి కలిగించాయి. అందుకని మరిక మాట్లాడలేక పోయింది. అయినా, మనసులో అప్పుడే జనించి వటుడింతై, ఇంతింతై అన్నట్లు పెరిగిన కొన్ని మూగ భావాలు ఆమె కళ్లను నీటితో కప్పి వేసినై. దుఃఖం పెల్లుబికింది.

ఆమె కన్నీటికి కారణమేమిటో క్రాంతికుమార్‌కు అర్థం కాలేదు. 'ఏమిటి అరుణా! ఎందుకలా కన్నీరు పెడ్తావు? ఏం జరిగింది? నాతో చెప్పు' అంటూ ఆమె బుజాలను తన రెండు చేతులతోనూ పట్టుకుని తనచేవు ర్రుమాలుతో కర్చీఫుతో ఆమె కన్నీటిని తుడిచాడు.

'ఇంతవరకూ ఏమీ జరుగలేదు' అంది అరుణ?

'ఇక మాత్రం ఏం జరుగుతుందని?'

'మా నాన్నగారు ఇక్కడికి వచ్చారుటగా'

అవునన్నాడు. అరుణ మళ్లీ కొంతసేపటివరకూ మాట్లాడలేదు. చివరకు 'మీకిది న్యాయమేనా చెప్పండి. మా అన్నయ్య రమను చేసుకోనన్నాడని మీరు మన వివాహానికి ఒప్పుకోలేదుటగా' దీనంగా అని, బావురుమంది.

క్రాంతికుమార్ చలించిపోయాడు. దుఃఖం ఆశ్చర్యం రెండూ ముంచుకొచ్చినై. తానా విధంగా అన్నాడా? లేకపోతే సీతాపతిగారు ఆ విధంగా అర్థం చేసుకున్నారా?

'అరుణా! నీమాటలు చాలాబాధకల్గిస్తున్నైనాకు. నేనావిధంగా అనలేదు. అమాటకొస్తే రఘు నా చెల్లెల్ని చేసుకోనన్నాడని నేను నిన్ను త్రోసికరించాలనే భావమే నాకు స్ఫురించ లేదు. మీ నాన్నగారితో నే చెప్పినదల్లా ఒక్కటే. నా చదువు పూర్తయ్యి నా వృత్తిని నేను చేపట్టనిగాని రమ వివాహం చేయటం పడదు. ముందు రమ వివాహం జరిపించిన తర్వాతనే నా వివాహ విషయం నేను ఆలోచించేది అన్నాను. ఇందులో నా తప్పేమైనా ఉందా?'

అరుణ జవాబు చెప్పింది. 'నాన్నగారికి ఆ అర్థం స్ఫురించదేమో మరి. ఆయన అన్నయ్యతో ఆ విధంగా చెప్పాడు. అన్నయ్య అనరాని మాటలుఅన్నాడు.'

'ఏమని?'

'ఫారిన్ వెళ్తున్నానని మీకు గర్వం వచ్చిందని, నాకు వేరే సంబంధం చూసి పెళ్లి చేస్తానని. ఇంకా ఏమేమో అన్నాను.'

క్రాంతికుమార్ నిట్టూర్చాడు. 'ఎవరో ఏదో అనుకున్నారని, అన్నారని అనుకుంటారని నేను నా మనసును మార్చుకునే మూర్ఖుడ్ని గాదు అరుణా'.

అప్పుడే 'అరుణా అంటూ' అంటూ రమ లోనికి రాబోయి పడబోయింది. అరుణ గబగబా రమను పట్టుకుంది.

* * *

మరో సంవత్సరానికి చదువు ఐపోతుందనగా స్విడ్జర్లాండులోని క్రాంతికుమార్‌ను వెతుక్కుంటూ ఒక కవరు వచ్చింది. తన వివాహానికి ఆహ్వానాన్ని పంపుతూ అరుణ వ్రాసిన కవరది. శుభలేఖను చూసి విస్తుపోయాడు క్రాంతికుమార్. ఇలా జరుగుతుందేమోనని అనుమానం, భయం తనకు కల్గినా, ఇన్నాళ్ళుగా తనా అనుమానాన్ని భయాన్ని మనసులో నుండి తుడిచివేసుకుని సమాధానపడుతున్నాడు. కాని జరగకూడదనుకున్నది జరుగనే జరిగింది. ఎందుకని? అరుణ ఈ వివాహానికి ఎందు కంగీకరించింది? తనమీద నమ్మకం లేకపోవటంచేతనా? లేక ఆమె అభీష్టానికి భిన్నంగా రఘు, సీతాపతిగారు బలవంతంగా ఈ పెళ్లి జరుపుతున్నారా? వాళ్ల అన్యాయానికి బలియై జీవితాంతం తీరని ఆవేదనతో,అసంతృప్తితో అరుణ బాధపడవలసిందేనా? ఇందుకు మూల కారకుడు తనేగదూ! తను ఈ చదువులకు దూర దేశాలకు రావటం వల్లనేగదూ? తనీ వివాహాన్ని ఆపలేడా?

ఈ ఆలోచనలు అతనిలో ఆవేశపూరితమైన ఆవేదనను కల్గించినై. ఏ విధంగానైనా పెళ్లి వివాహాన్ని ఆపాలనిపించింది. కాని శుభలేఖలోని తేదీ అతన్ని వెక్కిరించినట్లు వంకరలు తిరిగింది. ఈ పాటికి పెళ్లి జరిగిపోయి ఉంటుంది. పెళ్లి జరిగిన మూడు రోజులకు పెళ్లి పిలుపు! నిర్వేదమైన నిర్జీవమైన చిరునవ్వు ఒకటి అతని పెదలవరకూ వచ్చి వచ్చి ఆగిపోయింది. కవరులోని ఉత్తరాన్ని బయటకు తీశాడు.

'డాక్టరు క్రాంతికుమార్‌గారికి — నేనీవిధంగా ఉత్తరం వ్రాయవలసి వస్తుందని మీరు ఇక్కడ నుండి బయలుదేరిన నాడే అనుకున్నాను. కాని.... మనకయిష్టమైన సంఘటనలు జరుగుతాయని మనసుకు తోచినా ఆ భావాన్ని బయటకి వెలువరించము సామాన్యంగా. నా విషయంలో గూడ అంతే జరిగింది. అదీగాక అలాంటి అయిష్టమైన సంఘటనలు జరుగవని, తాత్కాలికంగానైనా, నమ్ముతూ తద్వారా మనసును సమాధానపరచుకుంటూ 'ఆశ'తో జీవించటమే మానవుల లక్ష్యం— అనే వేదాంతం బాగా తలకెక్కింది నాకు. ఈ వేదాంతం, ఇవన్నీ



[illegible] వ్రాస్తున్నానో ఈ పాటికి ఈ కవరుతో ఉన్న శుభలేఖ మీకు చెప్పే ఉంటుంది. మీరు నాతో చెప్పిన విషయాలన్నీ నేను మా అమ్మద్వారా నాన్నగారికి చెప్పించాను. ఆయన విన్నారు. విని వూరుకున్నారు. కాని మా అన్నయ్య వూరుకోలేదు. భగ్గుమన్నాడు. 'నాన్నా! కుమార్ ఇక్కడ చెప్పి వెళ్ళిన మాటలు నిజమే. కాని ఇప్పుడు తను ఉంటున్నది దేశంకాని దేశంలో. విదేశ చదువులకంటూ పోయి దొరసానిని వెంటబెట్టుకుని స్వదేశానికి తిరిగి వచ్చిన ప్రబుద్ధులెంత మంది లేరు? కుమార్ అలా చేస్తాడని నేనంటం లేదు, కాని కీడెంచి మేలెంచ మన్నారు. అదీగాక కుమార్ తిరిగి వచ్చేంతర్వాత అతడ్ని అల్లుడ్ని చేసుకోవాలనే ఆశతో ఎంతో మంది ఆడపిల్లల తండ్రులు గాలాలు తయారు చేసుకుంటున్నారు. ఈ అవకాశాన్ని ఆసరాగా తీసుకుని కట్నం ఎంతైనా 'పలుకవచ్చు'. అప్పుడు కుమార్‌కు అరుణమీద జాలికలిగినా ఉందే కాని వెనుకటి అభిమానం, మాట గుర్తుండదు. ఎంతైనా మనం మానవ మాత్రులం. అందుకని.....ఈ సంబంధం మాత్రం తక్కువదా? మధు ఇంజనీర్‌గా పనిచేస్తున్నాడు. పెద్ద బంగళా, కారు, ఇంటినిండా నౌకర్లు.. మధు అజమాయిషీలో మూడు మల్టీ పర్‌పస్ ప్రాజెక్టులు నిర్మిస్తున్నారు! కలిసి వచ్చిన ఈ సంబంధాన్ని కాల దన్నుకోటం తెలివైన పనిగాదు.......' అంటూ బోధ చేశాడు. ఫలితంగా శుభలేఖలు అచ్చయినాయి. మా అన్నయ్యాస్నేకి అవిధంగా అన్నా, మీ విషయం బాగా తెలిసినవాడు. మీరు నన్ను అన్యాయం చేయరని ఆయనకు తెలియకపోలేదు కాదు. రమను మొదట్లో పెళ్లి చేసుకుంటానని మాట యిచ్చి కూడ తర్వాత మాట నిలబెట్టుకోలేక పోయాడు. కాని మీరలా కాకుండా ఒకేమాటమీద నిలబడ్డారు. మరొకరైతే నా చెల్లెల్ని నీవు చేసుకోకపోతే నీ చెల్లెల్ని నే నెందుకు చేసుకుంటాను' అని అంటారు సహజంగా. మీరలా అనలేదనే మా అన్నయ్యకు బాధ. మరి తను ఓడిపోయినట్లుగదూ (తనూ మానవ మాత్రుడే గదా) ఇదొక కాంప్లెక్సు. ఇలాంటి కాంప్లెక్సులు మీ డాక్టర్లు ముందు కనిపెట్టలేరు. అందుకనే డాక్టరులైన మీరు నాకిష్టం లేదు. నేను ఇంజనీరునే పెళ్లి చేసుకుంటాను. మల్టీ పర్‌పస్ ప్రాజెక్టులను నిర్మించే నాకాబోయే భర్త అనన్య సామాన్యుడు. పెద్ద ఇంజనీరు. మాకు పెద్ద బంగళా, పెద్ద చిన్నకారు, పెద్దహోదా, పెద్ద... మీకు అసూయగా ఉందా? నాకు పిచ్చెక్కిందను కుంటున్నారా? గొప్పలు చెప్పుకుని డప్పు కొడ్తున్నానంటారా? నిజమే గొప్పలే చెప్తున్నాను. నాకు పిచ్చెక్కలేదు. కాని అలా గొప్పలు చెప్పుకుంటుంటే నా కదొక విధమైన సంతృప్తి. సంతృప్తి లేని జీవితానికి సుఖముండదుగా. అందుకని ఏదో విధంగా సంతృప్తి ఎరువు తెచ్చుకోవాలి మరి....... ఉంటా........అరుణ"

క్రాంతికుమార్‌కు పిచ్చెక్కినట్లయింది. కోపం, ద్వేషం, విసుగు ముంచుకొచ్చాయి. కాని అశక్తుని వలె కూలబడిపోయాడు.

* * *

జననీ జన్మభూమిశ్చ అనుకుంటూ ఇంటికి తిరిగి వచ్చిన క్రాంతికుమార్‌కు మిత్రులంతా బ్రహ్మరథం పట్టారు. అమ్మ ఆనందాశ్రువుల్ని వర్షించింది. చెల్లెలు ఉక్కిరిబిక్కిరి అయి అదిటి [illegible] మాటన [illegible]. [illegible] పెట్టుకున్నాడు క్రాంతికుమార్.

రమకు నాగార్జునసాగర్‌లో సి.ఇ.ఉద్యోగం వచ్చి వెళ్ళిపోయాడు. అరుణ భర్తతోపాటు అనంతపూర్‌లో ఉంటోంది. అరుణ లేని ఆవూరు వాస యోగ్యంగా అనిపించలేదతనికి. వెంటనే మకాం మార్చేసి గుంటూరులో ప్రాక్టీసు పెట్టాడు. గవర్నమెంటు హాస్పిటల్‌కు ఆనరరీ సర్జన్. అతని పంటి [illegible] తెలుసుకుని పెరుగుతున్నాడు. ఎంతో అనుభవంతో కాని నేర్చుకోలేని ఎన్నో విషయాల్ని అనతికాలంలోనే తెలుసుకొని పది మందిలో పెద్దనే అనిపించుకున్నాడు. రమకు వివాహం చేయగలిగాడు. నాళ్తేరులో రీడరుగా ఉంటున్న తన మిత్రుడు ప్రభాకర్ రమను వివాహం చేసుకున్నాడు. రమ జీవితం సాఫీగా గడచిపోతోంది. తన జీవితం కూడ సాఫీగానే సాగిపోతోంది. అయితే ఒక్కటే లోటు

అప్పుడప్పుడు రఘు మనసులో మెదిలి ఆవేదనను కల్గిస్తోంది.

* * *

తెల్లవారుతూనే అరుణ వచ్చింది. ఆమెతోపాటు ఆమె ఎడపిల్ల, చంటిపిల్లవాడు, రఘు, సీతాపతిగారు వచ్చారు. ముందుగనే ఖాళీ చేయించిన ముందు గదులు రెండూ వారికి ఏర్పాటు చేశాడు క్రాంతి కుమార్.

రఘు బాగా చిక్కి శల్యమై పోయాడు. బాగా పెరిగిన గడ్డం. లోతుకు పీక్కుపోయిన కళ్లు, అస్థిపంజరంలా తయారైన శరీరం— క్రాంతి కుమార్‌కు జాలివేసింది.

క్రాంతికుమార్‌ను చూడటంతోనే రఘు కళ్లల్లో నీరు నిల్చింది. కన్నీటిని కనపడనీకుండా చేసే ప్రయత్నంలో రఘు తలవంచుకున్నాడు. ప్రక్కనే కుర్చీలో కూర్చున్న సీతాపతిగారు కళ్లొత్తు కున్నారు.

'హల్లో రఘూ! [illegible]?' క్రాంతి కుమార్ పలకరించాడు. రఘు తల పైకెత్తి చూశాడు. కళా కాంతులు లేక ఎండిన మోడులా కనిపించాడతను క్రాంతికుమార్‌కు. 'ఎలా వుంది మీకు' మళ్లీ అడిగాడు.

రఘు జవాబు చెప్పలేదు. సీతాపతిగారు చెప్పటం మొదలుపెట్టారు. 'ఏమిటోనోయ్ కుమార్! వాడి జీవితం పూర్తిగా దుఃఖభాజనం కావాలని రాసిపెట్టి ఉంది గాబోలు. లేకపోతే ఏమిటి చెప్పు. ఈ వయసులో రావలసిన జబ్బేనా ఇది? యమ బాధపడు తున్నాడు. రాత్రిళ్ళు నిద్ర ఉండదు. పెద్ద వయసులో కొడుకును, మనుమల్ని చూస్తూ కృష్ణా రామా అనుకుంటూ కాలం గడపవలసిన వయసులో కొడుకు దుర్గతిని చూస్తూ క్రుళ్లి క్రుళ్లి పోవలసిన స్థితి రావటం నిజంగా నా దురదృష్టమే'.

''అలా అనకండి. బెంబేలు పడకూడదు. మనం వచ్చే కష్టాల్ని చిరునవ్వుతో ఎదుర్కొంటేనే జీవితం సుఖమయ మవుతుంది. రఘుకు ఏం పర్వా లేదు. అతని వ్యాధిని నయం చేసే పూచీ నాది. ఈ పూటే హాస్పిటల్లో చేర్పిద్దాం' అన్నాడు క్రాంతి కుమార్. లోపల్నుండి అప్పుడే వచ్చారు అరుణ, అమ్మ. ''అమ్మా నాకు స్నానానికి నీళ్లు తోడు'' అని చెప్పి తన గదిలోకి వెళ్లిపోయాడు క్రాంతికుమార్.

రఘును చూస్తుంటే క్రాంతికుమార్ కెందుకో భయం వేసింది. రఘు ముఖంలో విషాద చ్ఛాయలు కన్పించటం సహజమే. కాని వాటితోపాటు అతని పెదవులపైన, కనురెప్పల క్రింద నీలినీడలు నాట్య మాడుతున్నై. నీలినీడలంటే తనకు భయం. తన అనుభవంలో బ్లూయిష్‌నెస్ కనిపించిన కేసుల్లో సక్సెస్ అయినవి చాలా కొద్ది. 'ఛీ. ఛీ. ఏమిటి ఈ ఆలోచనలు. రోగిని ఇంతవరకు పరీక్ష చేయలేదు, లోని ఆర్గన్స్‌ను ఎక్సురే తీయాలి. ఏదీ లేకుండానే ఏమిటి ఈ పాడు ఆలోచనలు, కంక్లూషన్స్‌ను?' అనుకుని బుజాన టవలు వేసుకుని స్నానానికి బయలుదేరాడు.

స్నానాల గదిలో బాల్చీతో నీళ్లు, సబ్బు పెట్టివస్తోంది అరుణ. క్రాంతికుమార్ ఆశ్చర్యంగా చూశాడు. అరుణ పుట్టింటిలో గారాబంగా పెరి గింది. మెట్టినింటిలో పిసమెత్తు పనిచేయటానికి

# నీలి నీడలు

కూడానొకళ్లు. ''నీ కెందుకు అరుణా ఈ శ్రమంతా'' అన్నాడు.

''ఇందులో శ్రమేమీ లేదులెండి. మీ అమ్మ గారికి సాయం చేస్తున్నాను. అంతే'' అని వంట గదిలోకి వెళ్లి పోయింది.

క్రాంతికుమార్‌కు స్నానం చేస్తున్నంత సేపూ ఏవేవో ఆలోచనలు ముసురుకున్నై. వెనుకటి రోజుల్లో అరుణ, తను సన్నిహితులుగా ఉన్నప్పుడు ఎలా ఉండేదో, ఎలా మాట్లాడేదో ఇప్పుడూ అలాగే ఉంది, మాట్లాడుతోంది. కాని తను? అరుణ మరొకర్ని వివాహం చేసుకున్నప్పటి నుంచి అరుణను గురించి తను ఊహించుకున్న స్వప్నాల్ని మరచి పోజొచ్చాడు. ఇక జీవితంలో అరుణను చూడటం, ఆ అరుణతో మాట్లాడటం పడదనుకున్నాడు. కాని అరుణ తన ఇంటికి వచ్చింది. తనకు అర్ధాంగిగా తన ఇంటికి రావలసిన అరుణ అతిథిగా, తన వృత్తిరీత్యా తనతో అవసరం ఉండి వచ్చింది.— అవును అరుణ ప్రోద్బలం తోనే సీతాపతిగారు రఘును ఇక్కడికి తీసుకు వచ్చింది— అరుణతో తన వివాహం జరుగలేదే అని తానెంతగా దిగులు చెందాడో అరుణ అంత నిర్లి ప్తంగా ఉందిప్పుడు. అసలు అలాంటిదేమీ జరుగ నట్టే మెదులుతోంది. కాని తను మాత్రం బెరుగ్గా ఉంటూ తన ప్రతి కదలికలోనూ, పలుకులోనూ తన దిగులుని ద్యోతకం చేస్తున్నాడు. బహుశ స్త్రీకి పురుషునికి గల బేధాల్లో ఇదొకటేమో అనుకున్నాడు.

చిన్నారి రాము, ప్రతిరోజూ వాళ్ల నాన్నగారు ఆఫీసునుంచి వచ్చే సరికి 'ఈజీఛైర్' తెచ్చి వేసేవాడట. రాము "ఇంతమంచి వాడా" అని వాళ్ల నాన్న కొత్తల్లో మురిసి పోయాడు. కొన్ని రోజులు పోయాక, "ఎందుకిలా కుర్చీ తెస్తున్నాడు, వీడు" అన్న అనుమానం ఆయన కొచ్చింది. ఎలాగైనా, యీ రహస్యం కనిపెట్టాలని, ఆయన ఒక కంట పసిగట్టి వున్నాడు.

ఒకరోజున కాసేపు కుర్చీలో కూర్చొని లేచివెళ్లి, వాకిలి పక్కన నిలబడి చూచాడు మళ్లీ నాన్న. కుర్చీలో పడిపోయిన చిల్లర డబ్బులను రాము సర్దు కొంటూ ఉండటం ఆయన కంట బడింది.

రవిబాబు (విజయవాడ)

క్రాంతికుమార్ స్నానం చేసి వచ్చేసరికి అరుణ టిఫిన్, కాఫీ సిద్ధం చేసింది. సీతాపతిగారు, క్రాంతి క్రాంతికుమార్ కలసి టిఫిన్, కాఫీ పూర్తిచేశారు. తర్వాత క్రాంతికుమార్ 'అంబులెన్సును పంపుతాను రఘును తీసుకురండని' చెప్పిహాస్పిటలుకు వెళ్ళాడు.

హాస్పిటల్లో రఘును పరీక్ష చేయుటానికి కావ సిన ఏర్పాట్లన్నీ చేయించాడు క్రాంతికుమార్. అంబు లెన్సులో అరుణ, సీతాపతిగారు దిగి రఘును దింపి లోనికి తీసుక వచ్చారు మెల్లగా. ఎగ్జామినేషన్ రూంలో ఎత్తైన బల్ల మీద రఘును పడుకో బెట్టారు. అప్పటివరకు అక్కడే వున్న నర్సు శారద రఘు 'ఏదో పని పురమాయించగా లోపలికి వెళ్ళింది. రఘు క్రాంతి కుమార్ ఇద్దరే ఉన్నారు. ఆ గదిలో. 'కుమార్'! నా కోసరం అనవసరంగా శ్రమ తీసుకుంటున్నావేమో' అన్నాడు రఘు.

పరీక్షార్థం రక్తపు బొట్టును తీసుకోబోతున్న క్రాంతికుమార్ అలాగే ఆగిపోయాడు. 'మిస్టర్ మీరు అనవసరంగా భయపడుతున్నారు. యూ విల్ బి ఆల్ రైట్ సూన్' అన్నాడు నవ్వుతూ.

ఆ నవ్వు, ఆ మాటలు డాక్టర్లకు క్రొత్తగాదనే విషయం రఘుకు తెలియక పోలేదు. అతని పెదాలపై వెలుగు లేని చిరునవ్వు అలా వచ్చి మాయమైంది.

ఇంతలో మరొక నర్సు అక్కడికి వచ్చింది. ఆమె చేతుల్లో ఏవో పరికరాలున్నవి. క్రాంతికుమార్ ఆమె వేపు ఒక క్షణం చూసి 'నీ ఒచ్చావేం శారద ఏమైంది.?' అని అడిగాడు.

ఇంతలో మరొక నర్సు అక్కడికి వచ్చింది. 'అవసరమైన పనివుండి ఇంటికి వెళ్తున్నానని వెళ్లిపోయింది. మీతో చెప్పమంది.'

ఆ జవాబును విన్న డాక్టరు క్రాంతికుమార్‌కు కోపం వచ్చింది. ఈ శారద ఎప్పుడూ ఇంతే. తర చుగా మనసు బాగులేదనో ఇంటివద్ద పనివుందనో వెళ్తూ ఉంటుంది. ఆమె ఉంటే తనకు ఎంతో తేలిక. ఇతర నర్సుల మోస్తరుగా కాకుండా తెలివిగా ఎన్నో పన్లని సర్దుకు పోతూ, తనకు రిలీఫ్ ఇస్తుంది.

రఘుకు కేన్సర్ బాగా ముదిరిందని తెలుసు కున్నాడు. పైగా పాయిజనస్. కేన్సర్‌కు సంబంధిం చిన విష పదార్థాలు రక్తంలో కలుస్తున్నవి. కేసు పూర్తి స్వరూపాన్ని సమగ్రంగా తెలుసుకున్న తర్వాతనే 'ప్రాగ్నొసిస్ ఈజ్ వెరీ గ్రేవ్', అనుకున్నాడు. కాని పైకి ఏ భావాన్నీ వెలిబుచ్చలేదు. ఒక వార్డులో ఒక బెడ్ కేటాయించాడు రఘుకి......

ఆ రాత్రి క్రాంతికుమార్‌కు నిద్రపట్టలేదు. రఘు విషయం పదేపదే గుర్తుకు వస్తోంది. 'పాపం చాల దీనావస్థ అతనిది. ఒకవేళ రమను వివాహం చేసుకుని ఉంటే?' క్రాంతికుమార్ ఇక ఆలోచించ లేకపోయాడు. 'చూస్తూ చూస్తూ జీవితాన్ని దుఃఖ భాజనం చేసుకోగలమా' అన్నాడు రఘు. అంటే నీ చెల్లెలు కుంటిది నేనెలా పెళ్లి చేసుకునేది' అనేగా. కాని కుంటికి బదులు కురూపి ఎదురైంది. అతని జీవితంలో. సాయంత్రం అరుణ చెప్పింది.....పెద్ద కట్నం తీసుకొని అందమైన అమ్మాయినే రఘు పెళ్లి చేసుకున్నాట్ట. కాని సంవత్సరం తిరక్కుండానే ఆ అమ్మాయికి, మశూచికం వచ్చి శరీరమంతా ముఖమంతా గుంటలు పడి వికారంగా తయారైంది. రఘు అసహ్యించుకున్నాడు. 'నీతో కాపురం చేయ లేను. నీవు రాగానే మా అమ్మ చచ్చిపోయింది. ఇప్పుడు



బహుశా మీరు చెప్పలేరు...
కాని ఆమె అందములో
కొంచము లోపము వుంది!

కొంచము నిదానించి చూడండి
ఇప్పుడు ఆ లోపములు
కనిపించుట లేదు!

మీరు ఎల్లాగ చెప్పగలరు. ఈమె తన ముఖము మీది మచ్చలను, మొటిమలను లాక్టొ-కేలమైనుతో మరుగు పరుచుకొంది. లాక్టొ-కేలమైను ఒక అత్యుత్తమమైన 'పౌడర్ బేస్'. దీనిని ఉపయోగించుటవలన ముఖచర్మ మందలి దోషములు మరుగు పడును. మీ చర్మము మృదువుగాను మరియు కాంతివంతముగాను వుండును.

## లాక్టొ-కేలమైను ముఖములోని మచ్చలను మొటిమలను కప్పిపుచ్చును!

లాక్టొ-కేలమైనులో శీఘ్రముగా పనిచేసే ఉత్తమమైన కేలమైన్ వుంది. అది ముఖ చర్మమునకు చాలా లాభదాయకమైనది. దీని ఉపయోగించుటచే చర్మము మృదువుగాను మరియు కాంతివంతముగాను వుండును. దీనివలన మీ సౌందర్యమధిక మగును.
లాక్టొ-కేలమైను ముఖము మీది మచ్చలను, మొటిమలను కప్పిపుచ్చి వాటిని తొలగించుటకు సహాయపడును.
లాక్టొ-కేలమైను ముఖము మీద మొటిమలు మరియు ఎండ తీవ్రత వలన కలిగిన మచ్చలను తొలగించి పేదిగాలినుండి చర్మమును రక్షించును. చంటి పిల్లల లేగిన చర్మమును కూడా మృదువుగా నుంచును.
సౌందర్యసాధకమైన లాక్టొ-కేలమైను శ్రేణికి చెందిన లోషన్ క్రీమ్ మరియు టాల్కమ్ పౌడర్ కూడా దొరుకుచున్నవి.




లాక్టొ-కేలమైను—మీ సౌందర్యసాధనము! క్రుక్స్ ఇంటర్‌ప్రాన్ లిమిటెడ్, బొంబాయి 18.

నీవు కురూపివైనావు. కొన్నాళ్లకి పోతావు. నీ ముఖం నేను చూడలేను వెళ్లిపో' అన్నాడుట. సీతాపతిగారు, అరుణ ఎంతో నచ్చ చెప్ప ప్రయత్నించి విఫలులైనారుట. పాపం ఆ ఇల్లాలు ఎంతగా కృంగి కృశించి పోతోందో.

భార్య పుట్టింటికి వెళ్ళిన తర్వాత రఘుకి ఉద్యోగం పూడింది, కంట్రాక్టర్లతో లాలూచీపడటం మూలంగా. అప్పటినుంచి ఇష్టమొచ్చినట్లు తిరిగాడు. వేళకు తిండి, నిద్రలేక మనిషి సగమై ఇంటికి చేరాడు. అలా తిరగటం వల్లనే ఈ జబ్బు వచ్చింది, అన్నారుట ఎవరో.

ముందు గదిలో అరుణ పసిపిల్లవాడు ఉండి ఉండి ఏడుస్తున్నాడు. వాణ్ని సముదాయిస్తున్న అరుణ గొంతు సన్నగా వినిపిస్తోంది. కొంచెం సేపటికి వాడు నిద్రపోయినట్లున్నాడు, నిశ్శబ్దంగా వుంది. అంతలోనే కలవరించిందల్లేవుంది ఆడపిల్ల ఏడవటం మొదలెట్టింది. ఆ ఏడుపులోనే ఏదో

# నీలి నీడలు

అంటోంది. క్రాంతికుమార్‌కు విసుగు పుట్టింది. నిద్రలేకుండా ఎంతసేపని పడుకోవటం? ఫ్యాను, లైటు తీసేసి తలుపు తీసుకుని వరండాలో కొచ్చాడు. అరుణ కూతుర్ని మాటలు చెప్పి మరిపించాలని చూస్తోంది. ఆ అమ్మాయి వుండి వుండి 'కాంతి కాంతి' అంటోంది. అలా ఎందుకంటోందో, దాని అర్థమేమిటో అతనికి అవగాహనకాలేదు. అరుణను పిల్చి కనుక్కుందామనుపించింది. అంతలోనే ఈ సమయంలో పిలిస్తే అరుణ ఏమనుకుంటుందో నన్న భయంకూడా వేసింది. మళ్లీ ఆ అమ్మాయి ఏడుస్తూ 'కాంతి కాంతి' అంది. ధైర్యం చేసి క్రాంతికుమార్ తలుపు వద్దకుపోయి 'అరుణా' అని పిల్చాడు.

అరుణ తలుపు తీసింది. 'ఎందుకు పాప ఏడుస్తోంది' అని అడిగాడు. 'ఏమీలేదు కలత నిద్ర' అంది అరుణ. పాప ఏడ్పు చాలించింది.

'కాంతి అంటుందేమిటి'

అరుణ నవ్వింది. 'వాళ్ళన్నయ్య కోసం కలవరిస్తోంది. మా పెద్ద వాడిపేరు — క్రాంతికుమార్'

క్రాంతికుమార్ ఇక అక్కడ ఉండలేక తిరిగి వచ్చాడు. తలుపులు గడియవేసుకుని గదిలో పడుకున్నాడు. పైన సీలింగు ఫాను గిర్రున తిరుగుతోంది. అతని మస్తిష్కంలో అనేక విషయాలు సుళ్ళు తిరుగుతున్నై. అరుణ గురించి తను పొరబడ్డాడు. తనను, తన తోడి స్నేహాన్ని ఆమె మరచిపోయి సుఖంగా కాపురం చేస్తోందని భావించాడు. కాని అరుణ మరువలేదు. ఆమె కుమారునికి తన పేరు పెట్టటంలోనే ఈ విషయం స్పష్టమౌతోంది. కాని ఇప్పుడు, ఈక్షణంలో అరుణ మనస్సులో ఈ క్రాంతికుమార్‌ను గురించి ఎలాంటి ఆలోచన లున్నదో తెలుసుకోవాలనిపించింది.

క్రాంతికుమార్ గట్టిగా కళ్ళు మూసుకున్నాడు. కళ్లతోపాటు తలపుల తలుపుల్ని గూడ మూసుకని నిద్రపోవాలని. లేకపోతే మనసు పిచ్చి పిచ్చి కోర్కెల్ని కోరుతుంది.

కొన్ని నెలల క్రితం యిలాగే జరిగింది తను ఒక వ్యక్తిని గురించి ఆలోచించుకుంటూ కలలు కంటున్నాడు. ఆ క్షణంలో అదే వ్యక్తి అక్కడకి రావటం తటస్థించింది. కల యదార్థం కాబోయింది. కాని రవ్వంతలో తప్పిపోయి ఆ వ్యక్తి మాటలచే తన కనులు తెరిపి పడటం జరిగింది.....

తలుపు టక టక బాదుతున్న చప్పుడుకు వూహాల్లో నుండి తేరుకుని లేచి తలుపు తీశాడు క్రాంతికుమార్. ఎదురుగా అరుణ. క్రాంతికుమార్ విస్తుపోయాడు. ఏమిటిది? అరుణ ఎందుకు ఇలా వచ్చింది వచ్చింది.? అర్ధరాత్రి, ఏకాంతంగా వున్న స్త్రీ పురుషులు.... వెనుకటి అనుభవానికే సిగ్గుపడ్డ తనకు ఇప్పుడీ పరీక్ష ఏమిటి భగవాన్!

'ఏమిటలా నిల్చుండిపోయారు? నిద్ర రావటం లేదా?' అరుణ అడిగింది.

'ఊహూ'

'అవును మరి, ఎలా వస్తుంది' అరుణ నవ్వింది.

క్రాంతికుమార్ మాట్లాడకుండా నేల చూపులు చూస్తున్నాడు. అరుణ అక్కడ ఉన్న ఒక కుర్చీమీద కూర్చుంది. క్రాంతికుమార్ బిక్కు బిక్కుమంటూ చూశాడు ఇక్కడ జైగాయిస్తుం దేమిటా అని.

'ఏమిటలా భయం భయంగా చూస్తారు? మిమ్మల్నేమైనా మింగుతా ననుకున్నారా? అయినా మీకిలాంటి భయం పోవాలంటే వెంటనే మీ అమ్మగారికి ఒక కోడల్ని చూడాలి.' అన్నది అరుణ.

క్రాంతికుమార్‌కు నవ్వు వచ్చింది. అరుణకు చిన్నప్పటి పరిహాసధోరణి పోయింది కాదు అనుకుని 'ఏమిటి అరుణా నీ పరిహాసం' అన్నాడు.

'పరిహాసమా! పెళ్లి చేసుకోమని చెప్పటం పరిహాసమా' అంది.

'కాదనుకో. అయినా ఆ విషయాలన్నీ ఇప్పుడెందుకు?' అన్నాడు ఎటో చూస్తూ.

'అవసరం వచ్చింది గనుకనే. మీరు శారదను పెళ్లి చేసుకోవాలనుకోలేదూ?' అని సూటిగా ప్రశ్నించింది.

క్రాంతికుమార్ అప్రతిభుడైనాడు. తన నేరం బట్టబయలైన నేరస్థునిలా అరుణవేపు చూశాడు.



'హలో సార్! చూశానండీ! ఆ కథ మీవాడిదా? అద్భుతం! చాలా బావుంది!! ఇదిగో, అదే చదువుతున్నాను!... వచ్చే వారం వేసేస్తా...'

ఆ విషయం ఆమె కెలా తెలిసింది ? శారద చెప్పిందా? శారద చెప్పడానికి అవకాశం లేదే. అరుణ హాస్పిటలుకు వచ్చిన తక్షణమే శారద యింటికి వెళ్లింది. మూడు రోజులైనా మళ్లీ రాలేదు కూడా. 'మీ కెలా తెలుసు ?' అన్నాడు.

'ఇలాంటి విషయాలు ఆడవాళ్లకు మరొకరు చెప్పక్కర్లేదు. ఇట్టే కనిపెట్టేస్తారు' అంది అరుణ గర్వంగా.

నిజమేనేమో ననుకున్నాడు క్రాంతికుమార్ !

'నిజమేనా ?' అంది.

'నిజమే'

'మరి ఎందుకు చేసుకోలేదూ ?'

'ఆమె కిష్టం లేకపోయింది.'

'ఎందుకనో తెలుసుకున్నారా ?'

'చెప్పలేదు. బహుశః నేను తొందరపడి మొరటుగా ప్రవర్తించానేమో ననిపిస్తోంది. ఒకరోజు రాత్రి పది గంటల సమయం. నేను వరండాలో పడక్కుర్చీలో పండుకుని ఆలోచిస్తున్నాను. ఎవర్ని

# నీలి నీడలు

గురించో తెలుసా' అన్నాడు.

'నా గురించా' అరుణ నవ్వింది.

క్రాంతికుమార్ నవ్వుతూ 'కాదు. శారద గురించి. శారద నా మనసులో చోటు చేసుకుంది. వృత్తిరీత్యా ఆమె నా వద్దనే ఉంటున్నా, ధర్మరీత్యా ఆమెను నాదాన్నిగా చేసుకోవాలనుకున్నాను. అలా ఆలోచిస్తూ పడుకుని ఉంటే శారద వచ్చింది, తను అర్జంటుగా ఏదో వూరు వెళ్తున్నానని చెప్పటానికి, నా పర్సనల్ రూం తాళంచెవులు ఇచ్చి వెళ్ళటానికి. నా మనసులోని వూహాలు, కోర్కెలు ఆమెకు చెప్పి ఆమె ఆమోదాన్ని పొందుదా మనిపించింది. కాని, సంభాషణ ఎలా మొదలెట్టాలో తెలియలేదు. తాళంచెవులను అందించింది శారద. వాటిని నేను తీసుకోకుండానే—ఇప్పుడు నీ వుంటున్నావే——ఆ గదిలోని టేబులు పైన పెట్టమని చెప్పాను. శారద గదిలోకి వెళ్ళి వాటిని అక్కడ పెట్టుంటే నేను కూడ ఆ గదిలోకి వెళ్ళి 'శారదా' అని పిల్చాను. శారద భయపడింది. ఒక మూలకు ఒదిగి నిల్చుని 'ఏమిటి డాక్టర్ ?' అంది.

'శారదా ! నీవు చాల తెలివైన దానివి. నే నెంతో మంది నర్సుల్ని చూశాను. కాని, అందరిలా కాకుండా ఏపనినైనా సూక్ష్మగ్రాహివై చేసుకపోతూ నా మెప్పుకు పాత్రురాలి వైనావు. అందుకనే నీకు ప్రొమోషను ఇద్దామనుకుంటున్నాను' అన్నాను. 'ఈ ఉద్యోగంలో ఇంతకంటే ప్రొమోషను ఏముంది ?' అంది శారద. 'ఈ ఉద్యోగంలో కాదు శారదా ! నిన్ను నా అర్ధాంగిగా చేసుకుంటాను' అన్నాను ఒక అడుగు ముందుకు వేస్తూ.

'డాక్టర్' అంటూ గర్జించింది శారద. 'మీ రింకా మంచివారని అపోహపడ్డాను. పెద్ద మనుష్యులని మోసపోయాను. మీ కిలాంటి బుద్ధిపుడుతుందని నేననుకోలేదు. ఒంటరి ఆడది కనుపిస్తే వెర్రి వెర్రి వేషాలు వేసే మీ జాతికి ఒక నమస్కారం. నాకీ ఉద్యోగమే వద్దు !' అంటూ వెళ్ళబోయింది. అప్పటికిగానీ నే నెంత తొందర పడిందీ తెలుసుకోలేక పోయాను. క్రాంతికుమార్‌గా కాకుండా ఒక డాక్టరుగా రత్నంలాంటి నర్సును పోగొట్టుకుంటున్నానని అర్ధమైంది. శారదను బ్రతిమలాడాను. మరెప్పుడూ అలా ప్రవర్తించనని మాట యిచ్చాను..... ఇప్పటికీ శారద అంటే ఒక విధమైన అభిమానం. ఆమె ఉంటే హాస్పిటల్లో నాకు సగం పని తగ్గుతుంది. అంత తెలివిగలది ఆమె' క్రాంతికుమార్ చెప్పడం ముగించాడు. అరుణ నిట్టూర్చింది.

కొంతసేపటికి ముఖంమీద నవ్వు తెచ్చిపెట్టుకుంటూ 'ఒంటరిగా ఆడది మీ ఇంటికి వస్తే మీరు చేసే మర్యాద ఇదే నన్నమాట' అంది.

అరుణనేసు ఒకసారి చూచి తల వంచుకున్నాడు, క్రాంతికుమార్. అరుణ అలా ఎందు కన్నదో అతనికి అంతుబట్టలేదు. సిగ్గుతో కుంచించుకపోయాడు!

అరుణ లేచింది. తలుపుదాకా వెళ్ళి, మళ్ళీ వెనక్కు తిరిగి 'చూశారా వచ్చిన పని మర్చిపోయి ఏవేవో మాట్లాడి వెళ్తున్నాను ? .... శ్రమ అనుకోకుండా నాకో చిన్న సహాయం చేస్తారూ, నాతో పాటు కొంచెం పోస్టాఫీసుదాకా వస్తారా ?' అంది.

'ఇప్పుడా ? అర్ధరాత్రి .... పోస్టాఫీసుకా ?' ఆశ్చర్యంగా ప్రశ్నించాడు.

'అవును. ఇప్పుడే. అర్జంటుగా మావారితో ట్రంక్‌ఫోన్‌లో మాట్లాడాలి. వారు ఇంటిదగ్గర ఉండేది ఈ సమయంలోనే' అంది.

క్రాంతికుమార్ అమ్మను లేపి తాము పోస్టాఫీసుకు వెళ్తున్నట్లు చెప్పి పాపను, పసివాడ్ని కనిపెట్టి ఉండమని అరుణతో బయటకు నడిచాడు.

అనంతపూర్‌కు లైన్ దొరకటం ఆలశ్యమైంది. రాత్రివూట అర్ధఛార్జియే గదా అని ఎక్కువమంది ట్రంక్ ఫోన్ చేయడానికి రాత్రి వూట వస్తూంటారు. అందువల్ల మూడింటికి గాని లైను దొరకలేదు. అరుణ ట్రంక్ ఫోన్‌లో మాట్లాడింది. ఆ మూడు నిమిషాల్లో ఎన్నో విషయాలు మాట్లాడింది. చివరకు పాప దాని అన్నయ్యకోసం బెంగ పెట్టుకుందని వెంటనే క్రాంతిని తీసుకుని బయలుదేరమని చెప్పింది. భర్తనుండి వస్తానని సమాధానం వచ్చినట్లుంది. అరుణ ముఖం వికసించటం క్రాంతికుమార్ గమనించాడు.

వెన్నెల, మంచు ఒకదాని కొకటి పోటీలుపడి కురుస్తున్నై. వెన్నెల అరుణమీద పడి ఆమె సోయగాన్ని తనివితీర త్రాగుతోంది. వెన్నెలతోపాటు చల్లగా ఉన్న మంచు వింత వాసనల్ని కల్గిస్తూ మత్తెక్కిస్తోంది. క్రాంతికుమార్‌లో ఏవేవో భావాలు చెలరేగాయి. ముందు నడుస్తున్న అరుణ భుజంపై చేయివేసి ఆపి 'అరుణా నినొక్క విషయం అడుగుతాను నిజం చెప్తావా ?' అన్నాడు క్రాంతికుమార్.

'ఏమిటది' అంది తన భుజంమీద అతని చెయ్యిని తీసివేస్తూ.

'నిన్ను వివాహం చేసుకోలేకపోయినందుకు నా కిప్పుడెంతో విచారంగా ఉంది. ఫారిన్ వెళ్లే ముందు మీ నాన్న కోరినట్లు నిన్ను పెళ్లి చేసుకుని మరీ వెళ్తే బావుండేదేమో. నావల్ల నీ జీవితం కూడ అనుకోని మలుపు తిరిగింది. నీవేం సుఖపడుతున్నావో !' అన్నాడు.

అరుణ కొద్ది క్షణాలు అతని కళ్ళల్లోకి చూసి 'నిద్ర మేల్కొంటంవల్ల, ఫారిన్ రిటర్న్‌డ్ డాక్టరుగారికి కొంచెం చైత్యం చేసినట్లుందే. లేకపోతే నేను సుఖపడకపోవట మేమిటి ? నాకేం లోటని ? హుం' అని గొల్లున నవ్వింది.

క్రాంతికుమార్ చిన్నబుచ్చుకుని ముందు నడుస్తున్న అరుణతోపాటు నడక సాగించాడు. ఆడవాళ్ల మనస్తత్వంమీద బ్రహ్మాండమైన థీసిస్ రాసిన ఒకానొక వ్యక్తి చివరకి, ఒక చిన్న విషయాన్ని అర్ధంచేసుకోలేక ఆడవారి మనసు అగాధం అని, వారిని గురించి తనకేమీ తెలీదని ఒప్పుకున్నాడుట ఒక కథలో. ఆ కథలో ఎంతో సహజత్వం ఉందని ఇప్పు డనిపించింది క్రాంతికుమార్‌కు.

తెల్లవారిందో లేదో, ఏదో గోల విన్పించి మెలుకువ వచ్చింది క్రాంతికుమార్‌కు. బద్ధకంగా లేచి కూర్చున్నాడు. ఎన్నో రోజులనుండి నిద్రలేనట్లు కళ్ళు మెర మెరలాడుతున్నై. తల బరువుగా ఉంది. మెల్లగా లేచి గది బయటకు వచ్చాడు. అరుణ ఏడ్పు వినవస్తోంది. అప్పుడప్పుడూ సీతాపతిగారి గొంతు కూడ విన్పిస్తోంది. కంగారుగా వరండాలోకి వచ్చాడు క్రాంతికుమార్.

'రమణు క్షమించమని చెప్పరా' అంటి ఆమె కళ్ళనొత్తుకుంటూ.

'క్షమించకపోవటమేమిటి? ఎక్కడికి వెళ్ళాడు? ఎందుకు మీరంతా ఏడ్వటం?'' కొంచెం కఠినంగానే అన్నాడు క్రాంతికుమార్, వాళ్ళంతా అనవసరంగా గలభా చేస్తున్నారేమోనని.

సీతాపతిగారు ఒక ఉత్తరం అందించాడు. క్రాంతి కుమార్ గబగబా చదవటం మొదలెట్టాడు.

'మిస్టర్ కుమార్! నే నీవిధంగా అంతర్ధానం కావటం మీకు ఆశ్చర్యరావ్చే కల్గించవచ్చు. కాని నాకు తెలుసు నేనిక ఇక్కడ ఉంటటం నిష్ప్రయోజన మని. మీరు ఎంతగా దాచాలనుకున్నా నన్ను గురించిన మీ కబవరాన్ని నే గమనించక పోలేదు. నేను ముందుగనే చెప్పాను నాజబ్బు నయం కాదని. మీరు పడే శ్రమమంతా వృథా అని. ఆ సంగతి మీకూ తెలుసు. తెలిసికూడా నాకు తెలుపకపోవటంలో మీ తప్పులేదు. డాక్టరుగా అది మీ విధి. కాని మృత్యువు నాకు అతి సమీపంలో ఉందని తెలుసుకున్న నేను హాస్పిటల్లోని బెడ్‌కు అంటిపెట్టుకుని ఉండలేక పోయాను. కారణం నేను చనిపోయే ముందు చేయవలసిన ముఖ్యమైన పనులు రెండు ఉన్నై. ఒకటి మిమ్మల్ని క్షమాపణ కోరటం. ముఖాముఖిగా మిమ్మల్ని క్షమాపణ కోరే ధైర్యం లేకపోయింది నాకు. ఎలా ఉంటుంది మరి? నావల్ల మీకుటుంబంలోని వ్యక్తులు తీరని నష్టాన్నే పొందారు. రమను వివాహం చేసుకోమని నన్ను నీవు అడిగినప్పుడు నా సమాధానం మీకు ఎంతో బాధను కల్గించిందని నాకు తెలుసు. కాని నాలోని ఏదో దుష్టశక్తి నానుండి ఆ సమాధానాన్ని చెప్పించింది. అంతేగాకుండా నిన్నే చేసుకోవాలనుకున్న అరుణకు మరో సంబంధం మాట్లాడాను. ప్రమాద వశాత్తు రమకు కల్గిన ఆ అవిటితనం చూచి నా మనసు మార్చుకుని మీ ముగ్గురి ఆశాశిధాల్ని మట్టిపాలు చేశాను అంతకంటే ఎక్కువైన అందవిహీనత నా జీవితంలో ఎదురైంది నాకు. కాని అప్పటికీ తెలియలేదు అది నాకు శిక్ష అని. మశూచికంలో నా భార్య రూపు మారిపోయి అంద విహీనంగా తయారుకావటంతో ఆమెను తిరస్కరించి పుట్టింటికి బలవంతంగా నెడలగొట్టాను. ఇంతకంటే క్రూరమైన, దారుణమైన విషయం ఉంటుందా? ఇంత ఘోరం చేసిన నాకు నిష్కృతి ఉందా? నన్ను క్షమించమని నా భార్యను కోరే హక్కు ఉందా నాకు? లేదు. నేనంతటి అదృష్టానికి తగను. కాని ఆమె క్షమా మూర్తి నన్ను క్షమిస్తుంది. నా నుండి ఏ సుఖాన్నీ పొందకపోయినా నా యీ చివరి కోర్కెను తీర్చి నాకు శాశ్వత సుఖాన్ని సంతృప్తిని కల్గించ గలదు. అందుకే వెళ్తున్నాను. నాన్నకు, మీ అందరకు నాకడసారి నమస్కారాలు — అభాగ్యుడు రఘు.''

క్రాంతికుమార్ కళ్ళనుండి రెండు కన్నీటి బొట్లు టప టప రాలాయి. ఏమీ మాట్లాడలేక ఆలోచిస్తూ నిల్చుండిపోయాడు అతని కళ్ళు ఆశ్చర్యాన్ని కల్గించినవి.

'ఇంత జరిగిం తర్వాత ఇంకా నీవు క్షమించటానికి ఆవిడ అక్కడుంటుందనే నీకి భ్రమ.'

'ఏమిటమ్మా అరుణా నీమాట? మీ వదిన పుట్టింటింటిలో ఉండటం లేదా ఇప్పుడు?' అన్నారు సీతాపతిగారు ఆశ్చర్యంగా.

'లేదు నాన్నా. ఆవిడ ఈ ఊళ్ళోనే ఉంది.'

'ఈ ఊళ్ళోనా!?' క్రాంతికుమార్ ప్రశ్నించాడు. సీతాపతిగారి కళ్ళు పెద్దవి చేశారు.

'అవును ఈ ఊళ్ళోనే. మిమ్మల్ని చూడగానే ఇంటిదగ్గర ఏదో పని ఉందని వెళ్ళి, మళ్ళీ తిరిగి రాని మీ శారదే మా వదినె' అంది అరుణ క్రాంతికుమార్ వైపు చూస్తూ.

వరండా నిండా ఆశ్చర్యం అలుముకుంది. ★

---

# జన్మదినఫలం

## 31 వ పేజీ తరువాయి

వృత్తి వ్యాపారాలలో పెద్ద మార్పులు ఉండవు. అంతా యథాతథంగా జరిగిపోతుంది. ఉద్యోగంలో కొన్ని చికాకులు వచ్చినా స్నేహితుల తోడ్పాటువల్ల మీకు నష్టమేమీ రాదు. అధికారుల వలన జరుగవలసిన పనులు చాలా శ్రమ మీద నెరవేరుతాయి. గృహ నిర్మాణ యత్నాలు వాయిదా వేయడం మంచిది. కుటుంబ పరిస్థితి సంతృప్తికరంగా ఉంటుంది. సంతానానికి సౌఖ్యం సంతోషం లభిస్తాయి. పెద్ద ప్రయాణాలు చేయవలసి వస్తుంది కాని వాటివల్ల అంతగా ప్రయోజనము కలగదు. విద్యా వైజ్ఞానిక రంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. పుణ్యకార్యాలు నెరవేరుతాయి. విద్యార్థులు కష్టం మీద కృతార్థులవుతారు.

## ఏప్రిల్ 14

ఈ సంవత్సరం సామాన్యంగా ఉంటుంది. వ్యాపారాల్లో అభివృద్ధికి అవకాశము ఉండదు. కాని మీ ప్రజ్ఞ వల్ల, ఉపాయము వల్ల స్వల్ప అభివృద్ధిని సాధిస్తారు. మీ ఆలోచనలు ఇతరుల విషయంలో బాగా పనిచేస్తాయి. స్నేహితుల పనిమీద కొంత శ్రమ పొందవలసి వస్తుంది. అధికారులతో పరిచయం లభిస్తుంది. కాని దానివల్ల ప్రస్తుతం యేమీ ప్రయోజనము ఉండదు. స్థిరాస్థి వ్యవహారాల్లో అనుకూలత లభిస్తుంది. సాహసపూరితమైన వ్యవహారాల్లో లాభించదు. శుభకార్యాల విషయంలో ఇదివరకు ఉన్న అడ్డంకులు తొలగిపోతాయి. వస్త్రాలంకార వస్తువులు కొంటారు. ఆర్థికంగా సామాన్యంగా ఉంటుంది కాని మిగిలిన అన్ని వ్యవహారాలూ సంతృప్తికరంగా ఉంటాయి. సాంఘికంగా నూతన గౌరవం, ఖ్యాతి లభిస్తాయి.

## ఏప్రిల్ 15

వృత్తి వ్యాపారాల్లో అనుకూలత ఉంటుంది కాని ఆరోగ్య విషయం మాత్రం సంతృప్తిగా ఉండదు. మీ ప్రయత్నం లేకుండా ఆరోగ్యం దెబ్బతింటుంది. మీ ప్రయత్నం అంతా లేకుండానే ఉద్యోగంలో మంచి మార్పులు వస్తాయి. వ్యాపారంలోను మీకు తగిన ఆలోచనలు కలుగుతాయి గాని వాటిని అమలు జరపడానికి అవకాశాలు దొరకక చిరాకు కలుగుతుంది. కుటుంబ సంతోషం లభిస్తుంది. బంధువులు అవసరానికి తోడ్పడగల్గుతారు. సాంఘిక వ్యవహారాల్లో చురుకుగా పాల్గొనడంవల్ల శ్రమ తప్ప మీరేమీ సాధించేదేమీ ఉండదు. విద్యార్థులు మొదటినుంచీ కష్టపడి చదువవలసి ఉంటుంది. న్యాయవాదులకు, అలంకారవస్తు వ్యాపారులకు అనుకూల కాలం. నవంబరు, డిశంబరు నెలల్లో ప్రయాణాలు.

## ఏప్రిల్ 16

ఈ సంవత్సరం ప్రారంభంలో సామాన్యంగా ఉన్నా రానురాను ప్రోత్సాహకరంగా ఉంటుంది. ఉద్యోగస్థులు అనుకూలమైన స్థానములకు మార్చబడతారు. వ్యాపారస్థులు నూతన వ్యాపారాల్లో పాల్గొంటారు. సంవత్సరం మధ్యనుంచి ఆదాయం పెరుగుతుంది. ఖర్చుకూడా పెరుగుతుంది. మీతో తిరుగుతూ మిమ్మల్ని మోసగించాలని ప్రయత్నం చేసే వారితో వ్యవహరించవలసి వస్తుంది. ఆరోగ్యం బాగా ఉంటుంది గాని కాలడం, జారి పడటం వంటి ప్రమాదాలు సంభవించవచ్చును. విలువైన వస్తువులను కోల్పోయే సూచనలు ఉన్నాయి. బంధువులతో చిన్నచిన్న ప్రయాణాలు వస్తాయి. నిదానంగా వ్యవహరించడం అవసరం. విద్యార్థులు మంచి మార్కులతో కృతార్థులు కాగలరు. వ్యవసాయదారులకు, ఆహార పదార్థ వ్యాపారస్థులకు మంచి సమయం. ★



''యువర్ ఆనర్! నన్ను ఇరవై ఏళ్ళనుండి అనేక కేసులలో మీరు మోసినట్లు చెబుతున్న మూలంగా... మీకు ఈ ఇరవై ఏళ్ళలో ఏ విధమైన ప్రమోషన్ రాలేదని తెలిసిపోయింది...!''

# రామచరిత మానస్

తులసీదాసు



తెలుగు ముంగర శంకరరాజు

## 26

—'ఓ భవానీ ! శ్రీరాముడు చరాచర జగత్తుకు స్వామి. అతని దివ్యలీలలు గ్రహించుట బహు దుస్తరము. స్వామి సోదరుడు సంగర భూమిలో మూర్ఛాగతుడై పడి యుండెను ! అని ఈ సందర్భమున నాగ భూషణుడు నగ తనయతో పలికెను.

మూర్ఛితుడై పడియున్న లక్ష్మణమూర్తిని ఆంజనేయుడు యుద్ధభూమి నుండి తెచ్చి అవధేశుని యెదుట బెట్టెను.

### హనుమంతుడు సంజీవికై ప్రయనించుట

శక్తి ప్రయోగము వలన తెలివిని గోలుపోయి, నెత్తుట దోగుచూ నేలబడి యున్న సోదరుని గురించి సాకేత నాథుడు— "హా లక్ష్మణా ! శత్రు నిహతుడవై ధరా తలంబున కొరిగితివా! అనుజా, నీవు లేకున్న ఇక నాకీ లోకము ఎందుకు?" అని ఆర్త స్వరంబున దుఃఖదీనుడై హృదయ విదారకముగా విలపించ సాగెను. జాంబవంతుడంత దాశరధిని సమీపించి— "ప్రభూ ! ఈ స్వల్పమునకై మీరిట్లు దిగులుగొని, ధైర్యము విడనాడుట కిది సమయము గాదు. లంకలో సుషేణుడను ప్రసిద్ధ వ్రణ వైద్యుడున్నాడు. తక్షణమే వానిని రప్పించుటకు యత్నించ వలసి వది." అని సలహా ఇచ్చెను.

వాయుపుత్రుడు స్వామి సమ్మతి తెలుసుకొని తక్షణమే సూక్ష్మ రూపియై లంక లోనికి పోయెను. అతడు నిముసములో సుషేణుని వాని గృహముతో సహా తీసుకొని వచ్చి రాముని సన్నిధి నుంచెను. సుషేణుడు నత శిరస్కుడై నరపతి యెదుట నిలచి— "సౌమ్యా ! హిమవత్పర్వ ప్రాంతమున ద్రోణగిరికి సమీప మందున్న సంజీవి కొండను దెచ్చిన యెడల సోదరుడు సజీవుడగు" నని సూచించెను.

అంతట సీతాపతి ఆంజనేయునివంక తిరిగి— "లక్ష్యవ్రతా ! ఆంజనేయా !! శీఘ్రగామివై చని సంజీవిని సాధించుకొని వచ్చి సోదరుని సంరక్షింపుము — " అని ఆదేశించెను. హనుమంతుడాక్షణమందే స్వామిచరణములకు నమస్కరించి, ప్రభు కార్యోత్సాహితుడై పైకెగసెను. వాయుపుత్రు డట్లు వియన్మార్గము చేరుకుని వాయువేగ మనో వేగంబున ఉత్తరాభిముఖుడై పయనించెను.

### కాలనేమి గాథ

హనుమంతుని గమన వృత్తాంతము చారుల వలన తెలుసుకొని రావణుడు ఈర్ష్య పడెను. వాడంతట దురుద్దేశా పీడితుడై కాలనేమి యను రక్కసుని వద్దకు వెళ్ళి పవనాత్మజుని ప్రయత్నము యెవ్విధముగానైననూ భగ్నము చేయ వలసినదని వానిని కోరెను. కాలనేమి రావణుని కుత్సితబుద్ధికొకింత చింతించి ఇట్లనెను —

" అహంకార మమతా మదత్యాగూ,
మహామోహనిసి సోవత జాగూ,
కాలవ్యాల కర భచ్ఛక జోయీ,
సపనెహు సమర కి జీతియ సోయీ?"

" రాక్షసరాజా ! రామకార్యార్థియై పోవుచున్న హనుమంతుని ప్రయత్నమునకు విఘాతము కలిగించుట అసాధ్యము. నీవింకనూ మోహాంధకారమున మునిగి యున్నావు. రావణా ! కాల సర్పమును సైతము భక్షించగల ఆకుక్షింభరుని నీవు కలలో కూడా జయించలేవు. మమతాహంకారములను వర్జించి ఇప్పటికైనా జాగ్రుతుడవై కండ్లు తెరుచుకొనుము."

ఎవరెంత బోధించిననూ మూర్ఖుని మనసు మార్పించలేరు. లంకేశ్వరుడు కాలనేమి హిత బోధను గూడా ధిక్కరించెను. 'దుష్టునికి ఆగ్రహము కలిగించి వానిచేతులోనే నెందుకు దుర్మరణము చెందవలెను !' అని వూహించుకొని కాలనేమి తుదకు దశాననుని ఇచ్ఛానువర్తియై, అక్కడ నుండి బయలుదేరెను.

కాలనేమి మాయావి. వాడు మారుతి గమించు మార్గ మందొకచోట అందమైన జలాశయ మొకటి కల్పించెను. ఆ సరోవరతీరమున చక్కని ఆశ్రమ మొకటి సృష్టించుకొని, దానిలో వాడు కుహనాముని వేషముతో ధ్యానమగ్నుడై కూర్చుండెను.

మార్గశ్రాంతుడై యున్న మారుతికి ఆశ్రమము చూడగనే అందొకింత విశ్రమింపబుద్ధి పొడమెను. హనుమంతుడు కుహనామునిని సమీపించి — స్వామీ ! దాహమగుచున్నది. కొంచెము జల మిప్పింపుడు — అని నమస్కారపూర్వకముగా అర్థించెను. దొంగసాధువు రామనామస్మరణ చేయుచూ నిమీలిత నేత్రుడై — " ఓయీ ! నీవు అంజనీ పుత్రునివి కదా ! సౌమిత్రిని జీవింప జేయుటకై సంజీవిపర్వతమునకు వెళ్ళుచుంటివి. మీ రామునకు తప్పక జయము సిద్ధించును. జ్ఞానదృష్టితో నేనంతయూ గమనించ గలిగితిని. మంచిది ఇదిగో, అక్కడ కనబడుచున్న కొలనుకు పోయి దాహము తీర్చుకొని శుచివై తిరిగిరమ్ము, నేను నీకు జ్ఞానముపదేశించెదను —" అని పలికెను.

కాలనేమి చెప్పిన ప్రకారము ఆంజనేయుడు సరోవరము చెంతకు వెళ్ళెను. అతడు కొలనులో కాలు బెట్టగనే ఒక ఆడు మొసలి అతని కాలు గట్టిగ పట్టుకొని లోనికీడ్చెను. ఆ సంఘటనకు మహావీరుడు మండిపడి ఒక్క ముష్టిఘాతముచే మకరికి మృత్యులోకము చూపించెను. ఆంజనేయుని చేతిలో అసువులు బాసిన ఆ జల చర మంతట ఒక దివ్యాంగనగా మారి మారుతికి ప్రణమిల్లి ఇట్లు పలికెను —

" ఓకపిసత్తమా ! నేటికి మీదర్శన భాగ్యముచే నాకు శాపవిమోచనము కల్గెను. మహాత్మా ! పూర్వజన్మలో నేనూ కాలనేమి గంధర్వులము. మేమొకప్పుడు ఇంద్రుని సభలో గానము చేయుచుండి దుర్వాసుని పరిహసించితిమి. ఆ మహర్షి మా తుంటరితనమునకు కుపితుడై మమ్ము రాక్షసులై పుట్టుడని శపించెను. పిమ్మట మా ప్రార్థనలకు కొంచెము శాంతించి — ఓరీ ! మీరు దనుజులై లంకలో జన్మించెదరు. త్రేతాయుగమున రామరావణులకు యుద్ధము జరుగును. అప్పుడు సంజీవి పర్వతమును దెచ్చుటకై పోవుచుండు ఆంజనేయుని వలన మీకు శాపవిమోచనము కలుగును — అని సెలవిచ్చి యుండెను. అంజనేయా! ఆశ్రమములో ఋషి వేషముతో నున్నవాడే కాలనేమి జాగ్రత్త !" అని తన పూర్వవృత్తాంత మంతయు తెలియజేసి గంధర్వాంగన ఆకాశ మార్గమును బట్టి తన లోకమునకు పోయెను.

హనుమంతు డచటి నుండి ఆశ్రమములోనున్న కుహనామునిని సమీపించి — " ఓ మునీశ్వరా ! ఇదిగో ముందు నాగురుదక్షిణ స్వీకరించి పిమ్మట నాకు జ్ఞానోపదేశము చేయవలసినది — " అని పలికి, ఆ ధూర్తుని తన వాలమునకు చుట్టి, నేలకేసి కొట్టి, ఒక్కదెబ్బకు హతమార్చెను. కాలనేమి రాముని స్మరించుచూ అతని చేతిలో ప్రాణములు వదిలెను.

### ఆంజనేయుడు సంజీవిని తీసుకొని ఆయోధ్యామార్గమున వచ్చుట

అనిల పుత్రుడట్లు నిరపాయుడై అచటి

నుండి హొటాహుటి హిమాద్రి చేరుకొనెను. అక్కడ ద్రోణాద్రి చెంత సుషేణుడు చెప్పిన ఔషధులను వెతుకసాగెను. ఎంత శోధించినను ఆ మూలిక లభించలేదు. ఓషధులను ప్రత్యక్షము కావలసినదిగా పవనసుతుడు ప్రార్థించినప్పటికీ ఫలితము లేక పోయెను. వాటి జడ స్వభావమునకు మహావీరుడు మండిపడి, సంజీవి పర్వతమునే సమూలముగా పెకిలించి చేతబూని వెనుదిరిగి వాయుమార్గమున పయనించెను.

అట్లు సంజీవి పర్వతముతో తిరిగి వచ్చుచున్న కపిసత్తముడు మార్గమున అయోధ్యను సమీపించెను. ఆ రాత్రివేళ పైనుండి అయోధ్యను దర్శించి నపుడు పవనసుతుడు పులకిత శరీరుడయ్యెను. అప్పుడు భరతుడు గగన పథమున కదలిపోవుచున్న పర్వతచ్ఛాయను కనుగొనెను. ఓహో ! ఈ నిశివేళ యెవ్వడో నిశాచరుడు పయనించు చున్నాడు. అని భావించి భరతుడు వెంటనే ఒక బాణము గురిపెట్టి ఆటు వైపు వదిలిపెట్టెను. ఆ బాణాని కి హనుమంతుడు హా రామా ! యని ఆక్రందించి నేల కూలెను.

రామ స్మరణతో నేలబడిన రామదూతను గుర్తించి భరతుడు బాధపడెను. ఆంజనేయుని లేపుటకు పలువిధముల ప్రయత్నించి అతడు విఫల మనోరథుడై విలపించెను. — "అన్నను అడవులకు బట్టించితిని, నేడతనికి సహాయ భూతుడగు సేవకుని సంహరించితిని. నేనెంత పాపాత్ముడను —" అని తలపోసి కైక తనయుడు దుఃఖాక్రాంతుడై గుండెలు బాదుకొని రోదించెను. తుదకు అతడు ధైర్య మవలంబించి — త్రికరణ శుద్ధిగా నేను శ్రీరాముని సేవించుచుండిన యెడల మారుతి శీఘ్రమే మూర్ఛనుండి తేరుకొనుగాక — అని ప్రతిజ్ఞ చేసెను. ఆ క్షణమే ఆంజనేయుడు రామస్మరణ చేయుచూ పైకి లేచి కూర్చుండెను.

భరతుడు పులకిత గాత్రుడై కన్నుల ఆనంద బాష్పములు దొరలుచుండ పవనాత్మజుని కౌగలించుకొని "— ఆంజనేయా ! అన్న క్షేమమా ! వదినెకు కుశలమా !! తమ్ముడు సుఖముగా నున్నాడా !!! " అని ఆత్రముతో అడిగెను.

హనుమంతుడు భరతునకు, శత్రుఘ్నునకు, మువ్వురు రాణులకు, వసిష్టునికి, మంత్రి ప్రముఖులకు జరిగిన సమాచార మంతయు సంక్షిప్తముగ తెలియజేసెను. కౌసల్యా కైక సుమిత్రలు సీతా రామ లక్ష్మణులు విపద్గ్రస్తులై యున్నారని విని శోకార్తులై కన్నీరుమున్నీరుగా యేడ్చిరి. శత్రుఘ్ను డాగ్రహము చెంది శరచాపములు చేబూని సోదరులకు సహాయ మొనర్చుటకై సంసిద్ధుడాయెను. భరతుడు ప్రారబ్ధ కర్మగతిని గురించి విచారించెను. ఇట్లు విచారమగ్నులై దుఃఖించు చున్న భరతాదులకు రామదూత ధైర్యోక్తులు పలికి, సీతారామ లక్ష్మణులు శీఘ్ర కాలములోనే విజయశ్రీతో అయోధ్యకు రాగలరని ఆశ్వాసించెను.

తదువరి భరతుడు వానర వీరునితో — "ఆంజనేయా ! ఇది విలంబనకు సమయము కాదు. నీవు ప్రాతః పూర్వమే అక్కడకు చేరుకొనని యెడల ప్రయత్న మంతయు వ్యర్థమగును. నీవు పర్వత సమేతముగా నా బాణముపై కూర్చుండుము, నిముసములో లంక చేర్చెదను." అని చెప్పెను. — ఓహో ! నాకంటే యితని బాణ మెంత వేగముగా పోగలదో — యని తనలో అనుకొని మారుతి మందస్మితు డయ్యెను. తదుపరి వానర మూర్తి భరతాదులకు నమస్కరించి, వారివద్ద సెలవు తీసుకొని, నింగికెగసి, రామబాణము వలె ధృతగతిని ప్రయాణము సాగించెను.

## రాముడు లక్ష్మణునికై విలపించుట

అక్కడ లంకలో, మూర్ఛాగతుడై యున్న సౌమిత్రిచెంత కూర్చొని రామాదులు రాత్రంతయు జాగరణ చేయుచుండిరి. శోకార్ణవమున మునిగి దుఃఖించుచున్న వారి దైన్యస్థితి హృదయ విదారకముగా నుండెను.

"కపులారా ! అర్ధరాత్రము గతించెను. ఇంకనూ ఆంజనేయుడు రాలేదు. మహావీరుడు మార్గమందెప్పుడో ! లేక మరేదైనా ప్రమాదము నెదుర్కొనెనో, తెలియ రాకున్నది." అని పలికి శ్రీరాముడు పొంగి వచ్చెడి దుఃఖము నాపుకొన లేక భోరున యేడ్చెను. అవధేశుడు అనుజుని శరీరముపై బడి హృదయ విదారకముగా ఇట్లు విలపించ సాగెను—

"తమ్ముడా లక్ష్మణమూర్తీ !
"సకహూ న దుఖిత దేఖిమోహి కావూ
బంధు సదాతవ మృదుల సుభావూ,
మమహిత లాగి తజవు పితుమాతా
సహెహు బిపిన హిమ ఆతప బాతా,
సొ హవు అవధ కహా ముహా లాయీ
నారి హేతు ప్రియ భాయిగంవాయీ,
బరు అపజ సహతా జగమాహీ
నారిహాని బిసేషఛతి నాహీ."

"సోదరా ! నీ మనస్సెంత మార్దవమైనది, నీ హృదయ మెంత సౌహార్దమైనది. నా నిమిత్తమై తల్లి దండ్రులను విడనాడితివి, నీడ వలె నిరంతరము నన్ను సరించి కానన సంచారివై నానా బాధలు నాతో పంచుకొంటివి. నాకు రవంత కష్టము కలుగుట కూడ చూడజాలని నీ బంధు స్వభావమెంత లోకోత్తరమైనది ! అనుజా నే జేసిన అపరాధమేమి ! నాతో యెందుకు మాట్లాడకున్నావు ! దుస్సహమైన ఈ మౌనము చాలించి ప్రియమార అన్నాయని ఒక్కమారు పిలువుము. కటా ! ఈ దుఃఖము నుండి నన్నే దార్చు వారెవరు ? సుతులు సతులు మిత్రులు వచ్చుచుందురు పోవుచుందురు, కానీ సోదరులు లభించుట దుష్కరము కదా ! సోదర వియోగము కలుగునని తెలిసియుండిన ఈ వనములకే వచ్చి యుండక పితృ వచనములను పైతము తిరస్కరించియుంటునే ! లక్ష్మణా ! రాముడు సతి కొరకై సోదరుని పోగొట్టుకొనెను. అను లోకాపవాదము నెట్లు భరించగలను. సోదరుడు లేక నేనే ముఖముతో ఇంటికి పోగలను, అల్లులకేమని సమాధాన మివ్వగలను. అమ్మకు నీవు యేకైక పుత్రునివి. ఆమె నిన్ను నా కప్పగించి యుండెను. రామా ! సుమిత్రకు నేనేమని చెప్పగలను ! సోదరా ! అన్ని విధముల నిస్సహాయుడనై నిన్నా యున్న ఇక జీవించుట దుస్సహము !"

ఇట్లు ఆపన్న శరణ్యుడగు అవధేశుడు దుఃఖార్తుడై విలపించెను. రాముని హృదయా వేదనకు వానరుల గుండెలు కరిగి పొంగిపొర్లి పోయెను. ఓ అప్పా ! రామచంద్రుడు లీలా మానుషమూర్తి, తనకు భక్తుల యెడగల అపార అనురాగమును ఆవిర్భావముగ వ్యక్త పరచెను. అటు రాత్రి గతించుకొంది ఇటు రామాదులు మరింత ఆరాటపడ సాగిరి. ఇంతలో ఆంజనేయుడు సంజీవి పర్వతమును తీసుకొని రెండవ సూర్యునివలె తేజరిల్లుచూ వారి యెదుట ప్రత్యక్ష మాయెను. కరుణ రసముతో వీరరసమొచ్చి కలియనట్లు హనుమంతుని ఆగమనముతో రామాదులకు దైన్యము తగ్గి ధైర్య మేర్పడెను. రఘునాథు డానంద భరితుడై ఆంజనేయుని ఆలింగనము చేసి ఆనందాశ్రువులు రాల్చెను.

తదుపరి సుషేణుడు వెంటనే విశల్య సంధాని సౌవర్ణ— సంజీవి కరిణి యనెడు నాల్గు ఓషధులను తీసుకొని లక్ష్మణునికి వాసనచూపెను. అక్షణమే సౌమిత్రి నిద్రనుండి మేల్కొన్న వానివలె మూర్ఛవీడి పైకి లేచి కూర్చుండెను. రామ లక్ష్మణులు పట్టరాని సంతోషముతో పరస్పరము కౌగలించుకొని ఆనందాశ్రువులు రాల్చిరి. సంజీవి పర్వతము గాలిసోకగనే యుద్ధమందు విగత ప్రాణులై పడి యుండిన వానరులందరు సగల సజీవులైరి. తదుపరి మహావీరుడు సంజీవి కొండను యుదాస్థానమున చేర్చివచ్చి, సుషేణుని స్వగృహమున వదలి పెట్టెను.

ఇవ్విధముగ సంజీవి ప్రభావమున సౌమిత్రి స్వస్థుడాయెను. విగత జీవులై యుండిన వానరులందరు పునర్జీవితులైరి. కపిసైన్యము క్రొత్త బలము పుంజుకొని పునః సంఘటిత మయ్యెను. సుగ్రీవాధిష్ఠితమైన వనచర సేన మాతోత్సాహముతో విజృంభించి కిలారవములతో తిరిగి లంకపై దండెత్తెను. రాక్షసేశ్వరుడంత రాటు దేరిన రాత్రించర వీరులను వారి నెదుర్కొనుటకు ముందు కురికించెను. ఆ నాటి నుండి రామ రావణ సేనకు అనేక దినములు హోరాహోరి పోరాటము జరిగెను. మహాగ్రహోద్రగులై విజృంభించిన వానరసేనల ధాటికి నిశాచరులు నిలువజాలక నీల్గు చుండిరి. ధూమ్రాక్షుడు, అతికాయుడు, మకరాక్షుడు, కుంభనికుంభులు మొదలగు వీరాధి వీరులు తమతమ బలములతో ఒక్కొక్కరే వీర స్వర్గ మలంకరించిరి. వానర దళములు వీర విహారముచేసి విజయ పరంపరల చూరగొనిరి.

## రావణుడు కుంభకర్ణుని మేల్కొల్పుట

యోధాగ్రేసరులగు రక్షో వీరు లొక్కొక్కరే నిహతులగు చుండిరి. దిన దినమునకు స్వబలము క్షీణించి శత్రువులు పైకొనుచుండుట జూచి దనుజేశ్వరునికి దిగులు పుట్టెను. ఈ యాపత్సమయమున అసమానబలసంపన్నుడగు కుంభకర్ణుని సహాయ మపేక్షించుటకై రావణుడు నిశ్చయించెను. అప్పుడు నిద్రానుడై పడియున్న తమ్ముని మేల్కొల్పుటకు దశాననుడు భటుల నియోగించెను.

తన్నిమిత్తమై నియోగింపబడిన సేనాది భృత్యులు సకల సాధన సంపన్నులై కుంభకర్ణుని శయన మందిరమునకు చనిరి. యోజనాయత

రము విచ్చుకొనుట జూచి వెరగంది పారిపోయిరి.

అంతట దశాననుడు ముందుకు వచ్చి అంతకు మునుపే సిద్ధముగా ఉంచిన మాంసరాసులు, మద్యఘటములు, నెత్తుటి బానలు తమ్ముని నోట బోయించెను. మద్య మాంసములు చేబరి తృప్తుడై త్రేంపుచూ కుంభకర్ణుడు దశాననుని వైపు దృష్టి మరల్చి— "అన్నయ్యా అసురేశా! నన్నీ అకాలమున నిద్రనుండీ లేపుటకు కారణ మేమి? నీ వెందుల కట్లు విచార గ్రస్తుడవై కన్పట్టు చున్నావు?" అని ప్రశ్నించెను.

దశగ్రీవుడు తమ్మునికి జరిగిన వృత్తాంత మంతయూ శ్రుత పరచి — "సోదరా ధీరణధారా! యేమని చెప్పను! నరవానరులు విజృంభించి నిశాచర నగరమును నానా భీభత్సము చేయుచున్నారు. దుర్ముఖ— దేవశత్రు— అతికాయ— అకంపన— మహోదరాది మనవీర వరులను వానరులు పొట్ట బెట్టుకొనిరి. మహా కాయుడా! నీ వీర్య ధైర్యంబులు ప్రదర్శించి దానవ వంశమును రక్షించుటకు సమయ మాసన్నమైనది." అని ప్రబోధించెను.

సోదరుని వచనములకు ఇసుమంత విచారము ప్రకటించి కుంభకర్ణు డిట్లు బదులు పలికెను—

"అన్నయ్యా! జగజ్జనని జానకిని హరించి నారాయణుని నరునిగా, మహావీరుని మర్కట మాత్రునిగా భావించుచున్న నీ మంద బుద్ధిని నేనేమని ప్రశంసించ గలను! ఇంతకూ, కారణ జన్ములైన సీతారామ లక్ష్మణులతో కలహించి కొంపకు కొరివి బెట్టుకొంటివి. అగ్రజా! జరిగినదేదో ఇప్పటికే జరిగి పోయినది. ఇక గడచిన దానికి వగచి లాభములేదు. కానీ ఒక్క విషయమై నా మనస్సెందుకో మరింత బాధ పడుచున్నది. అది యేమన— లంకేశ్వరా! ఇంతకాలము బ్రతికినను నీవు శత్రువుల నెట్లు సాధింపవలెనో మిత్రులతో మైత్రి నెట్లు నెరపవలెనో ఇంకనూ తెలుసుకొన లేనందుకు విచారించుచున్నాను. లేకున్న ఆ నాడే, రామ లక్ష్మణులు అడవులలో నిస్సహాయులై తిరుగుచున్నపుడే వారినేల సంహరించక ఉపేక్షించితివి? స్నేహితుడగు వాలి సహాయము నీవానాడే అపేక్షించి యుండిన శత్రువుకు సహాయము తగ్గి యుండును కదా! అదియునూ గాక, శూర్పణఖ వచ్చి నీతో మొరపెట్టుకున్న నాడైనా శత్రు నిశ్శేషమునకై నీవు ప్రయత్నించి యుండిన కార్యమెంత సులభముగా సాధింప బడి యుండునో విచారించితివా! అదట్లుండ, రక్షః పురి రక్షణార్థమై నీవేమి శ్రద్ధ తీసుకొంటివి! లంక కుత్తర భాగమున సముద్ర తీరమందొక దుర్గము కట్టియుండిన యెడల యెంత కట్టుదిట్టముగా నుండెడిది! పగవాడు పారావారముపై బాటలు పరచుకొని నిర్భయముగా వచ్చియుండుటకు వీలు చిక్కియుండునా!

దనుజాధిపా! పరువు మర్యాదలు విడనాడి పౌరుష హీనుడవై పరస్త్రీని హరించుట యందు నీవు చూపెట్టిన నేర్పు శాత్రవు నెదురించుటలో ప్రదర్శించ జాలక పోరబడితివి. రావణా ఇక గత జలసేతు బంధనమునకై విచారించుట వలన ప్రయోజనము శూన్యము. దైవ నిర్ణయము తప్పింప రానిది. భూభార నివారణార్థమై భగవంతుడు భూలోకమున అవతరించుచున్నాడు — అని నారదు డానాడే నాతో చెప్పి యుండెను. నిద్రాగత ప్రాణుడగు నేను ఈ సంగతి నీతో చెప్పుటకే మరచితిని."

ఇట్లనేక విధముల ప్రసంగించి కుంభకర్ణుడు అన్నయ్య చేతగాని తనమునకు నొచ్చుకొనెను. పిమ్మటతడు తన ఆలోచన లన్నిటినీ కట్టిపెట్టి, తత్కాలమున తన వలన జరుగవలసిన కర్తవ్యము మనస్సుకు రాగా, తటాలున పైకిలేచి అగ్రజుని వైపు మరలి ఇట్లు ప్రతిజ్ఞా పూర్వకముగా పలికెను—

"లంకేశ్వరా! ఇదిగో నీ యాజ్ఞ. ఔదలదాల్చి ఇప్పుడే నేను సర్వసన్నద్ధుడనై యుద్ధరంగమునకు పోవుచున్నాను. రామునితో యుద్ధము కాబట్టి జయాపజయములు రెండునూ నాకు గౌరవ భాజనములే. అన్నయ్యా! శాత్రవ సంహారమునకై వెళ్ళుచుంటిని, నన్నొక్కమారు కౌగిలించుకొని వీడ్కోలు చెప్పు." అని పలికి కుంభకర్ణుడు తుదిసారిగా రావణుని కౌగిలించుకొని అక్కడ నుండి సెలవు తీసుకొనెను.

## కుంభకర్ణుని యుద్ధము

తదనంతర మా భీమ బలుడు బండ్లతో మాంసము కుండతో మద్యము తెప్పించి తనివితీర తినెను. ఆ మహాకాయుడు శాత్రవ భయంకరమైన తన శరీరమును పెద్దజేసి, రోషోదగ్రుడై కన్నులెఱ్ఱజేసి, నాలుక చాచి నాట్యము చేయుచూ కాలాంతకుడై కదనరంగమునకు కదలెను. అసంఖ్య రాక్షస సైన్యము సర్వసన్నిద్ధమై వాని ననుసరించెను.

కుంభకర్ణుడు యుద్ధమునకు వచ్చుచున్నాడని విభీషణునికి తెలిసెను. అతడన్నకు యెదురేగి, పాదములపై బడి నమస్కారము చేసి — "అన్నా కుంభకర్ణా! అసురేశుడు అహంకృతుడై నన్ను తిరస్కరించి కాలదన్నెను. నేను సాకేతధాముని శరణు జొచ్చి సుఖముగా నున్నాను." అని తెలియ జేసుకొనెను. కుంభకర్ణుడు తమ్ముని పైకి లేవనెత్తి ప్రేమతో—



'రండిసార్ రండి! నేనే వద్దామనుకుంటూంటే...మీరే వచ్చేశారే! నా మందు పన్జేసి...మీ మతిమరుపు తగ్గిపోయినట్టుందే!! ఆఫీసుకికూడా బయల్దేరారన్నమాట! ఆఁ...'

# రామచరిత మానస్

"విభీషణా! చింతించకుము, అగ్రజుడు కాల వశుడై హితాహితములు గుర్తించనేరక గర్వోద్ధతుడై యున్నాడు. నీవు విజ్ఞతలో రాఘవుని ఆశ్రయించుట రాక్షస జాతికి మేలయ్యెను. విభీషణా! నిర్విచారుడవై శ్రీరాముని సేవించుము. నేను మాత్రము సమరాంగణమున సాకేత నాథుని సంధించెదను." అని పలికి తమ్ముని పంపించి వేసెను.

విభీషణుడు వెళ్ళగానే కుంభకర్ణుడు భూమి దద్దరిల్లునటుల ఒక తన్నుతన్ని రణగర్జన చేసెను. రఘుపతి విభీషణుని వలన కుంభకర్ణుని చరిత్ర, వాని బలవీర్య ధైర్యపరాక్రమములాదిగా సవివరముగా తెలుసుకొనెను. పిమ్మట రఘూద్వహుడు కాకలు దీరిన కపివీరులతో సైన్యము సమాయత్తము చేసి దానవుని యెదుర్కొనుటకు నియోగించెను.

లోకభీకరుడగు రక్షోవీరుడు ఘన గర్జన చేయుచూ గదాహస్తుడై వైరి దళమునెదుర్కొనెను. వనచరులు శైలశృంగతరు సమూహంబులను వానిపై వర్షింప జేసిరి. అవి వానికి మదగజము మీద నూవు గింజలు చల్లినట్లుండెను. కుంభకర్ణుడు క్రోధసమావిష్టుడై నిప్పులు — గ్రక్కుచూ విజృంభించి యెదుట బడిన కపిపుంగవులను గదా ఘాతములచే యుచ్చపచ్చినట్లు మర్దించసాగెను. కొందరిని చేతులతో నలిపివేసెను, మరి కొందరిని క్రిందవేసి కాళ్ళతో త్రొక్కెను, నోటితో కొందరిని చప్పరించి మ్రింగి వేసెను. మోకాళ్లతో మోచేతులతో పిడికిట్లతో మోదుచూ వందల వందల వానర వీరులను కుప్పలు కుప్పలుగా కూల్చెను. దండధారునివలె ఉద్దండుడై విజృంభించిన ఆ భీకరాకారుని ఎదుర్కొనజాలక వనచర భల్లూక దళములు వెన్నిచ్చి పరుగులెత్తెను. సుగ్రీవ అంగద నలనీల హనుమంతాది యోధాగ్రేసరులు చెదరి పోవుచున్న సేనను తిరిగి కూడకట్టుకొని ద్విగుణీకృతోత్సాహులై మరల దనుజవీరుని తాకిరి. రావణానుజుడు మహోదగ్రుడై బిట్టార్చి గదను త్రిప్పుచూ కపిసేనపై బడెను. కాసారము జొచ్చిన గజరాజు వలె నిశాచర వీరుడు వైరి వీధుల వీరవిహారము చేసి శాత్రవ భయంకరుడై తేజరిల్లెను.

దనుజుడిట్లు దుర్వారుడై పరాక్రమించి తన వారిని ధర్షించుట గమనించి, మహా వీరుడు మహోగ్రుడై బిట్టార్చి కుంభకర్ణుని శరీరముపై పైకి దూకెను. మర్కట వీరుడు పిడికిటతో వాని వక్షస్థలమును తీవ్రముగా కొట్టి క్రింద పడవేసెను. క్రింద పడిన కుంభకర్ణుడు జివ్వున పైకిలేచి కుపితుడై ఒక్క ప్రతిఘాతముచే మహావీరుడు మూర్ఛా గతుడగునట్లు చేసెను. పిమ్మట వాడు ప్రళయ రుద్రునివలె ప్రకోపించి ప్లవంగ ప్రముఖులగు సుగ్రీవ అంగద నలనీలురపై కురికి ఒక్కొక్కరినే ప్రహరించి సమర భూమిపై సొమ్మసిల జేసెను. చండ ప్రచండుడై చమూపతులను చితుకగొట్టి, వైరివ్యూహమును చిందర వందరచేసి, మార్తాండుడై మంటలు గ్రక్కుచున్న కుంభకర్ణుని ధాటికి నిలువలేక కపిసేన కకావికలై దిక్కులు పట్టెను.

అంతట కుంభకర్ణుడు సంగరక్షోణి సంజ్ఞాహీనుడై పడియున్న కపిరాజు సుగ్రీవుని చంక బెట్టుకొని లంకాభిముఖుడై చనెను. అట్లు బంధితుడై కొంపోబడుచున్న సుగ్రీవునికి, దారిలో మూర్ఛ వీడెను. చటుక్కున ముష్కరుని ముక్కు చెవులు కొరికి వాని చంక నుండి జారుకొని సుగ్రీవుడు పైకెగసెను. అట్లు పట్టు తప్పించుకొని పైకెగిరిన సుగ్రీవుని కాళ్లు రెండు పట్టుకొని కుంభకర్ణుడు వానర వీరుని గిరగిర త్రిప్పి నేల, వేసి కొట్టెను. సుగ్రీవుడు స్ఫూర్తిమానుడై రివ్వున పైకెగిరి తన వారిని వచ్చి కలుసుకొనెను.

ప్లవంగవీరుడు పట్టు దప్పించుకొని తనను పరాభవించి పోయినందులకు కుంభకర్ణుడు కోపోద్రిక్తుడై రొప్పుచూ మరల యుద్ధ భూమికి మరలెను. అప్పటి వాని ఆగ్రహము వర్ణింప శక్యము గాదు—

"కుంభ కరన రనరంగ విరుద్ధా
సనముఖ చలాకాలు జనుక్రుద్ధా,
కోటికోటి కపిధరి ధరిఖాయా
జను టీడొగిరి గుహా సమాయా,".

కుంభకర్ణుడు క్రోధదుర్నిరీక్షణుడై కాలుని పగిది కపిసైన్యముపై బడెను. కంటబడిన వానరులను ఒడిసి పట్టి నోటవైచుకొని నమల సాగెను. కొండ గుహలో బడుమిడుతల దండు వలె కోటాను కోట్ల వానరులు వాని వదన గహ్వరమున బడికడుపులోనికి పోవుచుండిరి. ముక్కు చెవులు ఛేదింప బడుటచే రక్తసిక్తాంగుడై ఉగ్రరూపము దాల్చిన ఆలోక భయంకరుని దార్కొను ధైర్య సాహసములు లేక భల్లూక వానరములు భయాక్రాంతులై పరుగులెత్తెను. ఇంతలో లంక నుండి మరికొంత రక్కసి దండువచ్చి రక్షోవీరునికి తోడ్పడెను.

వైరి బలము విజృంభించి స్వబలము సన్నగిల్లుట శ్రీరాముడు గమనించ గలిగెను. శీఘ్రమే శ్రీపతి సుగ్రీవాంగద హనుమంతులను చెదరి పోవుచున్న స్వబలమును సమీకరించమని హెచ్చరించి, కోదండపాణియై కదన రంగమున కురికి స్వయముగ సురవైరి నెదుర్కొనెను. కోసల వీరుడు క్రోధోద్దీపితుడై శత్రు మూకలపై పుంఖాను పుంఖములుగా బాణజాలము గుప్పించెను. రామ ధనుర్ముక్త— ఘోర నారాచంబులు పక్షంబులున్న సర్పంబులకై వలె బుసలు కొట్టుచూ వైరి నివహంబుల దాకుచుండెను. ఆ శరపంపరాహతికి శాత్రవ సైన్యము వెరగంది వెనుకకు తగ్గెను. శరధారలకు రాక్షసుల శరీరములు ఖండ ఖండములై తెగి పడెను. లక్షలక్షల రక్షోవీరులు యెక్కడి వారక్కడ క్షత నిహతులై భూమిపై దొర్లాడిరి. అప్రతి హతములగు రామ బాణములు శత్రు సంహారముచేసి తిరిగి వచ్చి ప్రభువు అంబుల పొది చేరుచుండెను. క్షణ కాలములో రణక్షోణి శత్రునిశ్శేషమయ్యెను. (సశేషం)

"అట్లాగా, జీవితానికి ఆత్మ, మనస్సు అందమూ మాత్రమే ప్రధానం కావని ఈ రోజున తెల్సుకున్నాను. గృహస్థ జీవితం గడపటానికి అనేక విషయాలు ఆచరణలో ఉంచుకోవాలి. అనేక సాంఘిక కట్టుబాట్లకు లొంగి ఎవ్వరి మనస్సూ నొప్పించకుండా, ఎవ్వరినీ అవహేళన చెయ్యకుండా జీవిత మార్గాన్ని పూలబాటగా మలచుకోవాలి. ఇలాంటి గౌరవనీయమైన గార్హ్యస్థ జీవితం గడపటంలో మీకు అన్ని విధాలా చేదోడు వాదోడుగా ఉంటానని మన స్ఫూర్తిగా, మనస్సాక్షిగా ప్రమాణం చేస్తున్నాను. పంచమురాలినైనా, వంచకురాల్ని మాత్రం కాదు. నా వార్ని నేను దూరం చేసుకోటంలో ప్రత్యేకత లేదు. కన్నతల్లి దండ్రుల నుంచీ, బంధు మిత్రుల నుంచీ ఒకే రక్తాన్ని పంచుకు పుట్టిన తోబుట్టువుల నుంచీ, మిమ్మల్ని విడదీశాను. ఈ పాపానికి పరిసమాప్తి ఈ జన్మలో లేదు. మరుజన్మలోనైనా మచ్చలేని జీవితం ఇరువురకూ ప్రసాదించమని ఆ పరమశివుని వేడుకుంటాను. పుట్టింది పంచమజాతి గృహంలో, మెట్టినది మీ ఇంట్లో, నా సర్వస్వం మీకు ఆత్మ సమర్పణ చేసుకుంటున్నాను. నన్ను తీర్చి దిద్దుకునే బాధ్యత మీదే." అన్నది స్వాతి. ఆమె హృదయంలో పరవళ్ళు తొక్కుతున్న ఆవేదన కట్టలు తెంచుకుని ప్రవహించే మహానదిలా నురుగులు కక్కుతూ పెల్లుబికింది. ఈ పరివేదనా అఘాతానికి తట్టుకోలేక నిర్జీవురాలిలా భర్త చెంత పడిపోయింది స్వాతి.

* * *

"జరిగి పోయిన సంఘటనలనూ, మనోభావాలనూ మళ్ళీ ఈ నాడు జ్ఞాపకం చేశావు స్వాతీ. ఆ నాటి స్వాతి తన సర్వస్వము నాకు ఆత్మార్పణ చేసింది. ఈ నాడు నా జీవితాన్ని నీ హృదయ పీఠం మీద నిలిపాను. నీ పసుపు, కుంకుమకు ఏ దేవతా, ఏ దేవుడూ ఆశించరు. ఎవ్వరూ చెరపలేరు. ఈ గుండెజబ్బు నన్నేమీ చెయ్యలేదు. స్వాతీ, నన్నేమీ చెయ్యలేదు" అన్నాడు కృష్ణమూర్తి.

తలుపు కొట్టిన చప్పుడయింది. స్వాతివెళ్ళి తలుపు తీసింది. విచార వదనంతో జయలక్ష్మి లోపలికి వచ్చింది. జయలక్ష్మి పరిస్థితి చూస్తే ఏం ప్రమాదం సంభవించిందోనని స్వాతి ఆదుర్దా పడ్డది.

"ఏం జరిగింది జయా" అన్నాడు కృష్ణమూర్తి. ఏమీ చెప్పలేక ఏదో చెప్పింది జయలక్ష్మి. ఆరు కళ్ళూ సంతతధారా పాతంగా వర్షించినయ్యి. ఇలాంటి సంఘటన జరుగుతుందని ఎవ్వరూ అనుకోలేదు. కూర్చున్నమనిషి కూర్చున్నట్టే పడి పోయింది స్వాతి.

## 26

జానకిరాం ఆ ఊరు వచ్చి రెండు రోజులయింది. మారుమూల ఉన్న ఒక చిన్న హోటల్లో గదితీసుకున్నాడు. ఆ రెండు రోజులూ గది విడిచి బయటికి రాలేదు. పైన పంకా తిరగటానికీ, తన మనస్సులోని ఆలోచనల పరిభ్రమణకూ ఏమైనా సామరస్యమున్నదా అనుకున్నాడు జానకిరాం. పంకాకన్న వేగంగానే అతని ఆలోచనలు దొర్లిపోతున్నాయ్యి.

# ఎండమావులు

16 వ పేజీ తరువాయి

నేనెవరికోసం ఈ ఊరు వచ్చినట్లు? ఎవర్ని ఉద్ధరించటానికి ఈ పని చేసినట్లు? కట్టుకున్న భార్యకు దూరమయ్యాను. కన్నవారి మనస్సు కష్టపెట్టాను. నా మనస్సును నేను సంతృప్తిగా సమాధాన పర్చుకోలేక పోతున్నాను. నా నొష్టని భగవంతుడు ఉద్యోగం చేసే గీతను దిద్దలేదేమో. ఎవరి కోసం నేను జీవించాలి? నా భార్య కోసం బ్రతకాలా, నా కన్న తల్లితండ్రులకోసం బ్రతకాలా? అన్నయ్య కృష్ణమూర్తి కోసం బ్రతకాలా? ఎవరికోసం ఏం చేయాలి? ఇంట్లో ఎవ్వరికీ చెప్పకుండా ఈ రకంగా వచ్చేసి ఈ ప్రాంతంలో దాక్కునే పరిజ్ఞానం సంపాదించటానికి నా ఎమ్మె డిగ్రీ ఆధార భూతమైందా? నా ఉద్యోగ సమస్య నన్నంత పిరికివానిగా, పనికి మాలిన వానిగా చేసిందా? ఈ సమస్యల్ని నేను వదిలించుకుని, వాటినుంచి దూరం కాలేనా? నాలోని మేధత్వమే నా జీవితాన్ని ఈ దారిని పట్టించిందా? అతని ఆలోచనలకు ఒక దారీ తెన్నూ ఏర్పడలేదు.

మెల్లిగా పక్కమీదనుంచి లేచి పంకా కట్టేశాడు. కాసేపయినా ఈ ఆలోచనలనుంచి దూరమవుదామని కళ్ళు మూసుకున్నాడు. పక్కగదిలో పకపకలు వినిపించినయ్యి.

"రోజా, రేపటి ఇంటర్వ్యూలో నువ్వు నెగ్గి ఉద్యోగం సంపాయించావంటే నాకు పరమ సంతోషంగానే ఉంటుంది కాని ఒక్కటే అనుమానం" అన్నది మగ గొంతుక.

"రాజా, ఏమిటా అనుమానం, నామీద అనుమానం ఏమిటో" అన్నది ఆడ గొంతుక.

"ఏమీలేదు ఉద్యోగం మోజులోపడి నన్ను మర్చి పోతావేమో, నాకు నాకు ఇప్పుడు వచ్చే జీతం నూటేపాతికా చాలకనేగా నువ్వు ఉద్యోగం చేసి పది డబ్బులు వేస్తే మన సంసారం ఏ వడుదుడుకులూ లేకుండా సాగిపోతుందని ఈ నిర్ణయానికి వచ్చాం. నువ్వూ సంపాదిస్తున్నావు కనక నామీద నీ ఆధిక్యత ఏమిటని నువ్వంటావా రోజా" అన్నది మగ గొంతు.

"రాజాగారికి ఆ భయమేమీ అక్కర్లేదు. నా ఉద్యోగమూ, నా సంపాదనా నా ఒక్కదానికోసం కాదు. మన ఇద్దరి కోసం, పుట్టబోయే మన పిల్లల కోసం. మన సంసారం సుఖంగా సాగటంకోసం, అంతేగాని మీ మీద ఆధిక్యత చూపి, మిమ్మల్ని దూరం చేసుకోటానికి కాదు. మీకు దూరమయ్యే ఉద్యోగం నేనెన్నడూ చెయ్యను. ఉద్యోగరీత్యా మీనుంచి నన్నెవరూ దూరం చెయ్యలేరు, తెల్సిందా స్వామీ" అన్నది ఆడ గొంతు.

జానకిరాం మనస్సు అనిర్వచనీయమైన ఆనందంతో నిండిపోయింది. భార్య ఉద్యోగం తాలూకు ఇంటర్వ్యూకు భర్త కూడా వచ్చాడన్న మాట. ఉద్యోగం కోసం భర్తని దూరం చేసుకోనని మనస్ఫూర్తిగా చెప్పింది. వారెంత ధన్య జీవులో అనుకున్నాడు జానకిరాం. అతని భావనా ప్రపంచంలో గౌతమి మెదిలింది. ఉద్యోగంకోసం తనని దూరం చేసుకుంది. తనని దూరం చేసుకుని ఆమె సంపాదనతో తృప్తి పడుతున్నది. ఆమెకు ఉద్యోగం తప్ప తను అక్కర్లేదేమో? గౌతమి అభిప్రాయం అదేనా? ఆ దంపతులు ఆదర్శ ప్రాయమైన ధన్యజీవులు. తాము ఎందుకూ కొరగాని వారు. యుక్తాయుక్త విచక్షణాజ్ఞానం లేనివారు. మమతల్ని చంపుకుని, మనస్సుని రాయి చేసుకుని, తన గుండెల్లో ఒక రాయి పారేసి వెళ్ళింది గౌతమి. ఆమెను తను ఆదరించగలడా? సంసార జీవితం గడపగలడా? గౌతమి మనస్సులో తానింకా నిలిచి ఉన్న




"సరే బాగానేఉంది ! మీ రెలా ఉంటారో తెలియందే నన్నెలా పెళ్ళాడమంటారు......?"

క్లేనా? తనకు హితవు చెప్పేలా కనువిప్పు కలిగించేటానికే ఈ విధంగా దూరమయి ఉద్యోగం చేస్తున్నదా? తను ఉద్యోగం చెయ్యక పోయినా, ఆమె సంపాదనలో తను జీవించాలని గౌతమి కోరికా? గౌతమి పట్టుదలా? గౌతమి ఉద్దేశ్యమే అదయితే ఆమె ఉత్తరానికి తను ఇన్నాళ్ళనుంచి జాబు రాయక పోతే, ఆమె మళ్ళీ ఉత్తరం రాయలేదేం? తను మంచివాడుకాదు, సంపాదించి భార్యను పోషించలేని వాడని అందరి అంచనా, అది నిజమే అనుకుంటే గౌతమి భావనలేమిటి? ఈ భర్త నన్ను పోషించలేరు కనక నా దారి నేను చూసుకో వచ్చుననే ఉద్దేశ్యంతోనే ఇట్లా చేసిందా? గౌతమి భావం అదే అయితే తనతో భవబంధాలు తెంచుకున్నట్లేనా? ఈ పరిస్థితి ఏమిటో ఇదమిద్ధమని తేల్చుకుంటే?

ఆలోచించి ఏదో పరిష్కారానికి వచ్చిన వాడిలా కూర్చున్నాడు జానకిరాం. మెల్లిగా తన పెట్టె తీశాడు, ఎక్కడో పెట్టె అడుగున ఉన్న ఉత్తరం తీశాడు. ఆ రోజున గౌతమి వ్రాసిన ఉత్తరం అది. ఒకటి రెండు సార్లు మళ్ళీ చదువుకున్నాడు. అప్పటికి సాయంత్రం నాలుగున్నర దాటింది. మెల్లిగా గౌతమి పని చేసే ఆఫీసు వైపు వెళ్ళాడు. కాసేపు చెట్ల నీడల్లో పచార్లు చేశాడు. అయిదు దాటింది. ఆఫీసునుంచి ఒక్కొక్కరే వెళుతున్నారు. అంత దూరాన గౌతమి, ఆమె పక్కన మరో ఆమె కనపించారు. గౌతమి ఉత్తరంలో రాసినట్లుగా ఆమే నగేంద్రబాల అనుకున్నాడు. వాళ్ళకు కనిపించకుండా చెట్ల చాటున నిల్చున్నాడు. గౌతమీ, నగేంద్రబాల మెల్లిగా నడిచి వెళ్ళారు. గౌతమిని చూశాడు జానకిరాం. అందమైన పువ్వుల చీరె కట్టుకుంది గౌతమి. అందుకు అమరిన జాకెట్టు చేతులో చిన్న సంచి. మనిషి కొంచం నల్లబడ్డది. ముఖంలోని అందమూ, వర్చస్సూ తగ్గలేదు. జీవితాధ్యాయంలోని విషాదచ్ఛాయలు ఆమె ముఖంలో చూడగలిగాడు జానకిరాం. ఆ కళ్ళలోని నిస్సారమైన చూపులు జానకిరాంను చకితుడిని చేసినయ్యి. మనిషి ఇక్కడా, మనస్సు ఎక్కడో అన్నట్లుంది ఆమెతీరు. అయిదేళ్ళుగా కాపురం చేసి, కష్టసుఖాల్ని పంచుకుని, ఆనందానుభూతుల్ని మేళవింపజేసి చిరు కోపంతో, అభిమానంతో అస్తవ్యస్తంగా తనతో మాట్లాడుతూ, తనకు కోపం తెప్పించి, తను విచార పడుతూ తన బాహువల్లరిలో ముగ్ధ మోహన సౌందర్యాతిశయంతో ఇమిడి ఉండవలసిన తన అర్ధాంగి గౌతమిని చెట్ల చాటునుంచి చాటుగా, మాటుగా చూడవలసిన పరిస్థితి ఏర్పడినందుకు మనస్సులో నవ్వుకున్నాడు జానకిరాం. అకారణంగానో, సకారణంగానో ఆమె ఎప్పుడూ తనతో ఏదో మాట్లాడుతూనే ఉండేది. ఆ కబుర్లన్నీ ఇప్పుడు ఏమైపోయినయ్యి.

గౌతమి, నగేంద్రబాల వెళ్ళిపోయారు. జానకిరాం మనస్సు ఉద్విగ్నమై ఉంది. అడుగులు బరువుగా వేసుకుంటూ వాళ్ళకు వందగజాల దూరంలో కనుచూపు మేరలో ఉంటూ నడిచాడు. కొంత దూరం వెళ్ళాక నగేంద్రబాల తన ఇంట్లోకి వెళ్ళిపోయింది. ఆ ఇల్లు గుర్తు పెట్టుకున్నాడు జానకిరాం. గౌతమి ఒంటరిగానే వెళుతోంది. తన ఇంటికి వెళ్ళుతోంది. కాదు పుట్టింటికి



వెళ్ళుతోంది. తన మామగారిల్లు వస్తోంది. అల్లంత దూరంలో నిల్చుని చూస్తుండగానే గౌతమి ఇంట్లోకి వెళ్ళి పోయింది.

అది ఒక వీడ్కోలు సన్నివేశమే అయింది. వారి జీవితాల్లో ఈ జీవన నాటకానికి అత్యంత స్థూలమైన నాందీ ప్రస్తావన ఉద్యోగం. దీనికి ఉప సంహార మేమిటో ఎవరికీ ఇంతవరకూ తెలీదు. ప్రేమ, వాంఛ, కోరికలతో కలకాలం కాపురం చేయవలసిన తమ దాంపత్య జీవితంలో ఇప్పుడు ఏదో తెలీని ఒక సంఘటన తిష్ట వేసుకుని ఉన్నది. ఆ సంఘటన ఇప్పట్లో వైదొలగి పోతుందో ఇంకా గూడు కట్టుకుని కాపురం చేస్తుందో జానకిరాంకు అర్థం కాలేదు. ఆదరంతో ఆహ్వానాన్ని అందుకుని అత్యంత ప్రేమ పూరితమైన ఆదరాభిమానాలతో అడుగిడవలసిన మామగారి ఇంటిని అంత దూరానుంచే చూసి వెనక్కు తిరిగాడు జానకిరాం. వివాహమై పునఃసంధానమైన కొత్త రోజుల్లో తను ఆమెను విడిచి వచ్చేటప్పుడు అశ్రుపూర్ణ నేత్రాలతో ఆ వరండాలో నిల్చుండి చూసింది ఒకానొకప్పుడు

డాక్టర్: మీ రింతకు ముందెంతమంది డాక్టర్లను చూశారు?

రోగి: ఎవర్నీ చూడలేదండీ. మొదటి సారిగా మిమ్మల్నే చూశాను.

డాక్టర్: అయితే మీ రింకొకర్ని చూడాల్సిన అవసరం కూడా లేదు!

ఎం. మాధవరావ్ (తెనాలి)

గౌతమి. ఆమె చిత్తశుద్ధిని, ప్రేమ నిర్మలతనూ, ఆత్మ తృప్తినీ తల్చుకుంటూ తను ఇప్పుడు నిల్చున్న చోటువరకూ వచ్చి వెనుదిరిగి చూస్తూ వెళ్ళి పోయేవాడు ఆ రోజుల్లో. ఈ రోజున ఆ స్థలంలోనే నిల్చుని ఆ సాయం సంధ్యారాగ సమయంలో ఆ ఇంటి వైపు చూసి వెళ్ళటమే తప్ప ఒక్క అడుగు ముందుకు వెయ్యలేక పోయడు. జానకిరాం. అతని మనస్సు ఉరకలు వేసినా, కాంక్షలు కళ్ళు తెరచినా అభిమానం వాటినేకాక, తనను కూడా అమాంతంగా నెట్టి వేసింది. ఎవరయినా తెల్సినవాళ్ళు చూస్తారేమోనని వెంటనే రిక్షా ఎక్కి పావు గంటలో తన హోటలు గదిలో ప్రవేశించాడు జానకిరాం.

పంకా వేసి పడుకున్నాడు. గిర్రున పంకా తిరుగుతోంది. నా జీవితమూ ఒక ఉపగ్రహం గమనంలానే ఉంది. గమ్యస్థానం చేరుకోలేక యథాస్థానానికి చేరినట్లుగానే ఉంది అనుకున్నాడు జానకిరాం మనస్సులో.

అప్రయత్నంగా అతని మనస్సులో నగేంద్రబాల ప్రవేశించింది. ఈవిడ స్నేహం చేసి గౌతమి ఇట్లా ఉన్నదా? భర్తని వదిలేసి ఉద్యోగం చేసుకుంటూ పొట్టబోసుకోమని ఈవిడ గౌతమికి ఉపదేశం చేసిందా? నాకన్న ఈవిడ బోధలే తన జీవితాన్ని తీర్చి దిద్దగలుగుతయ్యని గౌతమి నిర్ణయానికొచ్చిందా?

ఒక్కసారి నగేంద్రబాలతో మాట్లాడితే? తన ఆలోచనకు తనకే నవ్వొచ్చింది. ఆమె భర్తతో ఉన్నదో, తల్లి తండ్రులతో ఉన్నదో ఏం తెలుసు? మాట్లాట్టానికి వెళ్ళితే వాళ్ళేమనుకుంటారో? నీ భార్యను గురించి నేనిచ్చే సలహా ఏమిటండీ అంటే అప్పుడు తన అభిమానం దెబ్బతినదూ? ఇది అర్థంలేని అపరిష్కృత సమస్యలానే తోచింది జానకిరాంకు. కాని ఏదో ఒక త్రోవ తొక్కాలి. సరాసరి మామగారింటికి వెళ్ళటం సిగ్గుచేటనిపించింది అతనికి. ఏదో ఒక అర్థం చేసుకోలేని నిర్ణయానికొచ్చాడు.

ఆ రాత్రి హోటల్లోనే గడిచింది.

మర్నాడు ఉదయాన్నే లేచి ఏడు గంటలకల్లా నగేంద్రబాల ఇంటికి వెళ్ళాడు జానకిరాం. ఇంట్లోకి వెళ్ళటానికి సిగ్గనిపించింది. తన భార్య విషయమైన సంగతులు ఆమె స్నేహితురాలి ద్వారా కనుక్కోవటం మేమిటనిపించింది. చివరకి నా ప్రవర్తన ఈ రీతిగా మారిందేమో అనిపించిందతనికి. ఎవరికోసం ఈ సంప్రదింపులు, ఎవరికోసం ఈ అన్వేషణ. ఈ జీవితంలోని అన్ని యథార్థవిషయాలకూ తనే బాధ్యత వహిస్తూ ఉండి పరిస్థితుల ప్రాబల్యానికి తట్టుకోలేక స్వప్నావస్థలో ఉన్నవాడిలా ఇట్లా ప్రవర్తించటమా? అర్థంకాని ఈ మానసిక వ్యధ పోవటానికి ఈ నగేంద్రబాలతో సంప్రదింపులే మార్గదర్శకమౌతయ్యా లేక ఈ సంప్రదింపులతో అవహేళనపాలవుతానా?

ఆలోచించుకుని లోపలికి వెళ్ళ బుద్ధి పుట్టక వెనక్కు తిరిగాడు జానకిరాం.

“వచ్చి వెళుతున్నారేం. ఎవరు మీరు”

వెనక్కు తిరిగి చూశాడు. నగేంద్రబాల. ఏదో చెప్పబోయి ఆగాడు.

“లోపలికొచ్చి కూర్చోండి మాట్లాడుదురుగాని” మర్యాదగా ఆహ్వానించింది నగేంద్రబాల. ఇంట్లోకి వెళ్ళి కుర్చీలో కూర్చున్నాడు. ఎదురుగా నిల్చుంది నగేంద్రబాల.

“మీ పేరు”

“మీ పేరు నగేంద్రబాల కదూ”

ఆశ్చర్యపడుతూ తల ఊపింది.

“మీ స్నేహితురాలు గౌతమి కులాసాగా ఉన్నదా”

మరీ ఆశ్చర్య పడింది నగేంద్రబాల.

“మీరెవరో చెప్పనేలేదు. ఈ ప్రశ్నలన్నీ ఎందుకు వేస్తున్నారో నాకు తెలీటం లేదు.”

“ఏమీ లేదు. ఊరికేనే తెల్సుకుందామని అడుగుతున్నాను. ఉద్యోగం చెయ్యాలనే కాంక్ష, ఆసక్తి ఆమెకు ఎక్కువనుకుంటాను. ఉద్యోగం చేస్తూ జీవించగలననే ధైర్యం ఆమెకున్నది కదూ” అన్నాడు ముభావకంగా.

పొంగారిన సంతోషాతిశయంతో లోపలికి వెళ్ళి తల్లితో రెండు మాటలు మాట్లాడి కాఫీ తెచ్చి జానకిరాంకు ఇచ్చింది.

“ఈ కాఫీ తీసుకోండి” మర్యాద ఉట్టిపడుతూ అన్నది.

కాఫీ తాగాడు జానకిరాం. పక్కగా నిల్చుని అతని ముఖ కవళికల్ని కనిపెడుతున్నది నగేంద్రబాల.

"ఉద్యోగం చేస్తూనే జీవించాలనీ, భర్తను దూరం చేసుకోవాలనీ గౌతమి ఎప్పుడూ అను కోటం లేదు. తన ఉద్యోగం తాత్కాలికమేనని భర్త పిలుపు కోసం, ఆదరణ కోసం ఆమె నిత్యమూ ఎదురు చూస్తున్నదనీ నాకు తెల్సు, కానీ ఏ దుష్ట గ్రహమో ఆ భార్యా భర్తల్ని తాత్కాలికంగా విడదీసింది. ఆ రోజున ఆవిధంగా వచ్చేసినందుకు తన అవివేకాన్ని, విచారాన్ని వ్యక్త పరుస్తూ భర్తకు ఉత్తరం కూడా రాసింది. కాని వారి జాబు మాత్రం ఇంత వరకూ రాలేదు." అన్నది నగేంద్ర బాల.

చకితుడైనాడు జానకిరాం.

"తనంతట తానుగా తప్పు చేసినప్పుడు భర్తను క్షమార్పణ కోరుకుని తన తన కాపురాన్ని నిలబెట్టుకోవాలనే ఇంగిత జ్ఞానం లేకుండా, ఒక్క ఉత్తరం రాసి తన బాధ్యత తీరి పోయిందనుకోటం సమంజసంగా ఉందంటారా"

నగేంద్రబాల మనస్సులోనే నవ్వుకుంది.

"ఆ భార్యా భర్తల వ్యక్తిత్వాలు వాళ్ళకు తెల్సి నంతగా నాకు తెలియవేమో. ఉద్యోగం మానేసి వచ్చెయ్యమని ఈ నాడు చెపితే సంతోషంగా రాజీ నామా ఇచ్చి భర్త వెంట బయల్దేరి వచ్చేస్తుంది గౌతమి. ఆమె మనస్సు వెన్నెలాంటిది. చిలికితేనేగాని వెన్న రాదుకదా. ఆ నేర్పు ఆ భర్త మానసిక పథంలో లేక పోవచ్చు. కాకపోయినా పురుషులతో బాటుగా స్త్రీలుకూడా ఎగబడి ముందుకు వచ్చి ఉద్యోగాలు చేస్తున్న ఈ రోజుల్లో ఎమ్మే ఫస్టుక్లాసులో ప్యాసయి ఏ ఉద్యోగమూ చెయ్యనని శపథం పట్టి, తనకున్న విజ్ఞానాన్ని, చదువునూ భూస్థాపితం చేసి గోరీ కట్టబూనటం కోరుకున్న ఏ మగవారూ చేయవలసిన పని కాదు. అది ఏ రకమయిన వ్యక్తి త్వానికి చెందుతుందో ఆ పరమాత్మునికే ఎరుక. ఈ విషయంలో మీ అభిప్రాయమేమిటో" అన్నది నగేంద్రబాల.

దెబ్బ తిన్నవానిలా తలెత్తి చూశాడు జానకిరాం. తల వంచుకుని అటువైపే చూస్తున్నది నగేంద్ర బాల.

"అంటే ఉద్యోగం చెయ్యటం ఇష్టం లేని భర్తను ఈ ఒక్క మిషతో గౌతమి దూరం చేసుకో దల్చుకుంటే ఆమె వ్యక్తిత్వానికి అది గీటు రాయి వంటిదే అవుతుందేమో ?" వ్యంగ్యంగా అన్నాడు.

"ఎన్నటికీ కాదు. అనేక కారణాంతరాల వల్ల అలాంటి జీవితం గడిపే స్త్రీల విషయం నేను చెప్పటంలేదు. గౌతమి భావం మాత్రం అది కాదు. తన జీవితం భర్త సమక్షంలోనే వెళ్ళబుచ్చుకో వాలనే ఎప్పుడూ తాపత్రయపడుతుంది. భర్త ఆజ్ఞానుసారం, అతని ఇష్టా ఇష్టాలనే ఆధారం చేసు కుని ఆడది జీవించవలసినా, ఆవిడకూ ఒక వ్యక్తి త్వమూ, గౌరవమూ సంఘంలో ఉంటయ్యి. ఆ వ్యక్తిత్వానికి విఘాతం కలిగినప్పుడో, దెబ్బ తగిలి నప్పుడో తాత్కాలికంగానైనా విరక్తి చెందటమనేది ఉప్పు, కారం తినే ప్రతి వ్యక్తిలోనూ ఉంటుంది. భార్యా భర్తల్లోనే ఏ ఒకరైనా అదే కారణాన్ని ఆధా రంగా తీసుకుని సంసారాన్ని పాడు చేసుకోకూడదు. ఏహానమనేది ఆడ దానికి ఆభరణమైనా, ఆ ఆభర

జాన్ని మగవాడు పాడు చెయ్యకుండా, అమ్మకో కుండా కాపాడుకోవాలి. అప్పుడే సహనానికి సహజత్వం వస్తుంది. అది లోపించిననాడు ఆ సంసారం తమంతట తాముగానే పాడు చేసుకున్న వారవుతారు. ఇందుకు తార్కాణం గౌతమి సంసార జీవితమే. అందుకు ఆ భార్యా భర్తలిద్దరూ కారకులే. తప్పు ఇద్దరిలోనూ ఉన్నది." అన్నది నగేంద్రబాల ఉద్వేగంతో.

నిర్ఘాంత పోయాడు జానకిరాం. తను పరాయి వ్యక్తని తెల్సికూడా నగేంద్రబాల ఇట్లా మాట్లాడుతున్నదంటే తానెవరో ఆమెకు తెలిసి పోయినట్లుగా అర్థం చేసుకున్నాడు. అనుకోకుండానే ఒకరి ముఖాలొకరు సూటిగా చూసుకున్నారు.

"జానకిరాం గారూ" నవ్వుతూ అన్నది నగేంద్రబాల.

విస్తుపోయాడు జానకిరాం.

"ఉద్వేగంతో ఏదో మాట్లాడేశాను. నన్ను క్షమించండి. గౌతమి మిమ్మల్ని ఎప్పుడూ దూరం చేసుకో దల్చుకో లేదు. ఐదేళ్ళుగా కాపురం చేసినా మీరు ఆమెను సరిగా అర్థం చేసుకోలేదనే నా భావన. ఈ రెండు నెల్లల్లో ఆమెను పూర్తిగా తెల్సుకున్నాను. తన కాళ్ళమీద తానుగా నిలబడి జీవించగల శక్తి ఏ కొద్ది మంది చదువుకున్న ఆడవాళ్ళకో ఉంటుంది. కాని వాళ్ళుకూడా జీవితాంతమూ అట్లాగే ఉంటారా అనేది కూడా సందేహమే.

# ఎండమావులు

ఆ తీరుగా గౌతమి కొద్ది నెల్లకూడా తన జీవితాన్ని గడపలేదు. ఆమె జీవనలత మీతో పెనవేసుకు పోవలసిందే. ఒక రకమైన విరక్తి భావంతో ఒక తాత్కాలిక భ్రాంతిలో పడి ఆమె ఇట్లా వచ్చేసింది. ఈ రోజున ఆమె మీతో వస్తుంది. మీరు తీసుకు వెళతారా"

సూటిగా అడిగిన ఈ ప్రశ్న సూలంలా అతని మనస్సులో గుచ్చుకున్నట్లయింది.

"పొరబడ్డారు. గౌతమిని నేను తీసుకు వెళ్ళ దల్చుకుంటే నేరుగా అక్కడికే వెళ్ళేవాడిని. ఏ కారణం చేత విరక్తి భావంతో ఆమె వచ్చేసిందో ఆ కారణం ఇదమిద్ధంగా నాకు ఈ రోజుకూ తెలీదు. ఆ విరక్తి భావమే ఆమెలో శాశ్వతమైన ముద్ర వేసుకుంటుందేమో నాకు తెలీదు. విరక్తి పోయి అనురక్తి ఆమెలో కలిగిన నాడు గౌతమి తానుగానే నా ఇంటికి వస్తుంది. ఆమె కోసం నా హృదయ కవాటం ఎప్పుడూ తెరచే ఉంటుంది. నిర్భయంగా ప్రేమానురాగాలను పుణికి పుచ్చుకుని ఎప్పుడు ప్రవేశించినా ప్రవేశించవచ్చు. శలవు, వస్తాను" అంటూ వచ్చేశాడు జానకిరాం.

స్తబ్ధురాలై గుమ్మం వైపే చూస్తూ నిల్చుండి పోయింది నగేంద్రబాల.

ఇంటికి వచ్చిన జానకిరాంను చూసి శ్రీలక్ష్మి తల్లి దగ్గరకు వెళ్ళి "అమ్మా, అమ్మా జానకిరాం అన్నయ్య వచ్చాడే. చూడట్లా నచ్చి" అన్నది. ఈలోగా జానకిరాం తల్లి దగ్గరకు తానే వచ్చాడు.

"ఏం నాయనా కోపం తీరిందా, మీ నాన్న ఆ రోజున అట్లా అన్నారని కోపగించుకుని వెళ్ళి పోయావుకదూ. ఉన్నట్లుండి హఠాత్తుగా తెల్లవారి పక్కమీద చూస్తే లేవు. ఎక్కడికి వెళ్ళిందీ తెలీదు. బజారుకు వెళ్ళావేమోనని పది గంటల వరకూ చూశాం. అతీ గతీ లేదు. శ్రీలక్ష్మి నీ గదిలోకి వెళ్ళింది. బావురుమంటూ వచ్చి 'అమ్మా అన్నయ్య పెట్టె తీసుకుని వెళ్ళి పోయాడే. బహుశా నిన్న నాన్నగారన్న మాటలకు మనస్సు కష్ట పెట్టుకుని వెళ్ళిపోయాడు' అన్నది. నా ప్రాణాలు ఎగిరి పోయినయ్యి. వాడు ఆ రకంగా వెళ్ళి పోతే, నువ్వు ఈ రకంగా కోపంతో దేశాల పాలయ్యావని నెత్తి బాదుకుని ఏడుస్తున్నాను. ఎక్కడికి వెళ్ళావురా నాయనా" అంటూ కొడుకుని కావిలించుకుని కంట తడి పెట్టింది ప్రభావతమ్మ.

జయలక్ష్మి, శ్రీలక్ష్మి సంతోషంతో జానకిరాంను చూస్తూ "మా అందర్నీ ఈ మూడు రోజులూ హడల గొట్టేశావు. ఏమయినావో, ఎక్కడికి వెళ్ళావోనని అమ్మ ఒకటేగోల. నీకు పుణ్యం ఉంటుంది ఇలాంటి పని ఎప్పుడూ చెయ్యకు" అన్నారు వాళ్ళిద్దరూ.

జానకిరాం ఖిన్నవదనుడై నవ్వుకున్నాడు.

"నేనేం పసివాడినా అమ్మా మారు పడిపోయేందుకు. అంత గాబరా ఎందుకు కలగాలో నాకు అర్థం కావటం లేదు" అన్నాడు.

"మారుబట్టవే కాదు వేరుబడ్డా మాకు కష్టంగానే ఉంటుంది. నిన్ను ఉద్యోగం చెయ్యమని ఎన్నడూ ఇక అనను. మాతోబాటుగా కలో గంజో తాగుతూ మా కళ్ళ ఎదుట వుంటే నువ్వు ఉద్యోగం చేసినట్లుగానే భావిస్తాం" అంటూ ఇంక అక్కడ నిల్చోకుండా వెళ్ళి పోయాడు గోపాలశాస్త్రి. తండ్రి వచ్చిన విషయమే గమనించలేదు జానకిరాం.

అభిమానంతో, సిగ్గుతో కుమిలి పోయాడు జానకిరాం. మెల్లిగా తన గదిలోకి వెళ్ళాడు.

"ఇంత పనికిమాలినవానిగా నన్ను సృష్టించావా భగవంతుడా" అని మనస్సులోనే అనుకుంటూ వాపోయాడు.

శ్రీలక్ష్మి, జయలక్ష్మిల సంతోషానికి మేరలేదు.

ఆ రోజే జయలక్ష్మి వెళ్ళి జానకిరాం వచ్చినట్లుగా స్వాతితోనూ, కృష్ణమూర్తితోనూ చెప్పింది. అందరికీ పోయిన ప్రాణం లేచి వచ్చినట్లయింది. ఆ రోజున అందరికీ పండుగగానే ఉంది, ఒక్క జానకిరాంకు మినహా—

## 27

ఆ రోజు జ్యోతి పుట్టినరోజు. ప్రతి ఏడూ తన పుట్టినరోజు పండక్కి తన స్నేహితురాండ్రనందర్నీ పిలిచి చిన్న టీపార్టీ ఇచ్చేది జ్యోతి. ఈ సంవత్సరం ఆ పద్ధతి మానేసింది. వయస్సు వస్తున్న కొద్దీ అభిరుచులు మారుతున్నయ్యి. ఈ పుట్టిన రోజు వేడుకకి ఎవ్వర్నీ పిలవ దల్చుకోలేదు. ఇద్దర్ని మాత్రమే భోజనానికి పిలిచింది. మొదటి వ్యక్తి స్వాతి, రెండో వ్యక్తి జయలక్ష్మి. ఈ సారి ఈ వేడుకకు అనుకోకుండా మురహరి కూడా ఉన్నాడు. ఈ పద్ధతికి తాసిల్దారు కూడా గారు వప్పుకున్నారు.

స్వాతి రానన్నది. ఆమె మనస్సులోని అభిప్రాయం వేరు. ఎక్కడ హీనంగా చిన్నబుచ్చుకోవలసిన పరిస్థితి వస్తుందోనని ఆమె దిగులు.

"జ్యోతి నా సంగతి ఇదివరకు నీకు తెలీక పోయినా ఇప్పుడు తెలుసు. నేను మీ ఇంట్లో భోజనం చెయ్యటం నీకు ఇష్టమున్నా మీ నాన్నగారికి, అమ్మగారికి, మీ బావకూ ఇష్టం లేక పోవచ్చు. కుల గోత్రాలు కప్పి పుచ్చుకుంటే దాగేవి కావు. మూలిగే నక్క మీద తాటికాయ పడ్డ రీతిగా నన్ను చెయ్యకు" అన్నది వినయ పూర్వకంగా.

జ్యోతి ఈ మాటలకు ఎంతో నొచ్చుకుంది.

"వదినా నువ్వు ఎవరయిందీ నాకక్కర్లేదు. నీ కుల గోత్రాలు నాకనవసరం. నువ్వు మా వదినెవు. కృష్ణమూర్తి అన్నయ్య భార్యవు. ఆ చుట్టరికాన్ని దృష్టిలో ఉంచుకునే మనస్ఫూర్తిగా ఆహ్వానిస్తున్నాను" అన్నది.

స్వాతి వప్పుకోక తప్పలేదు.

భోజనాల గదిలో తాసిల్దారుగారూ, మురహరి ఒక వరసన కూర్చున్నారు. వారి పక్కన పిల్లలంతా కూర్చున్నారు. ఎదురు వరసలో జ్యోతి, స్వాతి, జయలక్ష్మి, జ్యోతి తల్లి కూర్చున్నారు. వంటావిడ వడ్డించింది. పిండి వంటలతో, పాయసంతో మృష్టాన్న భోజనంగా ఉండాలని జ్యోతి ఉరమాయించి అన్ని పదార్థాలూ చేయించింది. అంతా భోజనం ప్రారంభించారు.

"మా జ్యోతి మూలంగా మిమ్మల్నందర్నీ విందుకు ఆహ్వానించటానికి వీలు కలిగింది. మీ అందరితోనూ ఈ విందులో పాల్గొనటానికి ఇవ్వాళ నాకూ వీలు కలిగింది, చాలా సంతోషం" అన్నారు తాసిల్దారుగారు.

"అవున్నాన్నా ఈ రకంగానయినా నలుగురం ఒక చోట కల్సుకోటానికి వీలువడింది, మీ అందరికీ నా కృతజ్ఞత" అన్నది జ్యోతి.

"ఎవరికి ఏం కావాలో అడిగి వడ్డించుకుని తినాలి. మొహమాట పడితే లాభంలేదు" అన్నాడు హరనాథ్.

"ఇంతటితో అయిపోలేదోయ్. రేపు మా జ్యోతి పెళ్ళిలో ఇంతకన్న ఎక్కువగా విందులూ, వేడుకలూ జరిపించాలి, ఏమంటారు మురహరిగారు" అన్నది స్వాతి.

మురహరి నవ్వి ఊరుకున్నాడు. జ్యోతి కళ్ళు బావ వైపే చూడసాగాయి. వీరిద్దరి ముఖ కవళికలూ చూస్తున్నది తలొంచుకునే జయలక్ష్మి. చూసీ చూడనట్లుగా ఒకసారి జయలక్ష్మివైపు చూశాడు మురహరి. అందరి ముఖాల్లోనూ సంతోషాతిశయాన్నే చూసింది స్వాతి. జ్యోతి తల్లికి మాత్రం ఈ సంభాషణ నచ్చలేదు.

"ఏమండీ పెద్దవారువీరు మాట్లాడరేం. పప్పన్నం ఎప్పుడు పెట్టిస్తారు" అన్నది స్వాతి జ్యోతి తల్లివైపు చూస్తూ.

"ఆ రోజు రావాలికదా, ఎవరికి ఎవరు రాసి పెట్టుకున్నారో ఎవరికి తెలుసు. అంతా విధి విధితమే కదా" అన్నది జ్యోతి తల్లి.

"వివాహాలు స్వర్గంలో జరుగుతయ్యనే ఆర్యోక్తిననుసరించి మాట్లాడుతున్నారు" అన్నది జయలక్ష్మి జ్యోతి తల్లి వైపు, మురహరివైపూ చూస్తూ.

జ్యోతి మనస్సు ఉక్కిరి బిక్కిరి అవుతోంది.

"ఇతను తెల్సుగా టీచరుగారూ మా మేనల్లుడు మురహరి. ఆనర్సు పూర్తి చేశాడు" అన్నాడు తాసిల్దారుగారు స్వాతితో.

"ఇంకేమండీ బాధేలేదు" అన్నది స్వాతి ఆయనతో.

చిరునవ్వుతో భార్యవైపు చూశాడాయన. చూసీ చూడనట్లుగానే ఊరుకుందావిడ.

"ఒరేయ్ హరనాథ్ ఏమిటా కోతి తిండి, తలొంచుకు తిను, అట్లా వప్పులు పోసుకున్నట్లు తింటావేం. అవతల బావ విస్తట్లో మెతుకులు పడతయ్యి" అని హరనాథ్‌ను కసిరిందావిడ.

"పెళ్ళయ్యాక అక్కయ్య ఎంగిలి ఎట్లాగూ తింటాడు. అందాకా నా ఎంగిలి తిన్నా తప్పు లేదు ఏం బావా" అన్నాడు హరనాథ్.

స్వాతి మనస్ఫూర్తిగా నవ్వింది. తాసిల్దారుగారు మేనల్లుడి వీపు తట్టారు. జయలక్ష్మి ముభావకంగా ఊరుకుంది. జ్యోతి సిగ్గుతో వంచిన తల ఎత్తలేదు. మురహరి కనబడీ కనబడనట్లుగా జయలక్ష్మివైపు క్రీగంట చూశాడు. ఆ చూపును అందుకుంది జయలక్ష్మి. మురహరి ముఖ కవళికల్ని అర్థం చేసుకోలేక పోయింది జ్యోతి. అసలీ ప్రస్తావనే నచ్చలేదు జ్యోతి తల్లికి. భార్య ముఖం చూసి నొచ్చుకున్నాడు తాసిల్దారుగారు. అంతా తింటూనే ఆలోచనల్లో పడ్డారు.

"ఏమ్మా జయలక్ష్మి. మాట్లాడకుండా భోజనం పూర్తి చేస్తున్నారా" అన్నది స్వాతి.

అన్యమనస్కురాలై ఉన్న జయలక్ష్మి ఒక్కసారి తలెత్తి చూసి "ప్రస్తుతం మనం వచ్చింది అందుకేగా వదినా, భోజనం ముందు కబుర్లు తరువాత" అన్నది జయలక్ష్మి.

"అట్లాకాదు భోజనంతో కబుర్లు కలిపి తింటుంటే బావుంటుంది అవునా వదినా" అన్నది జ్యోతి.

"టీచరుగారు మీ ఇద్దరికీ వదినగారన్నమాట. బాగుంది వరస. ఎక్కడో పుట్టి, ఎక్కడో పెరిగి అంతా ఇక్కడ చేరి సరదాగా మనస్సులు విప్పి మాట్లాడుకోటం నాకు నిజంగా ఆనందంగా ఉన్నదమ్మా. ఉద్యోగరీత్యా, సేవాధర్మంలో పడి వేళా పాళా లేకుండా తిరిగే నాబోటి వాడికి ఈ మాత్రం తీరిక చిక్కి మీ అందరి మధ్యా ఇంత హాయిగా సంతోషంగా భోజనం చేస్తానని ఎప్పుడూ అనుకోలేదు. ఈ స్నేహ వాత్సల్యాలూ, కలుపుగోలుతనమూ మీ ముగ్గురితోనూ ఎల్లప్పుడూ ఉండాలని నా కోరిక. మా జ్యోతి ప్రకృతే వేరు. దాని మనస్సుకు

## దర్పణం

కె. సభా

నీ తేజము
నీ జ్ఞానము
నీ మహాద్భుతశక్తులు
నాలో నీ వున్న యెడల
నాలోనే కన్పించును!

నీ దీక్ష
నీ తపస్సు
నీ ధ్యానామృతవాహిని
నాలో నీ వున్న యెడల
నాలోనే కన్పించును!

నీ గానము
నీ యోగము
నీ యనంత ప్రపంచము
నాలో నీవున్న యెడల
నాలోనే కన్పించును!

నీ రూపు
నీ చూపు
నీ బ్రహ్మజ్ఞానంబు
నాలో నీవున్న యెడల
నాలోనే కన్పించును! ★

వచ్చినవాళ్ళయితేనే, తన ఆశయాలకూ, అభిరుచులకు అనుగుణ్యంగా ఉన్నవాళ్ళయితేనే, అది వాళ్ళతో స్నేహం చేస్తుంది. మనస్ఫూర్తిగా, హృదయపూర్వకంగా పిలిస్తే పలికే హృదయం దానిది. ఏమ్మా జ్యోతి అంతేనా" అన్నాడాయన వాత్సల్యపూర్వకంగా కూతురు వైపు చూస్తూ. పులకాంకితురాలైంది జ్యోతి. హృదయ పీఠంమీద బావను నిల్పుకుంది. మనస్సులో స్వాతినీ, జయలక్ష్మినీ నింపుకుంది. తండ్రి తన ఉద్దేశ్యాలతో భావాలతో ఎప్పుడూ ఏకీభవిస్తాడని తెల్సు. తల్లి మాత్రం ఎప్పుడు తనతో కలిసిరాదు. ఆ కుమిలింపు మనస్సులో ఎప్పుడూ కలక వేస్తూనే ఉంటుంది. తల్లివైపు చూసింది జ్యోతి. ఆమె ముఖం తుమ్మల్లో పొద్దూకినట్లుగా ఉంది.

మురహరి వైపు చూసింది జ్యోతి. అతని మనస్సులో ఏముందో తెలీదు. ఏ భావాలున్నయ్యో బయటికి రావు. తనవైపు ఒక్కసారయినా చూసినట్లుగా లేదనుకుంది. ఈ దాగుడు మూతలకు అంతమెప్పుడో!

వంటావిడ లడ్డూలు పట్టుకొచ్చింది మారు వడ్డించటానికి. అంతా వద్దంటున్నారు. తిన లేమని చేతులు అడ్డం పెడుతున్నారు.

"జ్యోతీ నీ పుట్టినరోజుకదా మీ బావగారికి ఒక్క లడ్డూ చెప్పి వేయించకూడదూ" అన్నది స్వాతి నవ్వుతూ.

ఈ మాటకు తాసిల్దారుగారు కూడా నవ్వి "నిజమేనండీ వెయ్యవలసిందే" అంటూ వంటావిడ వైపు చూశారు. మురహరి వద్దంటున్నా ఆవిడ విస్తట్లో ఒక లడ్డూ వేసింది. మురహరి చెయ్యి అడ్డం పెట్టటంనుంచి ఆ లడ్డు చేతికి తగిలి దొర్లుకుంటూ వెళ్ళి జయలక్ష్మి విస్తట్లోకి వెళ్ళింది. వంటావిడ ఖిన్నురాలైంది. అందరి మనస్సు బాధతో నిండిపోయింది. జ్యోతి మనస్సులో చెప్పలేని ఆవేదన చెలరేగింది. తనవల్ల కదా ఇటువంటి అవాంఛనీయమైన సంఘటన జరిగిందని నొచ్చుకుంది స్వాతి. జ్యోతి సరదా పటాపంచలై పోయింది తాసిల్దారుగారు మాట్లాడలేక పోయారు వంటావిడ తప్పేమీ లేనందువల్ల ఆవిడనేమీ అనలేక పోయింది జ్యోతి తల్లి, లేకపోతే విరుచుకు పడేది.

అందరి మనస్సులూ అట్లాఉన్నా మురహరి, జయలక్ష్మిల మనస్సులు ఉప్పొంగి నయ్యి, హృదయాలు పరస్పరం మాట్లాడుకున్నయ్యి. ఆ మాటలు ఎవరికీ అర్థం కాలేదు "చూడమ్మా ఆ విస్తరి అట్లా వదిలెయ్యి. వేరే విస్తరి వేస్తాను" అన్నది వంటావిడ కళ్ళు తుడ్చుకుంటూ. మర్యాదకోసం మురహరికూడ అదే మాట అన్నాడు. జ్యోతి తల్లికూడా అట్లాగే అన్నది ఆ లడ్డూనే తినాలని జయలక్ష్మికి అనిపించినా అది ఆ సమయంలో తీరని కోరిక. ఆ లడ్డూ తీసి పక్కన బెట్టింది.

"పొరబాట్లనేవి జరక్కుండా ఉండవు. ఎవ్వరూ కావాలని ఇట్లా చెయ్యరు కదా మరేం పరవాలేదు. ఎంగిలి కాలేదు. ఈ మాత్రం విషయానికి మీరంతగా బాధ పడనక్కర్లేదు. ఈ విస్తట్లోనే తింటాను" అన్నది జయలక్ష్మి. ఆమె సహృదయతకు అంతా సంతోషించారు. అందరికీ బరువు తీరినట్లు అయింది. వారిరువురి హృదయాలు దోబూచులాడినయ్యి. బావకు ఇంకా దూరమౌతున్నట్లుగా భావించింది జ్యోతి. పీరు వల్ల మెతుకు, నిజము దేవుడెరుగు. అనుకుంది స్వాతి తన మనస్సులో.

ఈ వాతావరణంలో భోజనాలు పూర్తయినయ్యి. తాసిల్దారుగారు వెళ్ళిపోయారు. మిగిలిన వారంతా ముందు హాల్లో కూర్చున్నారు తాంబూలం వేసుకుంటూ. మురహరి కూడా బట్టలు వేసుకుని వెళ్ళిపోయాడు.

"ఏం జ్యోతీ ఆ లడ్డూ నీ విస్తట్లోకి దొర్లి వస్తే ఎంతో బావుండేది గదూ" అన్నది స్వాతి.

జ్యోతి నవ్వుతూ జయలక్ష్మి వైపు చూసింది.

"ఏం అట్లా అనుకోపోతే వాళ్ళిద్దరూ కాలేజీలో ఒకే క్లాసులో చదువుకున్నారు గనక ఆ విధంగా జరిగిందనుకో కూడదూ" అన్నది జ్యోతి.

జయలక్ష్మి గుండెలు దడదడలాడినయ్యి. దెబ్బ తిన్న దానిలా చూసింది జ్యోతి వైపు.

"అవేం మాటలు జ్యోతీ చదువుకూ ఈ సంఘటనకూ ఏమయినా సంబంధం ఉందా?" అన్నది జయలక్ష్మి.

"కోపమొచ్చిందా జయా, ఎగతాళికి అన్నాను" అన్నది జ్యోతి.

వీళ్ళిట్లా మాట్లాడుకుంటున్న సమయంలోనే వంట ఇంట్లో జ్యోతి తల్లితో వంటావిడ మెల్లిగా సంభాషణకు దిగింది.

"అమ్మగారూ"

"ఏం వెంకాయమ్మగారూ ఏమన్నా వంట సామాను కావాలా ఇంకా"

"కాదుగాని నాకొక్క అనుమానం తట్టింది"

"ఏమిటండీ ఆ అనుమానం"

"ఆ లడ్డూ జయలక్ష్మమ్మ విస్తట్లోకి వెళ్ళింది గద. మీరెవ్వరూ చూడని సమయంలో వెంటనే వారిద్దరి వైపు చూశాను. మీరెవ్వరూ చూడకుండా మెల్లిగా నవ్వుకున్నారు వాళ్ళిద్దరూ. దాని అంతరార్థం అర్థమైందా" రెట్టించి అడిగింది వంటావిడ.

జ్యోతి తల్లి నిర్ఘాంతపోయింది.

"అయితే............"

"అయితే లేదు కాకపోతే లేదు. ఆ అమ్మాయి, మీ మేనల్లుడూ విశాఖపట్నంలో చదువుకున్న వాళ్ళే నన్నారుగా, ఇంకేం, పాత కాపులే" అన్నదావిడ అంతా తెలిసినట్టుగా ముఖ కవళికలు, మారుస్తూ.

జ్యోతి తల్లి ఆలోచనలో పడింది. ఆవిడ ఆలోచనకు ఈ కబుర్లు ఒక రకంగా తెలీని సంతోషాన్నే కలిగించినయ్యి. ఇంక మేనల్లుడి మీద ఈ వాతావరణాన్ని ప్రయోగించి ఆ సంబంధం కాకుండా భర్త మనస్సు మార్చాలని ఆవిడ అంచనా. ఆవిడ ఉద్దేశ్యంలో మురహరి జయలక్ష్మిని చేసుకున్నా, మరొకర్ని చేసుకున్నా ఇష్టమే, తనకు అల్లుడు కాకుండా ఉంటే చాలు.

"అర్థం చేసుకున్నాను వెంకాయమ్మగారూ పోనిండి వాళ్ళెట్లా తగలబడితే నాకేం. నాపిల్లనేం అతనికివ్వబోవటం లేదు" అన్నదావిడ.

వంటావిడ నిర్ఘాంతపోయింది. ఆవిడ అంచనాకు ఈ మాటలు వ్యతిరేకంగా ఉన్నయ్యి. జ్యోతిని అతనికివ్వటానికి ఆవిడకు ఇష్టం లేదని ఇప్పుడే తెల్సుకుందావిడ. ఇదో కొత్త పంథాగానే ఉందావిడ మనసుకు ఇక ఈ విషయంలో తన మాటలు వెల్లవు. అయినా నాకెందుకని ఆవిడా వూరుకుంది.

నవ్వుతూ వాళ్ళంతా కూర్చున్న చోటికి వెళ్ళింది జ్యోతి తల్లి, అప్పటికి వాళ్ళు ముగ్గురూ అక్కడే ఉన్నారు.

"ఏమర్రా తాంబూలాలు వేసుకున్నారా. ఏమిటి కబుర్లు వంటావిడ ఏమిటో చెప్తుంటేను అటు వెళ్ళొచ్చాను. ఏమ్మా జయలక్ష్మి అంతా కలిసి నిన్ను కష్టపెట్టాం. మా మనసును కష్టపెట్టాలొస్తుందని నువ్వు సరిపెట్టుకున్నావు. అయినా హాస్టళ్ళలో, కాలేజీల్లో చదువుకునే వాళ్ళకు ఇదొక పెద్ద లెక్క




"క్షమించాలి! ఉగాదిపచ్చడి ఉగాదిరోజునే చేశాను. కానీ...... నీవు సింగారించుకుని వచ్చేసరికి మూడురోజులు పట్టింది!"

తోవిది కాదు. ఇంతకన్నా ఎక్కువైన విషయాల్లోనే వాళ్ళు సరిపెట్టుకు పోతారు." అన్నది.

జయలక్ష్మి మనస్సు చిన్నబుచ్చుకుంది. స్వాతికి ఈ మాటలు కష్టంగా తోచినయ్యి. ఏదో ఉపద్రవం అమ్మ తెచ్చి పెడుతున్నది, అనుకుంది జ్యోతి.

"మా మురహరి నీకు బాగా తెల్సునా జయలక్ష్మి నువ్వూ అదే క్లాసు కామాలు" అన్నది ఆవిడ మళ్ళీ.

జయలక్ష్మి మనస్సు కృంగిపోతున్నది. ఇదేదో చిలికి చిలికి గాలివానగా తయారవుతుందేమో నను కుంది జ్యోతి.

"తెలుసునండీ. మూడేళ్ళుగా ఒకే కాలేజీ, యూనివర్శిటీ కాలేజీలోనే చదువుతున్నాం" అన్నది జయలక్ష్మి ధైర్యంగానే.

"అట్లా చెప్పమ్మా. అందుకనే మేమంతా గుబ్బస లాడి చచ్చినా నువ్వు మాత్రం కుక్కిన పేనులా ఉండి పోయావు. ఆ లడ్డూ అనేక తెలియని విషయాల్ని తెలియ జేసిందన్న మాటట. ఏమంటారు స్వాతీ."

ఈ సంభాషణ స్వాతికి నచ్చలేదు. ఆవిడ మన స్తత్వం ఎటువంటిదో స్వాతికి అనుభవమే. ఈ విందు భోజనం ఎందుకొచ్చిందోనని స్వాతి కూడా అదుర్దా పడసాగింది.

"ఏదో అయిందేదో అయిపోయింది. ఇక తర్కించి లాభం లేదు. వెళదామా జయా" అన్నది స్వాతి.

జయలక్ష్మి తలవూపింది.

"వెళ్ళొస్తామని" జ్యోతి తోను, తల్లితోనూ చెప్పి వచ్చేశారు. వాళ్ళు వెళుతుంటే ఏమీ మాట్లాడ లేక పోయింది జ్యోతి. మనస్సు కెలికినట్లయింది. తన పుట్టిన రోజు పండగ ఇన్ని సంఘటనలకు దారి తీసినందుకు ఆమె మనసు పరిపరి విధాలుగా పోయింది. దిగాలుపడి కూర్చున్న జ్యోతిని చూసి తల్లి అన్నది.

"బావ బావంటూ మీ తండ్రీకూతుళ్ళు మురిసి పోవటమే తప్ప అతనికి నీమీద ఇష్టత లేనట్లే తెలిపోయింది ఇవాళతో. మూడేళ్ళనుంచి పరిచయ మున్న వాళ్ళు ఎంత దూరం వెళ్ళుంటారో నీకేం తెల్సు. మనందరి ముందూ మాత్రం నంగనాచుల్లా ఉంటున్నారు. ఎంత కాలమని అందరి కళ్ళూ కప్పుతారు. ఇంకనయినా ఆ మురహరిని తలవకు. ఈ సంగతి మీ నాన్నగారిక్కూడా చెప్పేస్తాను. ఇంకా నయం ఇప్పటికయినా కళ్ళు తెరిచాం, ఇష్టం లేని వాడికిచ్చి నీ గొంతుకొయ్యకుండా" అన్నది తన మనసులోని ఈర్ష్యనూ, అయిష్టతనూ వెళ్ళ గక్కుతూ.

జ్యోతి తల గిరగిర తిరిగిపోతున్నది.

"అమ్మా, నీకు పుణ్యముంటుంది నువ్వీ రకంగా బయటపడుతుంటే ఇంక పరాయి వాళ్ళు అదుగో పులి అంటే, ఇదుగో తోక అంటారు. యదార్థ విషయాలు తెల్సుకోకుండా మనమే అల్లరి చేసుకోవటం మంచిది కాదు" అన్నది జ్యోతి తల్లిని అర్థిస్తూ.

ఆమె మూతి విరిచి వెళ్ళింది (సశేషం)

పుస్తక సమీక్ష

# ఎ ప్రాక్టికల్ ఇంగ్లిష్ గ్రామర్

## ఫర్ ఫారిన్ స్టూడెంట్స

ఇంగ్లిష్ లేన్‌గ్వేజ్ బుక్ సొసైటీ కర్తలు ప్రచురణము. ఎ. జె. థామ్సన్ ఎండ్ ఎ. వి. మార్టినెట్ రచన (ఎయిడ్స్ టు ఇంగ్లీషు):
అక్స్‌ఫర్డ్ యూనివర్సిటీ ప్రెస్ వెల. 2.50 రూ॥లు

శరీరానికి అస్థిపంజరం ఎటువంటిదో భాషకు వ్యాకరణం అటువంటిది. అస్థి నిర్మాణము మీదనే అంగప్రత్యంగాల సృష్టి జరుగుతుంది. ఈ సృష్టిని బట్టి సౌందర్య సౌష్టవాలు పెంపొందుతూవుంటాయి. వ్యాకరణ సూత్రాలను అనుసరించి భాషా గ్రంథనం జరుగుతుంది. అలంకారికశోభ దానిపై విలసిల్లుతూ వుంటుంది

ప్రపంచ వాఙ్మయ చరిత్రనుబట్టి మూలప్రకృతి వంటి మాతృకనుబట్టి ఒక్కొక్క భాష వృద్ధి అవుతుందని తెలుస్తుంది. రానురాను బహుళ భాషాశబ్దాలు వేర్వేరు చారిత్రిక కారణాల ననుసరించి, అందు చేరుతూ వుంటాయి. ఈ పనిలో అనుకరణ, అనుసరణ, అనువాదాలకు చోటుంటుంది. ప్రజలు పలుకుబళ్ళను బట్టి కొంత ప్రత్యేకత, కొంత స్వాతంత్ర్యం ఏర్పడుతుంది. సంస్కృత, ప్రాకృత, పాళీ, అపభ్రంశ, పైశాచి, ఉర్దూ, హిందీ, ఆంగ్లాది ధాతు శబ్దాలు తెలుగులో చేరినట్లు, 'గండరించి,' 'పోహళించి,' మున్నగు తెలుగు పదాలకు ప్రత్యేక చరిత్రలు వున్నట్లు ఏంగో శాక్సన్, ఐస్‌లేండిక్, గ్రీక్, లేటిన్, ఫ్రెంచ్, జర్మన్, మున్నగు భాషల క్రమ ప్రభావంవల్లల ఆంగ్లభాష సృష్టి అయింది. కొన్నికొన్ని చారిత్రిక కారణాలవల్ల క్రొత్త రీతిగా శబ్దాలు సృష్టి అవుతూ వుంటాయి. ఒక గుర్రము మీద సుఖీ వేరొక గుర్రపు వీపు మీదికి దుముకు అలవాటునుబట్టి ఒకే విషయంపై స్థిరత కాదు, అర్థమిచ్చే 'డి సల్టరీ' అనే శబ్దము ఇంగ్లీషులో సృష్టి అయింది. ఇంగ్లీషులో ట్రెంచ్ వ్రాసిన శబ్దచరిత్రలో ఇటువంటి దృష్టాంతాలు చాలా వున్నాయి.

ఒక్కొక్క భాషకు ఒక్కొకరీతి జాతీయ నిర్మాణం, సంధి, సమాస, విగ్రహసృష్టి ఉంటుంది. ఇంగ్లీషులో "It is raining dogs and cats" అను వాక్యబోలు నానుడులున్నాయి. "అది కుక్కల్నీ, పిల్లుల్నీ కురిపిస్తోం"దని అనకూడదు కదా ! "కుంభ వృష్టిగా వర్షం కురుస్తోం"దనే అర్థం చెప్పుకోవాలి. వంగ భాషలో "తుమార్ ముఖ్ ధికె ఫూల్ గంధ్ పొడుక్" అను వాక్యానకు శబ్దాల సహజార్థంతో అర్థం చెప్పాలంటే "నీనోటి నుండి పువ్వులూ మంచి గంధమూ పడుగాక" అని చెప్పవచ్చు. కాని దాని అర్థం అది కానే కాదు. ఒకరు ఏదేని మంచి మాట చెప్పిన పిదప "తథాస్తు" అనేటట్లు ఈ వాక్యాన్ని వంగీయులు ఉచ్చరిస్తూ ఉంటారు. "తుయీ అమార్ సోనార్ చాంద్." నీవు నా బంగారు చంద్రుడవు, అని దీని అర్థం ప్రత్యేక శబార్థం బట్టి చెప్పరాదు. "నీవు నా ముద్దు బిడ్డవు" అని తెలుగులో మనం అర్థం చెప్పుకోవాలి.

ఇక విశేష్య విశేషణ, అవ్యయ, క్రియా శబ్దాలు ఒక్కొక భాషలో ఒక్కొక రీతిగా నిర్మాణ మవుతవి. విభక్తులూ పురుషలూ వేర్వేరుగా ఉంటాయి. విశేష్యం యొక్క విభక్తి ప్రత్యయం బట్టి దాని ముందున్న విశేషణం కొన్ని భాషలలో, జర్మన్ మున్నగు వానిలో, మారుతూ ఉంటుంది. ఈ బాధ ఆంగ్ల భాషకు లేదు. సంస్కృతంలో ఏకవచన, ద్వివచన, బహువచనాలు ఉన్నాయి. ఇంగ్లీషులో ద్వివచన ప్రసక్తే లేదు. Deer, Sheep వంటి శబ్దాలకు [illegible] ఒకే వచనం ఉంది. ప్రాణ రహిత [illegible] సయితము కొన్ని స్త్రీ వాచకాలుండటం [illegible] నేర్చిన వారెరిగిన విషయమే.

తెలుగులోనూ, ఇంగ్లీషులోనూ ఈపద్ధతిలేదు. కాని ఇంగ్లీషులో Moon, Train మున్నగు శబ్దాలు స్త్రీలింగ శబ్దాలుగా గణింప బడుతూంటాయి. వర్ణ క్రమ విధానంలోనూ, ఉచ్చారణలోనూ ఇంగ్లీషుకు ప్రత్యేకత ఉంది. వర్ణములను బట్టి ఉచ్చారణ ఉంటుందని చెప్పలేము. Psychologyని సైకాలజీఅనీ, Ptolemy టాలమీఅని, Corpsను కోర్ అనీ, Rendezvous రెండవో అనీ ఉచ్చరిస్తూ ఉంటాం.

సొంతభాషలో, ఆలోచించుకొని ఆంగ్లాది పరభాషలలో ప్రసంగింపరాదు. నామవాచక, సర్వనామ, విశేష్యయములూ, క్రియా శబ్దాలూ ఈ రెండు భాషలలో వివిధ రీతులుగా ఉంటాయి. ఇంగ్లీషులో 12, రీతులుగా క్రియా శబ్దాలు మారుతవి. భూతకాలానికి సంబంధించిన రెండు క్రియలు మారుతవి. భూతకాలానికి సంబంధించిన రెండు క్రియలు ఒకదాని తరువాత ఒకటి జరిగినపుడు మొదటి క్రియను Past Perfect రూపంలోను రెండవ క్రియకు సాధారణ భూతకాల రూపంలోనూ వ్యక్తీకరించాలి. will, would, shallల ప్రయోగం వర్తమాన భూతకాలములను బట్టి మాత్రమే వేర్వేరు సందర్భాలలో, వేర్వేరు రీతులుగా వ్యక్త మవుతూ ఉంటాయి. మర్యాదతో కూడిన వేడుకోలును వ్యక్తీకరించేందుకు 'would' (will కు భూత కాలంగా కాదు) అనుశబ్దం ప్రయోగింప బడుతూ ఉంటుంది. విభిన్న శబ్దాలు విభిన్న వ్యాకరణ సూత్ర ప్రయోగాల ననుసరించి మారుతూ ఉంటాయి.

ప్రస్తుత గ్రంథంలో ఈ విషయాలను స్పష్ట వ్యక్తీకరణం కలదు. పాఠకులను ఉక్కిరి బిక్కిరి చేసే క్లిష్ట సూత్ర నిర్వచనా లందు కానరావు. సముచితమైన దృష్టాంతాలతో ఇందు వ్యాకరణ నిబంధనాలు తెలుప బడ్డాయి. ఇంగ్లీషును నిర్దుష్టంగా వ్రాయాలనీ, మాట్లాడా లనీ ఉద్దేశించే పిన్నలూ, పెద్దలూ ఈ గ్రంథాన్ని చదివి తీరాలి. అంతర్జాతీయ సాంస్కృతిక సంబంధాలు పెరుగుతూ ఉన్న ఈ రోజుల్లో, అంతర్జాతీయ ప్రధాన భాష ఆంగ్ల భాషను పలువురు నేర్చుకొన వలసిన ఈ సమయంలో ఈ గ్రంథం చాలా ఉపయోగపడుతుంది.

జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి. ★

ఫిలిం పరిశ్రమలోని పెద్దలు — నటీనటులు— సాంకేతిక నిపుణులు — శ్రేయోభిలాషులు వారింటికి వచ్చి — వారి భౌతిక దేహాన్ని చూసి, వారి కుటుంబా నికి సానుభూతి తెలిపారు. సాయంత్రం 4గంట లకు సినిమా కుటుంబంలోని చాలామంది రజనీకాంత్ ను స్మశానంనకు తీసుకుపోయి అంత్యక్రియలు జరిపారు.

ఇది వరకు "వదిన గారి గాజులు" "బలేబావ" "దీపావళి" చిత్రాలకు దర్శకత్వం వహించారు. వీరి వయస్సు 39 సం. లు. భార్యా, కుమారుడు యిద్దరు కుమార్తెలు ఉన్నారు.

## కర్నూలులో సినీనటుడు అమరనాథ్ నటి, నర్తకి రాజసులోచనలకు సన్మానం

ఈ మధ్య కర్నూలులో పార్లపాడు బంగ్లా దగ్గర ఓపెన్ ఎయిర్ థియేటర్ లో రాయలసీమ రెడ్డి బ్రదర్స్ వారు సినీనటుడు అమర్ నాథ్ కు సన్మానం జరిపారు. సినీమా నటి— నర్తకి రాజ సులోచనకు కూడా సన్మానించారు.

సన్మానానికి జిల్లా పరిషత్ చైర్మన్ శ్రీ మద్దూరి సుబ్బారెడ్డి ఎం. ఎల్. సి. అధ్యక్షత వహించారు. కర్నూలు మున్సిపల్ చైర్మన్ శ్రీ పాల్తాద్రి రామయ్యగారు స్వాగతం పలికారు.

కర్నూలు పుర ప్రజల చేత అమర్ నాథ్ కు సన్మాన పత్రం, రాయలసీమ రెడ్డి బ్రదర్స్ వారిచే పట్టు శాలువా, నటరాజ నాట్య నికేతన్ వారిచే నటరాజ విగ్రహం. ఉస్మానియా కాలేజి విద్యా ర్థులు కొన్ని పుస్తకాలు బహూకరించారు. పుర పాలక సంఘ అధ్యక్షులు శ్రీ పి. రామయ్యగారు, నటశేఖర శ్రీ సత్యనారాయణ గారు, శ్రీ ఆర్ గిడ్డయ్య చెట్టిగార్లు ఉపన్యసించారు.

శ్రీ అమరనాథ్ ఉచిత రీతిని సన్మానం సంఘం వారికి, సభికులకు కృతజ్ఞత తెలియ జేశారు.

తర్వాత సినీమా నటి, నర్తకి శ్రీమతి రాజ సులోచనచే మద్రాసులో నిర్వహించ బడుతున్న పుష్పాంజలి నృత్య కళాకేంద్రం వారిచే నృత్య ప్రదర్శన జరిగింది.

ఈ నృత్య ప్రదర్శనలో శ్రీమతి రాజసులో చన తరంగము, గొల్ల కలాపము, అర్ధనారీశ్వర, భామ కలాపము చేసింది. జొన్నలగడ్డ విజయ లక్ష్మి (పుష్పాంజలి నృత్య కళాకేంద్రం ఉపా ధ్యాయురాలు) దశావతారములు, పదాభినయం చేసింది. వీరిరువురూ కలసి భామకలాపము, పూజా నృత్యం చేశారు. బేబీ సుజాత చిన్ని కృష్ణు డుగా నటించింది.

## అంబికా ఫిలింస్ "శివరాత్రి మహాత్మ్యం"

అంబికా ఫిలింవారు కన్నడంలో నిర్మించిన, "శివరాత్రి మహాత్మ్యం" చిత్రాన్ని తెలుగులో నిర్మిస్తున్నారు. ఈ చిత్రంలో ధూళిపాళ, ప్రభా కరరెడ్డి, శోభన్ బాబు, రాజకుమార్, అశ్వద్ధ నరశింహరాజు, రాజశ్రీ, లీలావతి మొదలగు వారు నటించారు.



"దొంగపట్టిన దొర"లో బి. సరోజాదేవి



మురళీ కృష్ణలో ఒక దృశ్యం.

# సినిమా వార్తలు

13 వ పేజీ తరువాయి

ఈ చిత్రానికి మాటలు, పాటలు : ఆరుద్ర, రాజశ్రీ ఇరువురు వ్రాస్తారని నిర్మాతలలో ఒకరు తెలియజేశారు. సంగీతం : శివప్రసాద్, కళ : బి. ఎన్. కృష్ణ, నృత్యం : వి. జె. శర్మ, కూర్పు : మార్తాండ్, దర్శకత్వం : పి. ఆర్. కౌండిన్య, నిర్మాతలు : పి. ఆర్. కౌండిన్య అండ్ సత్తిరాజు.

## "పీటలమీద పెళ్లి" విడుదలకు సిద్ధం

బి. ఆర్. ప్రొడక్షన్సు బేనర్ క్రింద కీ. శే. ఘంటసాల బలరామయ్య గారి కుమారుడు ఘంట సాల కృష్ణమూర్తి నిర్మించిన సాంఘిక చిత్రం "పీటల మీద పెళ్లి" సెన్సారు అయి విడుదలకు సిద్ధంగా ఉంది.

ఈ చిత్రంలో జగ్గయ్య, చలం, రమణ మూర్తి, గుమ్మడి, రమణారెడ్డి, జానకి, కృష్ణ కుమారి మొదలగు వారు నటించారు.

ఈ చిత్రానికి సంగీతం : అశ్వద్ధామ, స్టూడియో ఫిలిం సెంటర్; నిర్మాత , దర్శకుడు : ఘంటసాల కృష్ణమూర్తి.

## నటీనటులు పుట్టిన సంవత్సరాలు వారి మొదటి చిత్రాలు

సావిత్రి 1937 సం. మొదటి చిత్రం "సంసారం", భానుమతి 1924 సం. మొదటిచిత్రం "వరవిక్రయం", అంజలీదేవి 1927 సం. మొదటి చిత్రం "గొల్లభామ", జానకి 1931 సం. మొదటి చిత్రం "షావుకారు", కృష్ణకుమారి 1934 సం. మొదటి చిత్రం "నవ్వితే నవరత్నాలు" జమున 1937 సం. మొదటి చిత్రం "పుట్టిల్లు" లక్ష్మీరాజ్యం 1920 సం. మొదటి చిత్రం "శ్రీ కృష్ణ తులాభారం", జి వరలక్ష్మి 1926 సం. మొదటి చిత్రం "బారిష్టర్ పార్వతీశం", వైజయంతిమాల 1933 సం. మొదటిచిత్రం "జీవితం", యస్. వరలక్ష్మి 1929 సం. మొదటి చిత్రం "బాలయోగిని", కుచలకుమారి 1937 సం. మొదటి చిత్రం 'మహామాయ", మాలతి 1926 సం. మొదటి చిత్రం "సుమం గళి", టి. ఆర్. రాజకుమారి 1922 సం. మొదటి చిత్రం "పార్వతి పరిణయం", రాజసులో చన 1936 సం. మొదటిచిత్రం "గుణసాగరి" గిరిజ 1936 సం. మొదటి చిత్రం "పరమానం దయ్య శిష్యులు", మరథి బాలసరస్వతి 1932 సం. మొదటి చిత్రం "ద్రోహి", లలిత 1932 సం. మొదటి చిత్రం "కన్నిక", పద్మిని 1933 సం. మొదటి చిత్రం "కన్నిక", నాగయ్య 1907 సం. మొదటిచిత్రం "సుమంగళి", యన్. టి. రామారావు 1923 సం. మొదటి చిత్రం "మనదేశం", సి. యస్. ఆర్. 1907 సం. మొదటి చిత్రం "ద్రౌపతి వస్త్రాపహరణం" గుమ్మడి 1927 సం మొదటి చిత్రం "అదృష్ట దీపుడు", అమరనాథ్ 1927 సం. మొదటి చిత్రం "జయప్రద", జగ్గయ్య 1926 సం. మొదటి చిత్రం "ప్రియురాలు", ఘంటసాల 1923 సం. మొదటి చిత్రం "సీతారామజననం" యస్ రాజేశ్వరరావు సంగీత దర్శకత్వం వహిం చిన మొదటి చిత్రం "జయప్రద", యల్. వి. ప్రసాద్ 1908 భక్తప్రహ్లాద, యోగానంద్ 1922 "అమ్మలక్కలు", తాపీచాణుక్య 1925 "అంతా మనవాళ్లే".

# సినిమా వార్తలు

## బి. ఏ. ఎస్. మైరావణ

బి. ఏ. ఎస్. ప్రొడక్షన్సువారు సదాశివబ్రహ్మం వ్రాసిన రెండు పద్యాలను రికార్డు చేసారు. ఒకటి ఘంటసాల పాడేరు. రెండవది ఘంటసాల, బాల మురళీకృష్ణ పాడేరు. మొదటిది మత్స్య వల్లభుడు (రాజనాల)తో, రెండవది ఆంజనేయుడు (రేలంగి), మత్స్య వల్లభునితో చిత్రీకరించారు.

రెండవ రోజు ఆరుద్ర వ్రాసిన ఒక పాటను, సదాశివబ్రహ్మం వ్రాసిన ఒక పద్యంను సుశీల పాడగా రికార్డు చేశారు. పాటను చంద్రసేనతోను, పద్యంను మాతంగితో చిత్రీకరిస్తారు.

రామలక్ష్మణులను హనుమంతుడు తన వాలంతో వారి చుట్టూ కోటగా కట్టి దానిపై హనుమంతుడు కూర్చొని కాపలా కాస్తుంటాడు. మైరావణుడు భూగర్భంనుండి రామలక్ష్మణులను హనుమంతునికి తెలియకుండా తీసుకు వెళ్తాడు. హనుమంతుడు తెలుసుకొని వెంటనే పాతాళలోకానికి వెళ్తాడు.

పాతాళా లోక ముఖ ద్వారము మత్స్య వల్లభుడు



సావిత్రి

కాపలా కాస్తుంటాడు. పాతాళలోకంలో ప్రవేశిస్తున్న హనుమంతుణ్ణి వెళ్లరాదంటాడు మత్స్య వల్లభుడు. ఇద్దరూ ముష్టి యుద్ధం – గదా యుద్ధం చేస్తారు. తండ్రి కొడుకులన్న విషయం ఇద్దరూ తెలుసుకుంటారు. తండ్రి అయినప్పటికీ లోపలికి పోనిచ్చేది లేదంటాడు మత్స్య వల్లభుడు. తండ్రితో యుద్ధం చేయనంటాడు. హనుమంతుడు తన గదతో మత్స్యవల్లభుడ్ని స్పృహ తప్పేట్లు కొడతాడు. అదే సమయంలో "జలచరి" ప్రవేశించి "కొడుకును కొట్టడానికి మీకు చేతులెలా వచ్చాయి" అంటూ మత్స్యవల్లభునకు పరిచర్యలు చేయ ప్రారంభిస్తుంది. జలచరిగా గిరిజ నటించింది.

పాతాళలోక ముఖద్వారం సెట్టు వీనస్ స్టూడియోలో వేసి పై సన్నివేశాన్ని చిత్రీకరించారు.

ఈ చిత్రంలో కృష్ణకుమారి, రేలంగి కాంతారావు, రాజనాల, ధూళిపాళ, రమణారెడ్డి, మిక్కిలినేని, వేని, శోభన్‌బాబు, గిరిజ, శారద మొదలగువారు నటిస్తున్నారు. ఈ చిత్రంలో ఇద్దరు నూతన నటీమణులను కూడా పరిచయం చేస్తున్నట్లు తెలుస్తుంది.

కథ: మాటలు : సదాశివబ్రహ్మం, పాటలు — పద్యములు : సదాశివబ్రహ్మం అండ్ ఆరుద్ర, సంగీతం : యస్. రాజేశ్వరరావు, ఛాయ : దత్తు, కళ: వాలి, కూర్పు : మార్తాండ్, అసోసియేట్ డైరెక్టర్ : టి. ఎస్. రామారావు దర్శకులు : నిర్మాత : బి. ఎ. సుబ్బారావు.

## భరణీ పిక్చర్సు "వివాహ బంధం"

భరణీ పిక్చర్సు వారు "సాత్ పాత్‌కె బాంధా" అనే బాక్సాఫీసు హిట్ అయిన బెంగాలీ చిత్ర కథను తెలుగులో "వివాహ బంధం" చిత్రంగా నిర్మిస్తున్నారు. ఈ చిత్రానికి మాటలు : పిచ్చేశ్వరరావు వ్రాసారు. పాటలు : సి. నారాయణరెడ్డి., ఛాయ: అన్నయ్య., కళ : రాజేంద్రకుమార్.,

భానుమతి—పి. బి. శ్రీనివాస్, పాడిన ఒక డ్యూయెట్ పాటను ఈ మధ్య రికార్డు చేశారు. సంగీత దర్శకుడు : యం. బి. శ్రీనివాస్., సంగీత పర్యవేక్షణ : పి. భానుమతి., దర్శకుడు, నిర్మాత : రామకృష్ణ. (భరణి.)

యన్. టి. రామారావు, భానుమతి, కన్నాంబ, వాసంతి, ప్రభాకరరెడ్డి, బాలయ్య, పద్మనాభం, మొదలగువారు నటిస్తున్న యీ చిత్రం త్వరలో విడుదల కానున్నది.

## అన్నపూర్ణా పిక్చర్సు "డా. చక్రవర్తి"

అన్నపూర్ణా పిక్చర్సు వారు కోడూరు. కౌసల్యా దేవి వ్రాసిన "చక్రభ్రమణం" కథను ఆధారంగా "డాక్టర్ చక్రవర్తి" చిత్రాన్ని నిర్మిస్తున్నారు. ఈ మధ్య కొసరాజు రాఘవయ్యచౌదరి వ్రాసిన కామెడీ పాటను పి. బి. శ్రీనివాస్, జానకి పాడగా రికార్డ్ చేశారు. మిగిలిన పాటలను శ్రీశ్రీ, ఆత్రేయ, ఆరుద్ర, దాశరథి, వ్రాశారు. సంగీత దర్శకుడు : యస్. రాజేశ్వరరావు., నాగేశ్వరరావు., సావిత్రి., జగ్గయ్య., జానకి., కృష్ణకుమారి., (గెస్టు,) గుమ్మడి గీతాంజలి., చలం., పద్మనాభం., జయంతి., మురళీ కృష్ణ., సంగమేశ్వరరావు మొదలగువారు నటిస్తున్నారు.

మాటలు : ఆత్రేయ, ఛాయ : సెల్వరాజ్, కళ : సుబ్బారావు, నృత్యం : పసుమర్తి, దర్శకత్వం : ఆదుర్తి. సుబ్బారావు, నిర్మాత : దుక్కిపాటి. మధుసూధనరావు.

## బాబూమూవీస్ చిత్రాలలో నూతన నటీనటులు

మంచి మనసులు—మూగ మనసులు చిత్రాలను నిర్మించిన బాబూ మూవీస్ వారు నిర్మించబోయే చిత్రాలలో నూతన నటీనటులను పరిచయం చేయాలని నిర్ణయించు కున్నారు. మొదటిది "తేనె మనసులు" ఈ చిత్రంలో నటీనటు లందర్నీ క్రొత్తవార్నే ఎన్నుకుంటారు. ఈ చిత్రానికి కథ—మాటలు : ముళ్లపూడి. వెంకటరమణ— ఆత్రేయ వ్రాసారు.

రెండవ చిత్రం "విశాల నేత్రాలు" అక్కినేని. నాగేశ్వరరావు అమెరికా పర్యటన నుండి తిరిగి రాగానే ప్రారంభించ బడుతుంది. ఆంధ్ర సచిత్ర వారపత్రికలో సీరియల్‌గా శ్రీ పిలకా గణపతి శాస్త్రిగారిచే వ్రాయబడిన కథ యిది. ఈ చిత్రానికి ముళ్లపూడి వెంకటరమణ మాటలు వ్రాసారు.

ఈ రెండు చిత్రాలకు సంగీత దర్శకుడు : కె. వి. మహదేవన్., ఛాయాగ్రహణం: పి. యల్. రాయ్., దర్శకుడు : ఆదుర్తి. సుబ్బారావు., నిర్మాత : సి. సుందరం.

## తెలుగుచిత్రాలకు ప్రభుత్వ బహుమతులు

రాజ్యం పిక్చర్సు వారి "నర్తనశాల"కు అఖిల భారత స్థాయిలో ప్రశంసాపత్రం ద్వితీయస్థానంలో అందుకుంది. నగదు రూపేణా బహుమానంలో నిర్మాతకు రూ. 10,000. లు, ఆ చిత్ర దర్శకునకు రూ. 2500. లు ప్రభుత్వం యివ్వడానికి నిర్ణయించింది.

లలితా శివజ్యోతి ఫిలింస్ వారి "లవకుశ"కు ప్రాంతీయ చిత్రంగా రజిత పతకం, ప్రశంసాపత్రం అందుకుంటుంది.

బాబూ మూవీస్ వారి "మూగమనసులు," విక్రం ప్రొడక్షన్స్ వారి "అమరశిల్పి జక్కన్న" చిత్రాలకు ప్రశంసాపత్రాలు లభించాయి.

భరణీ పిక్చర్సు వారు నిర్మిస్తున్న "వివాహ బంధం" చిత్రం మూల చిత్రకథ "సాత్ పాథ్‌కె బంధా" చిత్రానికి ప్రాంతీయచిత్రంగా రజిత పతకంను, ప్రశంసాపత్రాన్ని అందుకుంది.

సి. ధర్మారావు ★

# అవి - ఇవి - అన్నీ



## రాజేశ్వరరావుకి సన్మానం

సంగీతానికి రాళ్ళు ఎంతవరకు కరుగుతాయో తెలియదుగాని,— మొన్న మద్రాసు మహా నగరంలో ఆంధ్రకళా సమితి వారు సుప్రసిద్ధ సంగీత దర్శకులు శ్రీ సాలూరు రాజేశ్వరరావు గారికి చేసిన సన్మానానికి విచ్చేసిన ప్రేక్షకుల హృదయాలు మాత్రం కరగి, అమృతంలా ప్రవహించాయి, ఆనంద వాహినిలో వూయల లూగిన, ఆ ప్రేక్షక హృదయాలలో సంతోషం వీణగా మారి, ప్రాస్తారాలను మీటి, శ్రుతులను మ్రోగించింది.

అది నిజంగా మహాసభ. లక్షలమంది ప్రేక్షకులు లేకపోవచ్చును. మంత్రులు, ముఖ్యమంత్రులు రాక పోవచ్చును. కాని, మొక్కలను సైతం పెంచగలిగిన సంగీతానికి జీవం పోస్తున్న శ్రీ రాజేశ్వరరావు సన్మానసభ, మహాసభకాక మరేమి?

ఈ మహాసభను జరిపింది యోధాను యోధులు కాదు, అతిరథులు మహారథులు కాదు. అందరూ గుమాస్తాలే. రైల్వే శాఖలో పనిచేస్తున్న పదిమంది తెలుగు వారు ఒక చోట చేరి స్థాపించుకున్న 'ఆంధ్ర కళాసమితి' సప్తమ వర్షాలను నింపుకొని, అష్టమ వర్షంలో ప్రవేసిస్తున్న శుభ సందర్భాన్ని పురస్కరించుకొని శ్రీ రాజేశ్వరరావుకు సన్మానం చేయుటం జరిగింది.

తన చరిత్రనే, తెలుగు సినిమా రంగపు చరిత్రగా గలిగిన శ్రీ చిత్తూరు నాగయ్య సభాధ్యక్షులు. కవిత్వాని కొక నూతన నిర్వచనాన్ని చెప్పి, సాహిత్యపు సీమలో కొత్త కొత్త మార్గాలను ఏర్పరుస్తున్న శ్రీ ఆరుద్ర ఉపన్యాసకులు. అనతికాలంలోనే తారాపథాన్ని అందుకొని, ఇటీవలనే ఆంధ్రసచిత్ర వార పత్రిక నిర్వహించిన 'సినిమాబాలెట్'లో ఉత్తమ నటిగా గెలుపొందిన కుమారి కృష్ణకుమారి ఈ సభకు ప్రధాన అతిథి. వీరే 'వెన్నెల' యన్న సంచికను ఆవిష్కరించటం మరో విశేషం. శ్రీ ముదిగొండ లింగమూర్తి కూడా ప్రసంగించారు.

ఏమయినా, సభ హుందాగానే జరిగింది. అసలు, శ్రీ రాజేశ్వరరావుకు సన్మానం చేయాలన్న ఈ ఈ ప్రవాసాంధ్రుల విలువైన సంకల్పంలోనే ఎంతో 'హుందాతనం' దాగి వున్నది.

ఉపన్యాసకులందరూ శ్రీ రాజేశ్వరరావును పలు విధాలుగా వర్ణించారు. "సంగీతసామ్రాట్" అన్న బిరుదును ప్రదానం చేయుటం జరిగింది.

దక్షిణదేశం మొత్తంలో శ్రీ రాజేశ్వరరావు అగ్రగణ్యులని శ్రీ నాగయ్య అభిభాషణ. "ఉన్నతమైన భావాలు, ఉదాత్తమైన ఆశయాలు, మహా సంగీత సంపద, వీటన్నిటికి తోడు పసిపిల్లవాని మనస్తత్వం శ్రీ రాజేశ్వరరావు గారి భూషణాలు" అని శ్రీ ఆరుద్ర గారి నిర్వచనం.

"ఇలాంటి మహా వ్యక్తికి తెలుగు వారి సంగీత నాటక అకాడమీలో స్థానం లేకపోవటం ఒక వైచిత్రం" అన్న శ్రీ లింగమూర్తి గారి విమర్శ వాస్తవానికి అతి సన్నిహితంగా ఉంది.

విచిత్ర వేష ధారణ, "బంగారు సంకెళ్ళు" నాటక ప్రదర్శనం, 'వెన్నెల' సంచిక ఆవిష్కరణ, అన్యులు పాడిన "నమో వెంకటేశాయ" పాట.... సభ లోని కొన్ని ముఖ్యాంశాలు.

శ్రీ రాజేశ్వరరావుగారి మృదు మధుర సంగీతం, గాత్రమూ వినే అవకాశం కూడా ప్రేక్షకులకు కలిగింది. అర్ధ రాత్రివేళ, ఆ నిశీథంలో, అవులిస్తూ ప్రేక్షకులు కూర్చున్నారంటే వారి సంగీతం కోసమే.

ఒకటి మాత్రం నిజం — ఆంధ్రకళాసమితి వారు శ్రీ రాజేశ్వరావును గౌరవించటం, తెలుగు నాట వినవచ్చే సంగీతాన్నే సన్మానించటం. ఇలాంటి సభలు జరపటంలో 'సమితి' కార్యకర్తలకు వున్న అనుభవం చాలలేదన్న సత్యం, నగ్న సత్యమే అయినా.....ద్విగుణీకృతంగా భాసిస్తున్న వారి ఉత్సాహం, 'చురుకుదనం' శ్రద్ధ, పట్టుదల....సమితికి జీవరక్షగా నిలిచాయి. నిలుస్తున్నాయి, ఇక ముందు కూడా నిలిచి తీరుతాయి.

## హిందీ మీనాకుమారి

మీనాకుమారి 'మీనలోచన'యే కావచ్చు. ఆవిడకోసం, హిందీ ప్రేక్షక లోకమంతా తపించి తపస్సు చేయవచ్చు.........

భర్త కమాల్ అమ్రోహీని వదిలివచ్చి, సాంసారిక జీవితానికి మీనాకుమారి స్వస్తి చెప్పిందన్న వార్త మాత్రం ప్రేక్షకులను, పాఠకులనూ నివ్వెర పరచి వేసింది.

అమ్రోహీ సామాన్యుడుకాడు, అన్యుడు అంతకన్నా కాదు. అతను స్వయంగా రచయిత, దర్శకుడు కూడాను. ప్రస్తుతం 'పకీజా' అన్న హిందీ చిత్రాన్ని భారీ ఎత్తున నిర్మిస్తున్నాడు. అదే చిత్రంలో మీనాకుమారి ప్రధాన భూమికను నిర్వహిస్తున్నది.

కొలది సంవత్సరాల క్రితం కోయిలలు రాగాలు తీస్తున్న రోజుల్లో, వసంత కాలం ప్రజలను మురిపిస్తున్న మధుర క్షణాలు మీనా, అమ్రోహీలు ఒకరికొకరు పరిచయం. కారు ప్రమాదంలో గాయ పడిన మీనాకుమారిని అమ్రోహీ కంటికి రెప్పలా కాపాడి, తన ఆప్యాయతను 'సేవల ద్వారా' చెప్పుకున్నాడు. అంతే. వారి కనులు, కనులలో పాటు, హృదయాలు హృదయాలు కలిసి ఆనంద సాగరంలో ప్రవహించాయి.

కాని, యీనాడు అందుకు భిన్నంగా జరిగింది. వారి జీవిత నౌక గమ్యాన్ని చేరుకొనక పూర్వమే పెను తుఫాను వచ్చింది. హిందీ విషాద చిత్రాల మహారాణి నిజ జీవితంలో విషాద రేఖలు పొడసూపాయి. ప్రస్తుతం ఆమె సోదరి మాధురి ఇంట ఉంటున్నారు.





'పాంపన్ షో'లో పాల్గొన్న నటీమణులు జానకి; ప్రియదర్శిని.

## అవీ - ఇవీ - అన్నీ

నలుగురు పత్రికల వాళ్లనూ పిలిచి, కాఫీ ఇచ్చి, బొంబాయిలో, మీనాకుమారి తన నిర్ణయాన్ని చెప్పుకున్నది. శాంతిని అన్వేషిస్తూ, తాను, శ్రీ అమ్రోహీ నిజ జీవితం నుంచి నిష్క్రమించినట్లు చెప్పుకొన్నది. శాశ్వతంగా వారిద్దరు విడిపోవటానికి అవకాశాలు కూడా లేకపోలేదని కూడా ఆ మహానటి కథనం.

ఆవిడ వయస్సు యీనాడు 32 సంవత్సరాలు. శ్రీ అమ్రోహీది 46.

మీనాకుమారి నిర్ణయానికి అమ్రోహీ తిరుగు చెప్పలేదు. తాము నిర్మిస్తున్న "పకీజా" చిత్రం పూర్తి చెయ్యాలన్న భావం మాత్రం ఆయన వెలిబుచ్చారు. అవసరమైతే, తాను దర్శకుడుగా తప్పుకొనగలననీ, ఈ సందర్భంలో 'మీనా' ఎలా చెయ్యమంటే అలా చెయ్యగలననీ అన్నారు. ఇదీ కథ.

సినిమా నటీనటులు, వాళ్ల పెళ్ళిళ్ళు....ఇలాంటి వాటికి నేటి సంఘంలో ఏపాటి స్థానం ఉన్నదో రహస్యమేమీ కాదు. ప్రజలంతా విరగబడి సినిమాలను, నటీనటులను చూడొచ్చు కాని, పరిశ్రమలో గల 'శీలానికి' వున్న స్థానం వేరు.

ఇలాంటి ప్రమాదకర వాతావరణాన్ని, చిత్ర



పరిశ్రమను ఆవరించిన రోజుల్లో, ఈ కోవకు చెందిన వార్తలు ప్రజల అభిప్రాయాలను ధృవపరచటానికి దోహద మిస్తాయేమో!



## పుస్తక స్వీకారం

జమీన్‌రైతు క్రోధి ఉగాది సంచిక, బాపూ ముఖచిత్రంతో అనేకులు సుప్రసిద్ధుల వ్యాసాది రచనలతో మా కార్యాలయం చేరింది. సుమారు నూటపాతిక పుటలుగల యీ ప్రత్యేక సంచిక వెల రూపాయి.

* * *

ఇంతవరకు వారపత్రికగా వస్తూవున్న కినిమా పత్రిక ఇప్పుడు మాసపత్రికగా శ్రీ కె. యం. సింగ్ సంపాదకత్వాన వెలువడుతున్నది. తొలి సంచిక వెల 50 పై. పుటలు. 75. మాకార్యాలయం చేరింది.

## దుర్గాపూర్‌లోని తెలుగు నాటికకు సన్మానం

బెంగాల్‌లోని దుర్గాపూర్ ఉక్కు కర్మాగారం టౌన్‌షిప్‌లోని కమ్యూనిటీ సెంటర్ వారి ఆధ్వర్యాన జనవరి 27వ తారీకునుండి, ఫిబ్రవరి 2వ తారీకు వరకూ జరిగిన అంతర్భాషా ఏకాంకిక పోటీలలో తెలుగులో దుర్గాపూర్ ఆంధ్ర సమితివారు, భమిడిపాటి రాధాకృష్ణగారు వ్రాసిన 'మనస్తత్వాలు' అన్న నాటకాన్ని ప్రదర్శించి బహుమతి షీల్డు పొందారు. బెంగాలీ, మరాఠీ, గుజరాతీ, తమిళం, మళయాళం, కన్నడం, తెలుగు భాషల వారు పాల్గొన్న ఈ పోటీలో మొదటి స్థానం బెంగాలీ వారికి, తరువాతి స్థానం తెలుగు వారికి లభించింది.

## టి. ఐ. డయిమండ్ ఛెయిన్

ఏ. అయ్. డయిమండ్ ఛెయిన్ లిమిటెడ్ కంపెనీవారు తమ అంబత్తూర్ ఫాక్టరీలో ఇండస్ట్రియల్ చెయిన్‌ల తయారీ ప్రారంభించనున్నారు. ఇవి అనేక పారిశ్రామిక ప్రయోజనాలు కలవే కాక ప్రఖ్యాత సంస్థకి చెందినవి అవటంచేత మంచి నాణ్యం కలవిగా ఉంటాయని నమ్మవచ్చు. విదేశ ద్రవ్యం కూడా మిగులుతుంది. 

## సుశీల గ్రహించిన సత్యం—22 - దేవిక

మోహన్ చెప్పిన మాటలు ఆమెకు వుత్సాహాన్ని యివ్వలేదు

సుశీలా! యివాళ మా అక్క వస్తోందిట. టెలిగ్రాం వచ్చింది. నువ్వు ధైర్యంగా వుండాలి.

ఏమిటీ - మా అక్క వస్తోందా!

తనకిక అదృష్టం పట్టే యోగం లేదని పించిం దామెకు.

అన్నిటికీ దిగులు పడకూడదు. మా అక్కని స్టేషనుకు తీసుకు వస్తాను ముగ్గురం ఆలోచింపుదాం - నీ సంగతి

అయితే నేనింటికి వెళ్తాను.

ఇంట్లో ఒంటరిగా కూర్చున్నాక ఆమెకు అనేక ఆలోచనలు వచ్చాయి

పని పాలేదు. చుట్టూ బంధాలూ లేదు. నాకసలు అదృష్టమే లేదు. మోహన్, అక్కల మధ్య నేనెందుకు? అతను అక్కను ప్రేమించాడు.... నేనెందుకిక కూడ?

ఆమె ఒక వుత్తరం రాసి యింటికి వెళ్ళిపోయింది.

ప్రియమైన మోహన్‌కు,
నాదురదృష్టం
నీకే ఎవ్వరినీ క్షేమ
అని ప్రయోజనం
లేదు. ఇంటికి
పోతున్నాను
క్షమించు
అభాగిని
సుశీల







Edited, Printed and Published by S. Radhakrishna at the AndhraPatrika Press; 6 &7 Thambuchetty Street Madras-1. Phone: 22244 & 23713. Chief Editor S. Sambhu Prasad.



“రాముడు-భీముడు” లో ఎల్. విజయలక్ష్మి.

Regd. No. 4479 ANDHRA SACHITRA VARA PATRIKA.



మా ల తి